

రామాయణ మకరందము
నేమానవుఁడైన భక్తినింపుగఁ గ్రోలున్
క్షేమమ్ము, శుభము, ముక్తి
శ్రీమహిమయుఁగాంచి యమృతసిద్ధిఁదలిర్చున్



# సపర్య



శ్రీశేషాచలవాస! వేంకటపతీ! చిద్రూప! భక్తప్రియా!
ఈశానమ్మ త్వదీయ భావనమె కాదే! జన్మవాసింపఁగా
వైశిష్ట్యమ్ముగ నీ పదాంబురుహ సేవామాధురీధుర్యతా
ప్రాశస్త్యమ్మొక చేతరించుటకు శశ్వత్ప్రాపణీయమ్ముగన్

తిరుమల కొమ్ముపై గొలువుఁదీర్చినదేవర! వేంకటేశ్వరా!
దురితము లన్నియుందొలఁగఁద్రోయుచు భూతదయార్ద్రబుద్ధితో
నరయుచు ధర్మమున్ జగతియందుఁ బ్రబుద్ధమొనర్పఁజేయగా
నరులకు శాంతిసౌఖ్యము లనంతముగా సమకూడుటబ్రమే!

దరహాసమ్ములఁజిందు మోమభయ ముద్రాహస్తమున్, మేన నా
భరణమ్ముల్ మణివజ్ర మండితములై భాసిల్ల లోకావనో
ద్ధురితాక్షిద్వయమున్ బ్రసన్నమృదుశోభారోచిరాశిఃపరం
పరయే తోఁచును దర్శనీయముగ శుంభత్ప్రాభవోపేతమై

చిగురింపన్ నవభావపేశల సుధాశ్రీకమ్ములై కావ్యముల్
నిగదింపందగు శక్తియుక్తులుఁబురాణింపంగ సచ్ఛీలమున్
సుగుణప్రస్ఫుట మంజువర్తనము, సుశ్లోకత్వమున్, భక్తియున్
దిగుటన్ ద్వత్పదసేవనమ్మున బ్రసాదింపంగదే! చిన్మయా!

కలి పాపౌఘ నివర్తితప్రచుర కాంక్షాస్ఫూర్తి వైకుంఠమున్
విలసద్ధామమువీడి భూస్థలికి సంప్రీతిన్ బరితాపముల్
బొలివోవన్ గృప శేషశైలమున సౌముఖ్యమ్మునన్ నిల్చి శాం
తి లలింగూర్చుచు లోకబంధువుగ సాధిష్ఠమ్ముఁ జేకూర్చెదే!



కరుటూరి సత్యనారాయణ



# తోరణం

డాక్టర్ సంజీవదేవ్

ఆకాశంలోని మేఘం; మేఘంపైని మెరుపు; మెరుపులోని తేజం. భూమిమీది సముద్రం; సముద్రంపైని కెరటం; కెరటంలోని లయమయ నర్తన. మొదటిదీ రెండవదీ కూడ నిసర్గవైచిత్రిలోని అసామాన్య అభి వ్యక్తులు. రెండూ కూడ మనిషి హృదయాన్ని ఆకర్షిస్తవి. ఆకర్షించి మనిషికి ప్రసాదిస్తవి రసానుభూతిని.

ఆ రెండు దృశ్యాలనూ చూచి మామూలు మనిషి తనలో తాను మౌనంగా అనుభూతి పొందుతాడు. ఆనంద పారవశ్యంతో కనులు మూస్తాడు. ఒకసారి మేఘం వైపూ, మరోసారి కెరటంవైపూ పరీక్షగా వీక్షించి తృప్తి చెందుతాడు.

కవి అనే మనిషి కూడ అదే ఆనందాన్ని పొందుతాడు. కాని కవి లోని ఆనందం మౌనానందం కాదు. అది శబ్దానందం. మామూలు మనిషిది నిశ్శబ్దానందం అయితే కవిది సశబ్దానందం, శబ్దాల్లో కవితా రూపం ఇస్తాడు తన ఆనందానికి కవి. మామూలు మనిషి చేయలేనిదాన్ని చేస్తాడు కవి.

కవికూడ మనిషే, సందేహం లేదు. కాని కవి అందరు మనుషుల వంటి మనిషికాదు, కవులవంటి మనిషి. కవులవంటి మనిషి కనుకనే కవితా రచన చేస్తాడు. మిగతావారు కవులవంటి మనుషులు కానందున కవితా రచన చేయరు. వారు కవితా రచన చేయరు కనుక వారు కవులు కారు.

కవులందరూ మనుషులే కాని మనుషులంతా కవులు కారు. కరుటూరి సత్యనారాయణగారు కవి అయిన మనిషి, మనిషి అయిన కవి. కనుకనే రచించారు ఈ రస ఖండిక అయిన "ఆశ్రమ సందర్శనము" ను, ఇంకా అనేక ఇతర కావ్యాలను,

నేడు విశ్వవ్యాప్తంగా వున్న ఆధునిక కవిత అంతా కూడ అనిబద్ధ కవిత, ఆధునిక తెలుగు కవిత కూడ ఎక్కువభాగం అనిబద్ధ కవితయే, అంటే ఛందోబద్ధం కాని కవిత. దీన్నే ముక్తచ్ఛందం అని కూడ అంటారు; ఇంగ్లీషులో Free verse అంటారు.

సత్యనారాయణగారిది నిబద్ధకవిత — ఛందోబద్ధకవిత. వీరిది సాంప్రదాయకమైన పాండితీ పూర్ణకావ్య రచన. ఛందోనియమాలన్నీ వీరి కావ్యరచనలో పాటించబడతవి. ఆధునిక కవితల్లో కావ్యశబ్దాలు కాక మామూలు పదాలు వాడబడుతవి; కాని వీరి వాటిలో కావ్యశబ్దాలువాడబడు తవి.

ఈ "ఆశ్రమ సందర్శనము" లోని కావ్యశిల్పం మాత్రమే సాంప్ర దాయకమైంది కాక దీనిలోని ఇతివృత్తం కూడ సాంప్రదాయకమైనదే. రామాయణంలోని కొంతభాగం ఈ కావ్యంలోని కథావిషయం. ఒక కావ్యం లోని ప్రాశస్త్యం ఆ కావ్యంలోని ఇతివృత్తం మీదకంటే దానిలోని కావ్య శిల్పం మీద ఎక్కువ ఆధారపడివుంటుంది. ఆ కావ్యంలోని నీతికంటే ఆ కావ్యం రచించబడిన రీతికి ఎక్కువ విలువ వుంటుంది. కావ్యంలోని ఇతివృత్తం కవిప్రతిభకు నిదర్శనం కాదు, కావ్యశిల్పం మాత్రం కవిప్రతిభకు నిదర్శనం.

శిలా శిల్పం వున్నది. మృత్తికా శిల్పం వున్నది. ఇంకా వున్నవి దారుశిల్పం, దంతశిల్పం మొదలైనవి. కాని వీటన్నిటిలోకీ కావ్యశిల్పం ఎక్కువ సూక్ష్మమైంది. ఎక్కువ సుకుమారమైంది. ఎక్కువ నైరూప్యమైంది.

ఇతర్లవాక్కులు ధ్వని చేస్తాయేకాని చూడవు. కాని కవివాక్కు అటువంటిది కాదు; కవివాక్కు చూచే వాక్కు కూడ, అందుకే దాన్ని ప్రాచీన విజ్ఞులు 'పశ్యంతివాక్' అన్నారు. అంటే కవివాక్కు గ్రుడ్డిది

కాక, దృష్టిని కలిగివుండి చూస్తుంది. అందుకే కవివాక్కు అంత శక్తిమంత మైంది.

సత్యనారాయణగారు ఉన్నతశ్రేణికిచెందిన ప్రతిభాన్వితకవి. కనుకనే వీరికావ్యంలోని వాక్కులు 'పశ్యంతివాక్' కు సంబద్ధమైవుంటవి. వాక్పటిమ మాత్రమే ఉత్తమ కావ్యానికి లక్షణం కాదుకాని ఉత్తమ కావ్యలక్షణాల్లో వాక్పటిమ కూడ ఒకటి. కనుకనే దీన్ని నిర్లక్ష్యం చేయలేదు కవి.

''నానాధాతువిచిత్రితమ్మగుచు నానాపుష్పసంశోభితం
బై నిర్ముక్తుల వాసయోగ్యముగఁ గన్పట్టెన్ గిరీంద్రమ్ము - సం
దీన ధ్వానము సేయు పక్షిగణముల్ డింగుళ్లతో రాజస
న్మానం బిచ్చెడి భాతిఁ దోఁచె నపుడానందింప వారెల్లరున్.''

వాక్పటిమ అంటే ఎవరికీ అర్థంకాని శబ్దశిలలను దొర్లించటంకాదు. చెవికింపైన మృదుమధుర పదాలను వాడటం. ఈ కావ్యం అంతటిలోకూడ ఇటువంటి అర్థసౌలభ్యంగల వాక్పటిమ వినిపిస్తుంది. శబ్దజాలంమీద అధి కారం వున్నవారు కఠినపదాల జోలికిపోవటం అరుదు: శబ్దదారిద్ర్యం కలవారు శబ్ద కాఠిన్యపు శరణుజొచ్చుతారు।

ఈ కవికి శబ్దదారిద్ర్యపు అభావం అనంతంగా వుండటంతో కఠిన పదాల జోలికిపోవలసిన అవసరంలేదు. కనుకనే వీరి కావ్యంలో పదాలు పారిజాతాలై గుబాళిస్తవి, మందారాలై మణిదీపాలవలె ప్రకాశిస్తవి।

సత్యనారాయణగారు ఇదివరలో రచించిన ''సత్యదర్శనము'' అనే కావ్యంలోని కథముగిసిన తావునుండి ప్రస్తుత కావ్యంలో కథ మొదలవుతుంది. రాముడు సీతాలక్ష్మణులతో భరద్వాజాశ్రమం నుండి బయలుదేరి చిత్రకూట గిరిపై కొంతకాలం నివసించి అటనుండి సాగి అత్రి మహర్షి ఆశ్రమం, దండకారణ్య సీమలలోని తాపసవాటికలు, శరభంగ,

సుతీక్ష్ణ, అగస్త్య మహర్షుల ఆశ్రమాలను సందర్శించి పంచవటికి ప్ర
చేసి ఆ తావున తమ ప్రవాసకాలంలో నివాసం ఏర్పరచుకోవటంతో క
పరిసమాప్తమవుతుంది.

ఈ కథ ఈ కవిద్వారా కావ్యరూపాన్ని ధరించింది భవ్యంగా,
భరితంగా, రసరంజితంగా, ఈ కావ్యంలో ఖండకావ్యాల్లోని మాధు
మహాకావ్యాల్లోని గాంభీర్యం ప్రత్యక్షమవుతవి. ఈ కావ్యవీణ వి
రాగమాల సంవేదనాత్మకం, సందీప్తి మూలకం.

ఛందోబంధమైనది ఉత్తమకవితా, లేక ముక్తచ్ఛందమైనది ఉ
కవితా అనే ప్రశ్నేలేదు. రెండురీతుల్లోను ఉత్తమ కవితలున్నవి. ఉ
కాని కవితలున్నవి. ఛందోబద్ధాలన్నీ ఉత్తమ కవితలుకావు, ముక్తచ
లన్నీ ఉత్తమకవితలు కావు. అధునికమైనదంతా చెడ్డదీకాదు, ప్రాచీ
దంతా మంచిదీకాదు. ఆదేవిధంగా ప్రాచీనమైనదంతా చెడ్డదీకాదు. ఆ
మైనదంతా మంచిదీకాదు. రెంటిలోనూ వున్నవి మంచిచెడులు. అ
అంటాడు కాళిదాసు "పురాణమిత్యేవ నసాధుసర్వం నచాపికావ్యనవ
వద్యం" అని.

ఛందోబద్ధం అయిన కవితలో ఒక శ్రావ్యతవుంది. అది చదవ
తున్నపుడు చెవికి ఒక సునాదంకూడ వినిపిస్తుంది, భావాభివ్యక్తికి
ముక్తచ్ఛందమైన కవితలో భావాభివ్యక్తి మాత్రమే ప్రధానంకాని సు
వినిపించదు. ఛందోబద్ధ కవిత చెవికి వినిపించేరీతిలో నోటితో చదివి
కాని రాణించదు, దాన్ని లోలోపల చదువు కున్నందువల్ల దాని
అభివ్యక్తంకాదు. ఆ విధంగాకాక, ముక్తచ్ఛంద కవితలో సు
ప్రధానం కానందున దాన్ని బయటికికాక లోలోపల చదువుకున్నా
రక్తి కడుతుంది.

ఛందోబద్ధమైనంత మాత్రాన అది కవిత అనిపించుకోదు.
అనిపించుకోవచ్చు, పద్యం అనిపించుకోవచ్చు, కవిత అయినదంతా ప

కాకపోవచ్చు, కవిత అయినది గద్యంకూడకావచ్చు. కవిత అనేది ఒకేఒక రూపంకలదికాదు; అది పద్యకవితకావచ్చు, గద్యకవితకావచ్చు. అధునిక తెలుగుకవిత ఎక్కువ భాగం వచనకవిత.

సత్యనారాయణగారి కావ్యాలన్నీ పద్యకవితలు. వాటిలో భావంతో పాటు ఒక సునాదంకూడ వుంటుంది. ఛందోబద్ధమైనందువల్ల అందులో సునాదం వుంటుంది. ఛందోబద్ధమైనదాన్ని ఇంగ్లీషులో verse అంటారు, అంటే అది పద్యం అన్నమాట. పద్యాలన్నీ కవితలు కాదనటాన్నే ఇంగ్లీషులో Mere versification is not poetry అనవచ్చు. కేవలం పద్యాలు అల్లటం మాత్రమే కవితకాదు, కవితాత్మకంగా గద్యరచించినా కవిత అవుతుంది. సత్యనారాయణగారు తమ పద్యాలను కవితాత్మకంగా అల్లినందువ అవి కవితలయినవి. వచన కవులు తమ వచనాన్ని కవితాత్మకంగా రచించటంవల్ల అది కవిత అయింది.

దీన్ని బట్టి తేలింది ఏమంటే కవితాత్మకంగా రచించబడనప్పుడు కేవలం పద్యరచనకాని, గద్యరచనకాని కవితకాదు. అంటే, పద్యాన్ని, గద్యాన్ని కవితగా మార్చే కవితాశక్తి ఒకటున్నదన్నమాట. ఏమిటి అది? కవిత అనే దానికి నిర్వచనం ఏమిటి? మనకు పాత నిర్వచనం ఒకటున్నది. అదే "వాక్యం రసాత్మకం కావ్యం" అనేది, ఆ వాక్యం పద్యానికి చెందింది కావచ్చు, గద్యానికి చెందింది కావచ్చు. అదేది అయినప్పటికీ రసాత్మకంగా మాత్రం వుండి తీరాలి. అప్పుడది కావ్యమే అవుతుంది.

ఏ రచన రసాన్నిచ్చేదిగా వుంటుందో ఆ రచన కవిత అని సారాంశం. అయితే, రసాన్నిచ్చేది అంటే అర్థం ఏమిటి? ఏది రసం, ఏది కాదు? ఈ సందర్భంలో సుప్రసిద్ధ ఆంగ్లకవి విలియం వర్డ్సువర్త్ నిర్వచనం కొంత సాయపడుతుంది, ఆయన మాటల్లో కవిత అంటే "Emotion recollected in tranquility" కవిత అంటే ప్రశాంతి సమయాన తిరిగి

జ్ఞాపకం చేసుకోబడిన అనుభూతి అదే రసానుభూతి. అనుభూతి తీవ్రంగా వున్న సమయాన అది ఆవేశం మాత్రమే అవుతుంది కాని కవితకాదు. భావావేశం చల్లబడి ప్రశాంతి ఏర్పడినప్పుడు కాని అది కవితా రూపం తాల్చదు.

రసాన్ని కలిగివుండేది కవిత అన్నపుడు రసం అంటే ఏమిటి అనే ప్రశ్నలేస్తుంది. రసం అనేదాని నిర్వచనం శాస్త్రకారులననుసరించి ''సరతి ఇతిరసః'', అంటే ప్రవహించేది ఏదో అది రసం అని, ద్రవం ప్రవహిస్తుంది కనుక రసం అనేది ద్రవరూపం కలది. ద్రవం అంటే కఠినం కానిది, కరిగిన పదార్థం. ఇంద్రియాల ద్వారా బాహ్యజగత్తునుండి మానసానికి సంవేదనలు అందినప్పుడు మానసం ద్రవిస్తుంది. అంటే మానసంలో రస సృష్టి జరుగుతుంది. అటువంటి రస సృష్టిని జరుపుతుంది ఉత్తమ కవిత. కనుక ఏది అటువంటి రస సృష్టిని కలిగిస్తుందో అది ఉత్తమకవిత. ఈ ''ఆశ్రమ సందర్శనము'' పాఠకుల మానసాలను మానస సరోవరాలుగా రూపాంతర పరుస్తుంది. రసాన్ని ప్రసాదించటం ద్వారా. కాబట్టి ఈ కావ్యం ఉత్తమకావ్యాల్లో ఒకటి.

> ''మునికూటంబగు చిత్రకూటమున రాముండుండ శీతర్తువున్
> జనె - వాసంత మనోజ్ఞ దృశ్యములు వీక్షస్ఫూర్తి శోభింపగన్
> గనుగొంచున్ ధరణీప్రసూతి హృదయశాంతిన్ బ్రదర్శించుచున్
> వనలక్ష్మింబలె గోచరించె రుచిమంతంబైన ప్రేమార్ద్రితన్''

సీతారామలక్ష్మణులు భరద్వాజాశ్రమంవదలి వనసీమలగుండా కఠిన మార్గాలను నానా బాధలతో అధిగమించి చిత్రకూట పర్వతం చేరుకొన్నప్పుడు అది శీతకాలం. వారు అక్కడుండగానే వసంతం ప్రవేశించి నిసర్గ దృశ్యాలు శోభాయమానంకాగా జానకి వనలక్ష్మిగా గోచరించిందట.

ఇటువంటి రసమయకవిత ఛందోబద్ధమా; ముక్తచ్ఛందమా అనే ప్రశ్నయే ఉదయించవలసిన పనిలేదు. అయినా, ఇది ఛందోబద్ధమే. మరో కవిత:

"అకులురాలి ప్రోడులయినట్టి తరుల్ చిగురించెఁ దీవలన్
ప్రాకట పుష్పగంధములు ప్రాకెను సన్దెసలాశ్రమశాఖలన్
కోకిలపిండు తీయనగు గొంతుకలన్ దమి పాడెఁ గానన
శ్రీ కమనీయమై ముదముఁజెందెను జానకి తన్మయమ్ముగన్"

శిశిరం వసంతంగా మారిన దృశ్యం. పై కవితలో హృద్యంగా వర్ణితమైంది. సాధారణంగా కవితా లోకంలో కొన్ని ఆలోచింపచేసే కవితలుంటే అంతకంటే ఎక్కువ కవితలు అనుభూతింప చేస్తవి. పై కవిత పూర్ణంగా పాఠకుడు అనుభూతించే కవిత, ఇందులో అతిశయోక్తులు లేని స్వభావోక్తులు గల ప్రకృతి వర్ణన మనోజ్ఞంగా వున్నది.

రామాయణం అసలు ఏనాడూ జరగని కల్పితగాథ మాత్రమే అని కొందరు పురాతాత్వికులు అంటే రామాయణం కల్పనకాని ఐతిహాసిక ఘటనయే అని మరికొందరు అంటున్నారు. సరే, అది ఏదైనా మనకు ఇబ్బందిలేదు. అది కల్పన కావచ్చు, వాస్తవం కావచ్చు. రామాయణగాథ మిథ్య అయినా, రామాయణ రచన మిథ్యకాదు. రచన మిథ్య కాదని టానికి నిదర్శనం రామాయణ రచన నేటికీ నిలచివుండటమే. ఆ రామాయణ రచననుండే తీసుకున్న ఇతివృత్తం ఈ "ఆశ్రమ సందర్శనము".

అసలు రామాయణగాథ జరగలేదని అనుకోవలసిన అవసరంలేదు రామాయణ రచనలోని అతిశయోక్తులనూ, అత్యద్భుత కల్పనలను మినహాయిస్తే రామాయణగాథ జరగకుండావుండవలసినంత విచిత్రమైనదేమీ కాదు! అటువంటి గాథలు ఐతిహాసికసత్యాలుకావచ్చు కూడ ఐతిహాసిక గాథలు వస్తుగత సత్యాలు. రచనలు వ్యక్తిగత సత్యాలు రచనలు పూర్తిగా వాస్తవాలతో మాత్రమే నిండివుండవు, అవసరమై కల్పనలతో, అతిశయోక్తులతో అలౌకిక అద్భుతాలతోకూడ నిండి వుంటా

సత్యనారాయణగారి కావ్యం "ఆశ్రమసందర్శనము" ఎక్కువగా మానవతను కలిగి, అతిశయోక్తులను తక్కువ కలిగి సహజ కావ్యంగా భాసిస్తుంది. కవితలు చాలా సహజంగా, సరళంగా నడిచినవి. ప్రయత్నం లేకుండా, కొండల్లో నుండి బయటకు ప్రవహించే సెలయేళ్లవలె, ఇందు లోని కవితాఝురులు ప్రవహిస్తుంటవి. కష్టపడి వ్రాసేవి శాస్త్రీయ నిబంధాలు అవుతవి కాని సరసకవితలు కావు. ఎంతో ప్రయత్నంతో రచించినకావ్యం ఎంతో ప్రయత్నంతో చదివితేకాని బోధపడదు. ఈకావ్యం అటువంటిది కాదు. సులభంగా బోధపడటం అనేది ఉత్తమకావ్యపు ప్రధానలక్షణం కాక పోయినా కఠినంగా బోధపడటం అనేది కూడ దాని ప్రధాన లక్షణంకాదు. అయినా, సత్యనారాయణగారి కవితలు ప్రావాహికంగా, సుబోధకంగా, సహజధారగా వుంటవి,

"ఇక్కడ గల నీ శాంతియు
నిక్కడి సౌందర్య మెచటనేనియుఁ గలదా!
వక్కాణింపగఁ జాలను
నిక్కముగా నాకసీమనే పురుడించున్"

"దీనికి జంకిన మఱి యె
ద్దానికిఁ గొఱగాము కాన ధర్మము కొఱకై
మానితమగు సచ్ఛీలము
తో, నిరుపాధిగ మెలంగఁ దోఁచును సుఖముల్"

పాండిత్యానికీ కవిత్వానికీ విరోధంలేదు. రెండూ కొందరిలో సహ జీవనం చేయగలవు, కొందరిలో చేయలేవు. కవులంతా పండితులుకానట్లే పండితులంతాకూడ కవులుకారు. పాండిత్యం కవిత్వాన్ని భక్షిస్తుంది కొంద రిలో; మరి కొందరిలో కవిత్వాన్ని పాండిత్యం రక్షిస్తుంది. కవితారచనకు పాండితీగరిమ సామాన్యంగా అవసరం వుండదు కాని కవిపండితుడు కూడ అయివుంటే తన కవితకు మెరుగు అబ్బుతుంది. తాను పండితకవి అవుతాడు.

ప్రస్తుత కావ్యాన్ని రచించిన కవి పండితకవి. వారిలో కవిత్వం వున్నంత పరిమాణంలో పాండిత్యంకూడ వున్నది. అందుకని ఈ కవి పాండితీ ప్రదర్శన చేయ ప్రయత్నించరు తమ కవితారచనలో. వారు చేయాలని చేయకపోయినప్పటికీ అక్కడక్కడ వారి కవితలో పాండితీ ఛాయలు తొంగిచూస్తూనే వుంటవి, స్పష్టంగానో, సగం స్పష్టంగానో లేక అస్పష్టంగానో:

"కనువిందై రమణీయదృశ్యములు వేడ్కం గొల్పుచుండంగఁ బ్రో
వను సీతావనజాక్షి కుంభభవు నిర్వ్యాజానుకంపాపరా
యణతన్ సారెకు లోఁదలంచుచుఁ బ్రహర్షాయోగ చిత్తమ్ముతోఁ
జనుచుండెన్ మధురోక్తులన్ ధవుఁడు ప్రస్తావింపఁ దత్సంగతుల్."

పాండిత్యంలేని చాలామంది కవుల కవితల్లో మాధుర్యం వుంటుంది కాని గాంభీర్యం వుండదు. కొందరు పండితకవుల కవితల్లో గాంభీర్యం వుంటుందికాని మాధుర్యం వుండదు. సత్యనారాయణగారి కవితల్లో పండితుల గాంభీర్యమూ, కవుల మాధుర్యమూకూడ వుంటవి. మాధుర్యంలేని గాంభీర్యం వాసనలేని పూవువలె నీరసంగా వుంటుంది; గాంభీర్యంలేని మాధుర్యం మల్లెపూవువలె పేలవంగా వుంటుంది. ఉత్తమ కవితల్లో గాంభీర్య మాధుర్యాల సమ్మేళనం అవసరం. అపుడు కాని కవితాకన్య అనుమేళనతో నర్తించదు.

రామకథ అందరికీ తెలిసిందే. కాని నిపుణకవి ఆ తెలిసిన దానిలోనే తెలియని కాంతులు చూపుతాడు, సరికొత్తవింతలు చూపుతాడు తన కావ్య శిల్ప ఇంద్రజాలం ద్వారా, తన రంగురంగుల కల్పన ద్వారా, కనుకనే కవి క్రాంతద్రష్ట, సౌందర్యస్రష్ట.

"ఆశ్రమ సందర్శనము" లోని రాముని అరణ్యవాసం, దశరథుని మరణానంతరం భరతుడు రాముని అరణ్య నివాసానికి వచ్చి రామున్ని

అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యాన్ని పరిపాలించమనటం మొదలైనవ
అందరికీ సుపరిచితాలే. అయినా, పరిచితవిషయాలనే పరిచితం
తీరులో చెప్పే తీరునిబట్టి ఆ గాథ పాఠకులకు నవ్యరూపంలో ప్రత
మవుతుంది.

ఒకనాడు ఆ అరణ్య ప్రాంతంలో కొంత అలజడితో కూ
వింతవాతావరణం గోచరించసాగింది.

"రోదోంతరమ్ము నిండెను
మేదురముగ ధూళితోడ మిసిమింతలుగా
చీఁదఱితో విపినంబున
నేదియుఁ దెలియంగరాక నెల్లరుఁ జూడన్"

"గాలి బిగఁబట్టె నెజ్జనిడాలు దోఁచె
హరిత పత్రంబులందున - నందమైన
శాంతిహావణిల్లె వనసీమ కాంతిదక్కి-
వింతయలజడితో నెంతొ విహ్వలించె."

ఇటువంటివేళ వన మృగాలు పరుగులు తీసినవట. వన్య విహంగాలు
ఎగిరిపోయినవట. సుదూరంలో అస్పష్టంగా సైన్యరేఖలు కనిపించినవట
అంతటితో రాముడు లక్ష్మణుని పిలిచి విషయం చెప్పి ఆ విశేషమేమిటో
వివరంగా తెలుసుకోమంటాడు. ఆ మాటలు విన్న లక్ష్మణుడు ఒక మహ
వృక్షం ఎక్కి ఆ వస్తున్న సమూహాన్ని చూచి దిగివచ్చి తన అన్నకు
తెలుపుతాడు. భరతుడు సైన్యాలను వెంట తీసుకవస్తున్నాడు మనతో
పోరాడే నిమిత్తం అని. భరతుని రాకనుగురించి ఏమేమో వింతవింతల
ఊహాగానాన్నిచేసి భరతునికి అనేక దురుద్దేశాలను అంటగట్టి రోషంతో
రామునికి వినిపిస్తాడు. ఇక్కడ తమను ధ్వంసంచేసి తాను స్వయంగా
రాజ్యం పరిపాలించాలనే దురాకాంక్షతోనే భరతుడు ససైన్యంగా తమ

తావుకు వస్తున్నట్లు రామునకు తెలుపుతాడు. అన్ననూ, వదిననూ సంబోధిస్తూ లక్ష్మణుడు అంటాడు :

"అన్నా ! జానకి ! చూచిరే ! భరతుదౌష్ట్యం బెట్టిదో యెంతగా
సన్నాహంబున వచ్చుచుండెనొ ! మిమున్ సంగ్రామ రంగమ్ములో
చెన్నారంగను గెల్చి శాశ్వతముగా సిద్ధింపఁ దానేలగా
మన్నున్ మిన్నును బట్టకుండ నెటు వైమత్యంబునన్ వచ్చునో",

తెలుగు సహృదయుల్లో మంచికవిత్వంగురించి ఒకమాట వ్యాప్తిలో వుంది ; అదే 'కమ్మని కవిత్వం' అనేది. వారికి నచ్చిన కవితను చదివి దాన్ని 'కమ్మని కవిత్వం' అంటారు. అదేవిధంగా పై కవిత నిజంగా కమ్మని కవిత్వం. సరళమైన వచనం పలికినట్లే వుంటుంది. కాని తీరా చూస్తే అది వచనంకాదు, వచనకవిత్వంకూడ కాదు ; అది పద్యకవిత్వమే. కవితాసక్తిఁ గల పాఠకులకు సత్యనారాయణగారి కవితాశక్తిలో కమనీయకాంతులు కనిపిస్తవి ! వస్తున్న భరతుని గురించి ఇంకా అంటాడు లక్ష్మణుడు ;

"ఆతఁడొ మెత్తని పులి - యిఁక
మాతయొ పగఁబట్టు సర్పమై క్రూరముగా
భీతియొకింత యెఱుంగరు
నీతియు, నియమమ్ము లేవు నిర్దయులగుటన్"

"పిచ్చిగ దండునుద్యోగాని
వచ్చెను రణమందు గెలువ వచ్చు నటంచున్
చిచ్చొడి గట్టెను భరతుఁడు
సచ్చరితుండెట్టులౌను ? స్వార్థపరుండే !"

లక్ష్మణుని తొందరపాటు, భావావేశపు పొంగు, ఉడుకురక్తపు దూకుడు మొదలైనవి కళ్లకు కట్టినట్లు చిత్రించబడినవి. పైపద్యాల్లో,

సందర్భశుద్ధి, పాత్రౌచితి మొదలైనవాటిని కవి కమనీయంగా పోషించారు. ఈ కావ్యంలో పాత్రపోషణ, చరిత్ర చిత్రణ కథారచనకేకాక కావ్యరచనకు కూడ వెలుగు కలిగిస్తవి ! వాటి అభావం వాటి అభావమే !

తెలుగులో కవిత్వం క్రీ. శ. పదకొండవ శతాబ్దానికి ముందు లేదనే కొందరి నమ్మకం. అంటే, నన్నయకు పూర్వం తెలుగు కవిత్వం లేదని, నన్నయకు పూర్వం తెలుగులో కవిత్వం లేకుండా వుంటే నన్నయ కవిత్వం అంతగా వికసించివుండటానికి ఎట్లా వీలుండేది ? అంతకుముందు కూడ తెలుగుకవిత్వం వుండబట్టే నన్నయ కవిత్వం అటువంటి వికసితస్థితి నందు కొన్నది. అంతకుముందున్న తెలుగుకవిత్వం గ్రంథరూపంలో లేకపోవచ్చు కాని కొన్నిప్రాచీన శాసనాల్లో వున్నట్లు ఆధారాలున్నవి. అయితే నన్నయకు పూర్వం వున్న తెలుగుకవిత్వం మార్గకవిత్వం కాక దేశికవిత్వ రూపంలో వుండేది ఎక్కువభాగం. దేశి, లేక జానపద కవిత్వం అతిప్రాచీన కాలం నుండి తెలుగులో వున్నది. నన్నయ చేసిన మౌలిక కవితారచనల అస్తిత్వాన్ని గురించి మనకంతగా తెలియదు. నన్నయ ప్రఖ్యాతి వ్యాప్తి చెందింది ఆయన చేసిన అనువాద సాహిత్యం వల్లనే.

తెలుగుకవితను కొన్ని కాలాల క్రింద విభజించవచ్చు. ఆదిమ జానపదయుగం, పౌరాణికయుగం, ప్రబంధయుగం, భావకవిత్వయుగం, అభ్యుదయయుగం, విప్లవరచయితలయుగం, దిగంబరకవిత్వయుగం మొదలైనవిగా, సత్యనారాయణగారి కావ్యరచనలు ప్రబంధయుగానికి చెందినవి. నిజానికి తెలుగుకవిత వైవిధ్యాన్ని కౌశలాన్ని సంపాదించుకున్నది ప్రబంధయుగంలోనే, సత్యనారాయణగారి "ఆశ్రమసందర్శనము" పురాణసాహిత్యమైన రామాయణానికి చెందివుంటే దాన్ని ప్రబంధయుగానికి చెందిందని అనటం సమంజసమా ? అవును, సమంజసమే, ఈ కావ్యంలోని ఇతివృత్తం పౌరాణికం కాని, కావ్యరచన పౌరాణికయుగానికిచెందింది కాదు; అది ప్రబంధయుగానికి చెందిందే.

ఒక తెలుగుకావ్యపు గొప్పతనం అది అచ్చతెలుగులో వ్రాయ బడిందా, లేక సంస్కృత తెలుగులో వ్రాయబడిందా అనేదాని మీద ఆధార పడి వుండదు. రెంటిలో ఏదైనా ఒకటే, నేడు ఏ ప్రాంతంలో కూడ సంస్కృత స్పర్శలేని సాహిత్యం లేదు. ద్రావిడ భాషలనబడే తెలుగు, కన్నడ, తమిళ, మళయాళాలు నేడు శుద్ధద్రావిడ భాషలుగా లేవు. ఈ నాలుగు భాషలూ కూడ సంస్కృత శబ్దాలమయం. ప్రత్యేకించి తెలుగు ప్రబంధకావ్యాలు క్రియాపదాలను వదలితే మొత్తం సంస్కృత శబ్దాలనే కలిగి వుంటవి.

పై సత్యమే వర్తిస్తుంది "ఆశ్రమ సందర్శనము"కు కూడ. అసలు గ్రంథనామమే మొత్తం సంస్కృతమయం. దీన్ని మనం కాదనలేము. నేడు అచ్చతెలుగు తెలుగువారికెవరికీ అర్థంకాదు. వసంతకాలం అనే సంస్కృతపదం తెలిసినంత బహుళంగా ఆమని అనే అచ్చ తెలుగు పదం తెలియదు. తెలుగు రచనల్లో సంస్కృతపద బాహుళ్యం వుండటాన్ని మనం గర్హించవలసిన అవసరం లేదు.

"ఆశ్రమ సందర్శనము"లోని కవితలన్నీ సుందరమైన సంస్కృత పదావళితో నిండివున్నవి. అదొక గుణమే కాని దోషముకాదు. ఈ క్రింది పద్యంలో తెలుగెంత వున్నది?

"శ్రుతిమంతు, లింగితజ్ఞులు
మతిమంతులు, యుక్తిపరులు. మాన్యులు, శూరుల్
హితవరులు మంత్రులైనను
స్థితియున్నతమగుచుఁ బొసగు దేశమునందున్"

మన భాషల్లో సంస్కృతపదాల బాహుళ్యం వున్నందుకు మనను మనం ఎందుకు కించపరచుకోవాలో తెలియటంలేదు. ద్రావిడభాషలు, సంస్కృత సంపర్కం లేకుండా శుద్ధంగా వుండిపోవటంతో గొప్పతనం

ఏమిటి? నేటి భారతదేశంలో ఆర్యులనీ, ద్రావిడులనీ వేరువేరు జాతి
లేవు. నేడు దేశమంతటా మిశ్రమ సంస్కృతియే, మిశ్రమ సభ్యత

పై సత్యాన్ని గ్రహించిన ఈ కావ్యకర్త తమకావ్యంలో విరి
అందమైన సంస్కృత పదజాలాన్ని వాడటంలో వెనకాడకపోనటం అష్ట
కరం. నేటి భావాలను అభివ్యక్తపరచటానికి అచ్చతెలుగు చాలదు.

ఈ కావ్యంలో ఎక్కువ అభిరుచికరమైన ఘట్టం రాము
అయోధ్యకు తిరిగి తీసుకుపోయేందుకు వచ్చిన భరతుని ప్రసంగాలను
జాబాలి వాచాలత్వము ముగిసేవరకు కనిపిస్తుంది. యుక్తులు, కుయుక్తు
హేతువాదాలు, ధర్మప్రశ్నాలు, వైరాగ్యాలు, వేదాంతాలు, నాస్తికవాద
ఆస్తికవాదాలు మొదలైన వెన్నో ఈఘట్టంలో ప్రత్యక్షమవుతవి.

భరతుడు మొదలు జాబాలిముని, వశిష్ఠుడు మొదలైనవారు ఎంత
బ్రతిమాలినా, అయోధ్యకు తిరిగి వెళ్ళి రాజ్యాన్ని పాలించటం అ
విధాలా ధర్మం, న్యాయం, అని ఎందరు చెప్పినా అయోధ్యకు తిరిగిపో
టానికి తిరస్కరించిన రాముని మొండితనం అభినందనీయమో
విందనీయమో నిర్ణయించటం సులభం కాదు.

ఆ సందర్భంలో జాబాలిముని శుద్ధలోకాయతునివలె నాస్తికత్వాన్ని
లౌకికవాద శ్రేష్ఠత్వాన్ని, పరలోకసుఖాల భ్రమను, ఇహలోక సుఖ
వాస్తవాన్ని, త్యాగంలోని నిరర్థకతను, భోగంలోని సార్థకతను గురిం
రామునికి చేసిన ఉద్బోధ సత్యనారాయణగారి దార్శనిక గాఢత్వాన్ని తెలు
తుంది.

జాబాలిముని రామునికి హితబోధచేస్తాడు. ఆ అరణ్యాల్లో, ధర్మ
పేర, తండ్రిమాటను నిలబెట్టే వ్యర్థమైన పితృవాక్యపాలన పేర నా
బాధలు పడేకంటే మూర్ఖత మరొకటి లేదు. స్వర్గంలో సుఖంలే

నరకంలో బాధలేదు. అంతాకూడ స్వార్థపరులైన ధార్మికులు సృష్టించిన మిథ్యయేకాని మరొకటికాదు కనుక సక్రమమైన మార్గమేమంటే సంతోషంతో అయోధ్యకు తిరిగివెళ్ళి రాజభోగాలననుభవిస్తూ క్షేమంగా రాజ్యాన్ని పరిపాలించుటే అని. ఈ సందర్భములో చచ్చిన వారికి కర్మలు చేయడం పిండప్రదానాలు చేయటం మొదలైన ప్రేతకర్మల వ్యర్థత్వాన్ని గురించి కూడ జాబాలిఉద్బోధ చేస్తాడు.

చివరకు తేలుతుంది అదంతా జాబాలి చేసిన రాముని నమ్మించే నటన అని. అందరి ప్రయత్నాలు కూడ రాముని నిర్ణయాన్ని మార్చటంలో విఫలమవటంతో రాముని పాదుకలతో భరతుడు తిరిగి వెళ్ళిపోతాడు అయోధ్యకు. ఈ కథంతా సామాన్యంగా అందరికీ విదితమైందే. ఈ కావ్యంలోని ప్రధానమైంది. మనం మొదటే చెప్పుకున్నట్లుగా, కథ కాదు దాన్ని రచించిన విధానం.

రాముని ఈ అరణ్యవాసకాలంలోనే అనేకమంది అనార్యులైన రాక్షసులనబడేవారిని సంహరించి ఆర్యులైన ఋషులనబడేవారికి రక్షణ కల్పించటం లాంటివి రాముడు నెరవేర్చాడు. ఇంకా ఆ దండకారణ్య ప్రాంతంలో ఎక్కడా కూడ రాక్షసుడనే వానినిలేకుండా రూపు మాపి ఋషులైన తాపసుల జీవితాలకు ఆ తామసుల నుండి అభయం కల్పిస్తానని ఆశ్రమవాసులకు రాముడు వాగ్దానం చేశాడు.

రాక్షసులనబడేవారు నిజంగా ఎవరో అమానుషులైన భయంకర మానవభక్షకులు కారు. వారు కేవలం అనార్యులైన మంచి నాగరికులైన ద్రావిడజాతులు మొదలైనవారు మాత్రమే అని కొందరు చరిత్ర కారుల దృష్టి. అంటే రాముడనే ఒక ఆర్యనాయకుడు ఆర్యేతరులను సర్వనాశనం చేయటం అని.

అయితే, ఆ రాక్షసులనబడేవాళ్లను చంపటం న్యాయం కాదనీ పాప అని కూడ రామునికి తెలిసి కూడ అటువంటి హత్యలకు పూనుకొన్నాడు ఈ కావ్యంలో ఆ విషయాన్ని తెలిపే పద్యమే కావ్యకర్త స్పష్టంగా రచించారు; రాముడంటాడు :

"పాపంబంటిన నంటనీ మునులకాపత్తిన్ నివారించెదన్
లోపం బేమియు సేయ, దానవులనాలోడించి శిక్షించెదన్
రాపాడించెదఁ బ్రాణగొడ్డముల నార్పన్ క్రూరులన్ గూల్చెదన్
తాపంబున్ దొలఁగింతు నీశపథమున్ బ్రాణమ్ముగానెంచుడీ"

తాను చేసేది పాపకార్యమని తెలిసికూడ దాన్ని చేయటానికి నడు కట్టిన రాముని మొండి పట్టుదలను ఏమనాలో మరి!

కొన్నితావుల్లో గ్రంథంలో చర్చించిన కొన్ని పరస్పర వైరుధ్యాల్ని ఏవి గ్రంథకర్త కనుకూల భావాలో ఏవికావో తెలుసుకోటం కష్టం. ఈ కావ్యంలో జాబాలిముని ద్వారా పలికించిన హేతువాదపు, లోకాయ వాదపు భౌతిక దృక్పథం ఈకావ్యకర్తకు ఇష్టమైనదా, లేక ఈదృక్పథాన్ని వ్యతిరేకించుతూ రామునిచేత పలికించిన సాంప్రదాయక ధార్మి దృక్పథం కావ్యకర్తకు ఇష్టమో తెలుసుకోటం కష్టం. కవి మొగ్గు ఎటు వైపో తెలియదు. కావ్యం చదివి కవి విశ్వాసాలను తెలుసుకోటం అం సులభంకాదు. తన విశ్వాసాలకు మాత్రమే కావ్యంలో అక్షరరూపమివ్వ తన విశ్వాసాలు కానివాటికికూడ ఇస్తాడు కవి.

రాముడు సీతాలక్ష్మణ సమేతంగా దండకారణ్యంలో తిరుగుతూ ఎందరెందరో ఋషులను కలుస్తూ వారికి రాక్షసులనుండి రక్షణ కల్పిస్తాన మాట ఇస్తూ సంచారం సాగించాడు. ఆ సందర్భంలో మాండకర్ణి మహర్షి గురించి రచించిన ఈ పద్యం రోచకంగా వుంటుంది.

"మాండకర్ణి మునీంద్రుఁడు మహిమఁగలిగి
తపమునొనరించె ఘనముగ తరుణులకయి
కప్పురంబును బెట్టి తానుప్పుగొనియె
రత్నములనిచ్చి రాగిపాత్రల గ్రహించె."

తన సర్వస్వమైన కఠిన తపస్సు నిచ్చి తరుణులను తీసుకొన్నాడు మాండకర్ణిముని, దీన్ని కవి కప్పురం ఇచ్చి ఉప్పుతీసుకోటమనీ, రత్నాలిచ్చి రాగిపాత్రలను తీసుకోటమనీ అన్నారు, కాని ఆనాటి మునులు అనబడే వారిలో చాలామంది మాండకర్ణిలాంటివాళ్లే, వాళ్ల దృష్టిలో మాండకర్ణి తపః ఫలం లాంటిది ఉప్పు ఇచ్చి కప్పురం పుచ్చుకోటమే. రాగిపాత్రలిచ్చి రత్నాలు పుచ్చుకోటమే ! ఆనాటిఋషులు చాలామంది తపస్సు చేయటం స్వర్గంలోని అప్సరసల ఆలింగనాలలో ఆనందించాలనే. సిగ్మండ్ఫ్రాయిడ్ మనోవిశ్లేషణలోని ప్రధానాంశమైన కామేచ్ఛనుంచి ఋషులుకూడా బయట పడలేక పోవటం గమనించవలసిన విషయమే.

కరుటూరి సత్యనారాయణగారు ఈ కావ్యాన్ని రచించటంలోని ప్రధాన ఉద్దేశ్యం రామకథను రచించటానికి కవిత్వాన్ని సాధనగా తీసుకున్నట్లా, లేక కవిత్వాన్ని రచించటానికి రామకథను సాధనగా తీసుకున్నట్లా ? ఈ రెండు విధానాలకు భేదం ఏమిటి ? ఇతివృత్తం చేత ముందుగా ఆకర్షించబడి దానికొక కవితారూపం ఇవ్వాలనుకున్నప్పుడు ఇతివృత్తం ప్రాధాన్యం వహిస్తుంది. దాని మాధ్యమం (medium) అయిన కవిత్వం రెండవ స్థానాన్ని ఆక్రమిస్తుంది. అట్లాకాక, కవిమానసంలో కవితా కళ చక్కిలిగింత పెడుతూ తన అవ్యక్త రూపానికొక అభివ్యక్త రూపం ప్రసాదించమని కవిని వత్తిడి చేస్తున్నపుడు అందుకోసం కవి ఒక ఇతివృత్తాన్ని ఎన్నుకొంటాడు.

నిజానికి ఇతివృత్తం నుండి కవిత్వాన్ని వేరుచేసి చూడటం సులభం కాదు. అయినా, కవితారచన చేయటానికి ఇతివృత్తం అనేది ఒక సాకు

మాత్రమే కొందరు కవులకు, మరికొందరకు ఇతివృత్తాన్ని వ్యక్తపరః టానికి కవితాశిల్పం కేవలం ఒక వాహనం మాత్రమే. ఈ రెండు రీతుల్లో కూడ కొంత అసమగ్రత గోచరిస్తుంది.

మరి "ఆశ్రమసందర్శనము" కావ్యకర్త అయిన సత్యనారాయణ గారు పైరెండువిధానాల్లో దేనికి చెందుతారు అంటే ఆ రెంటిలో దేని చెందరు అని తేలుతుంది. వారి కావ్యాన్ని అనుశీలించిన తరువాత.

వారు దేనికీ చెందక ఇక చెందేది దేనికి?

రెంటి సమన్వయమైన మూడవదానికి చెందుతారు.

ఆ మూడవ విధానంలో కవి ఇతివృత్తాన్నీ కవితాశిల్పాన్నీ వేర వేరుగా గ్రహించక రెంటినీ ఒకటిగానే గ్రహిస్తారు. వస్తువూ, రూపం, రెండూ ఒకటినొకటి పెనవేసుకొని వారికి గోచరిస్తవి. మాధ్యమం నిమిత్తం ఇతివృత్తమూ కాదు. ఇతివృత్తం నిమిత్తం మాధ్యమమూ కాదు. రెండూ కూడ రెంటి నిమిత్తమే.

వారికి కవితావాక్కు వినిపించటం, విషయం కనిపించటం ఒకేసారి జరుగుతుంది. అందుకే ఈ కావ్యకర్తది 'పశ్యంతివాక్'.





# సత్యకవి రామాయణము

డాక్టర్ వి. వి. యల్. నరసింహారావు,
డైరక్టర్ ఆం. ప్ర. ప్రభుత్వ ప్రాచ్య లిఖిత,
గ్రంథాలయ - పరిశోధనాలయము

సత్కవి కవిత్వమట్లు ప్రసన్నమధుర
ములు సరస్సునగల్గు నంబువులు ; వింత
గీత వాదిత్ర ఘోషముల్ శ్రోతలకు న
మేయహర్షమ్ము సమకూర్చి హాయినిచ్చు.

[ఆశ్రమసందర్శనము 5 - 142]

ఇది మాండకర్ణిమహర్షి నిర్మిత సరోంబువులను గూర్చి సత్యనారాయణ కవివర్యుడు వర్ణించిన పద్యము. మహామహిమాన్వితుడైన ఆ ఋషి తపోబలమెట్టిదో సత్యనారాయణకవి కవితా తపోబలము అట్టిది. స్వచ్ఛ సరోంబువులవలె సత్కవి కవిత్వము ప్రసన్న మధురము; అది భవ్యభావ సంభరితమైన గీత వాదిత్ర ఘోషములతో సరసహృదయులైన శ్రోతలకు హర్షము గూర్చుటలో సచ్చెరువు లేదు.

సత్యనారాయణ సత్కవిని 'సత్యకవి' యని పిలుచుట నాకు సమ్మతము. మాండకర్ణితపస్సు పెడదారి పట్టినది. సత్యకవి తపస్సు సరియగు దారిని నడచినది. రామచంద్రుడు మాండకర్ణిని గూర్చి యిట్లనెను.

"మాండకర్ణి మునీంద్రుఁడు మహిమఁ గలిగి
తపము నొనరించె ఘనముగ తరుణులకయి
కప్పురంబును బెట్టి తాసుప్పు గొనియె
రత్నముల నిచ్చి రాగిపాత్రల గ్రహించె".

[ఆ సం - 5-150.]

మాండకర్ణివలెగాక 'సత్యకవి' ఉప్పు వెట్టి కప్పురము గొనెనా రాగిపాత్ర లిచ్చి రత్నములు గ్రహించెనా? తానే మిచ్చెనో కాని స్వీకరిం నది మాత్రము గుమగుమ వలచు కవిత్వపు కప్పురము; మనోనేత్రమునక మిరుమిట్లు గొల్పు భావరత్నములు. మీదుమిక్కిలి అవాల్మీకములై స్వతంత్రభావములు కొన్ని.

పద్యకవితయే ప్రాణముగా, ఉన్నతభావ పరంపరయే ఊపిరిగ జీవించు నిత్యకవితాజీవి 'సత్యకవి'.

ఇటీవలనే "సత్యదర్శనము" గావించి ఇప్పుడు 'ఆశ్రమసందర నము'నకు పూనుకొనెను.

సత్యపరాక్రముడైన రామచంద్రుడావేశించి సత్యకవిచే ఈ కావ పరంపర వెలయించుచున్నాడనిపించు చున్నది, రామకథ నిట్లు అంచెలం లుగా ప్రోది చేసికొనుచు క్రమముగా సంపూర్ణరామాయణ సుధను తెలుగ రసజ్ఞులకు దోసిళ్ళతో అందింప దలచెనా? కావచ్చును. కాకున్న - 'సత దర్శన'కథ నందుకొని 'ఆశ్రమసందర్శన' మారంభింపనేల?

వాల్మీకులవారు తమసానది నభివర్ణించుచు ఆ నది మంచి మన ష్యుని మనస్సువలె ప్రసన్న జలములతో రమ్యముగా నుండెనని ముత్యమ వంటి మాట పలికెను. "రమణీయం ప్రస న్నాంబు సన్మనుష్య మనోయథా' [బాల 2-5] అవును, మంచివారి మనస్సట్లే యుండును. అట్టి మంచి మనస్సు లేకున్నచో ఇట్టి మంచికావ్యము ఉద్భవింపదు.

రామచంద్రుడు సీతాలక్ష్మణ సమేతుడై వనప్రవాస కాలమున భరద్వాజాశ్రమమునుండి బయలువెడలి చిత్రకూటము చేరి క్రమముగా అత్రి శరభంగ సుతీక్ష్ణ అగస్త్య మహర్షుల ఆశ్రమములు దర్శించుట 'ఆశ్రమ సందర్శన' మందలి ప్రధాన కథ. రామాయణకథ యందలి యేక దేశమైన ఈ కథ సత్యకవిచేతబడి ఆరాశ్వాసములకు సాగి 1019 పద్యము

టుగా రూపొందినది కథ యథామూలకమే. వాల్మీకులవారు గీసిన గిరిదాటి చన్న పొడలేదు. అయినను క్రొత్తగా రామాయణము చదువుచున్న తృప్తియు, ఆనందమును కలిగినవి.

సీతారాముల ప్రేమాద్వైత భావనాప్రపంచముతో నారంభించి, పంచవటీ పర్ణశాలావాసముతో కథ ముగియును.

"అతడు ధర్మమైన ఆమె తితిక్షయౌ;
అతడు వినయమైన ఆమె శీల;
మతడు కుసుమమైన ఆయమ గంధమ్ము
అతడు నామె యిరువు రాత్మవిదులు"

పూర్వవాసనా వాసితమైన ఆత్మద్వయముయొక్క అద్వయస్థితివి ప్రేమతో పొదివి యందించిన సందర్భమిది. అట్టి సీతారాములకు రావణుని కంటె ముందే విరాధుడు వియోగము కూర్చెను. అది తాత్కాలికమే కావచ్చును; అయినను వియోగమే. బండికన్నులవాడు; బానకడుపువాడు విరాధుడు. శూలము ధరించి భయంకరముగా వచ్చి ఆ విరాధుడు సీతను పట్టికొని తన ఒడిలో కూర్చుండబెట్టుకొనెను. ధీరగంభీరుడైన దాశరథి సయితము దుఃఖితుడై బిట్టు వాపోయెనట ; తమ్ముడైన లక్ష్మణు డన్ననోదార్ప వలసి వచ్చెను. రామలక్ష్మణులు వీరావేశమునంది విరాధుని బాహువులు తెగవ్రేసిరి. ఇంతకు ఆ విరాధుడు పూర్వజన్మమున తుంబురుడను గంధర్వుడు. వైశ్రవణుని శాపముచే వికృతవేషమునంది రామబాణముచే శాపమోక్షమందెను. వానికి శాపమోక్షము; ఆశ్రమవాసులైన మునులకు మనశ్శాంతి; తపోలాభము రామచంద్రు 'నాశ్రమ సందర్శన' ఫలమిట్లు నిరూపిత మైనది. పరిశీలించి చూడగా, విరాధుడు సీతను పట్టుకొనుట యనునది శాపవిముక్తి ద్వారమున తన పాపమును పరిహరించుకొనుటకేకాని ఆమెను

కైవళము చేసికొను చెడ్డతలపుతోకాదు. ఈ అభిప్రాయము స్కాందపురాణము నందు చెప్పబడినది.

"అత్ర విరాధేన సీతాగ్రహణం స్వాఘౌఘ పరిహారార్థమేవ;
న తు దారబుద్ధ్యా— తదుక్తం స్కాందే.
సోఽపి తాం జానకీం దృష్ట్వా శీఘ్రం సంజాత విక్రమః,
ఇయం పరామహాశక్తి స్సేయం స్వర్గస్యకారణం,
అస్యా విరోధో మోక్షేఽపి కారణం బంధనేఽపి చ,
తస్మాదిమాం భజిష్యామి దిష్ట్యా ప్రాప్తం హి దర్శనం,
ఇతి దర్శనమాత్రేణ విముక్తాఘౌఘ పంజరః,
భక్తి యుక్తో జహారైనాం సీతాం చైతన్యరూపిణీ మితి
తత్త్వదీపికా"

—శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామిప్రకాశిత.
శ్రీవాల్మీకి మహర్షి ప్రణీత శ్రీరామాయణమ్ అరణ్యకాండః"
P. 12

నిజమే, రామాయణము రామాయణమే యైనను 'సీతాయాశ్చరితం మహత్' అని ఊరకే పుట్టినదా ?

'ప్రతిమ'యందు భాసుడు సీతనుగూర్చి భరతునిచే అద్భుతమైన యొకమాట పలికించెను.

'ఇదం తత్ స్త్రీమయం తేజః జాతం క్షేత్రోదరాత్ హలాత్
జనకస్య నృపేంద్రస్య తపసః సన్నిదర్శనమ్' ప్రతిమ 4-14.

క్షేత్ర గర్భమునుండి హలముఖమున నుదయించిన స్త్రీమయతేజము సీత; జనకుని తపస్సునకు ఉత్కృష్టమైన నిదర్శనము.

దానవులైనను నిరపరాధులైనను వారిని వధించుట ధర్మముకాదని సీత రామునితోనే చెప్పినది. (5-121) ఆమె మాటకు సంతసించి రాముడు

"జనక నృపాలు పుత్రివలె చక్కగఁజెప్పితి విట్లు సీత! (5-123)
అని మెచ్చుకొన్నాడు. సీతా చరితము అట్టిది.

ఆమె భరతుని రూపమునుగాంచి రాముడేయని భ్రమచెందినట్లు భాసుడు నాటకీకరించెను. రూపమేకాదు. కంఠస్వరముకూడ రామునకు వలెనే యుండునట.

"న హి రూపమేవ; స్వరయోగోఽపి సఏవ".

నిజమే; భరతుడు రూపగుణాదులచే రాముని తమ్ముడనిపించు కొన్నాడు. చిరకాలము శ్రమించి రాముడార్జించుకొన్న కీర్తి అచిరకాలము ననే భరతు డార్జించికొనెనని రాముడే అతనిని మెచ్చుకొనుట ప్రతిమ యందుగలదు. ఆయా రహస్యాంశములు సత్యకవి తలపున పొడసూపె నేమో! భరతుని భక్తి తత్త్వమును చతుర్విధముక్తి తత్త్వముగా సత్యకవి వింగడించుట సహజసుందరముగా నున్నవి. సాలోక్యముక్తి, సామీప్య ముక్తి, సారూప్యముక్తి, సాయుజ్యముక్తి యనునవే ఆ నాలుగు ముక్తులు.

భాగవతుడైన భరతుని భావమందు
పొడమె ఈ నాల్గు విధముల ముక్తులెలమి
భక్తి సాధింప ఉన్ముఖంబౌ ప్రవృత్తి
సాగుచుండెను రఘురాము సవిధమునకు [1-140]

సత్యకవి రామాయణ దర్శనము సామాన్యమైనది కాదనుటకు ఈ యొక్క ఉదాహరణము చాలును.

భరతు నభ్యర్థనము మన్నింపు మని రాము నొప్పించుటకై జాబాలి పలికిన పలుకులకును, చేసిన వాదమునకును రాముడు కన్నుల విస్ఫులింగములు గ్రక్కున రాల్చుచు ప్రోన్నతుడై ఒక్కయుదుటున లేచి నిల్చెనట ! వసిష్ఠమౌని చేసన్నచే రాము నాపవలసి వచ్చెనట. (3-90)

జాబాలి కుతర్కము రాముని కాగ్రహము కలిగించెను.

''సామంజస్యము సుంతయేని కలదే జాబాలి మౌనీంద్ర ! నీ
వామాచార కటూక్తులన్ వినగ చార్వాకమ్మొ నాస్తిక్యమో
ప్రామాణ్యమ్ముగ నెంచి చెప్పినటు కన్పట్టున్ వివాదమ్ముతో
ప్రామిన్కుల్ గమనింప దోషమగునే ? ప్రాల్మాలి వర్తింతునే ?
[3-63]

రాముని ధర్మావేశమునకు జాబాలి పక్కుమని నవ్వి
నాయనా, రామచంద్ర ! నే నాస్తికుడనె ?
నాస్తికుడనైన తపముల నవయు టేల ?
నీమనసు పట్టి చూచితి; నేమి కాదు'' [3-91]

ఇట్టి సంభాషణము పాత్రల ఆత్మలను తడవి సిద్ధహస్తుడగు కవి మాత్రమే నడుపగలిగినవి. సత్యకవికి ఆ సిద్ధి యొదవినదనుటకిది తార్కాణము.

సత్యనారాయణ కవిని సత్యకవి యంటిని. కనుక ఆయనపైగల అమేయమగు భారమునుకూడ ప్రస్తావింపవలసియున్నది. కవిపైగల భారమును కూర్చి ప్రస్తావించునపుడు కావ్యాంగములను తప్పక తడవవలసి యుండును. భరతముని నాట్య ప్రస్తానముచేయుచు తదంగములుగా జ్ఞాన

శిల్ప విద్యా కళా యోగ కర్మాదులను పేర్కొనెను (నా. శా 1-116) భామహుడు వానిని కావ్యమున ప్రయోగించి కవిపై నెంతటి భారము గలదో వివరించెను.

"న స శబ్దో న తద్వాచ్యం న సన్యాయో న సాకలా
జాయతే యన్న కావ్యాంగ మహోభారో మహాన్కవేః"

[కావ్యాలంకారము V - 4]

సర్వశాస్త్రములు కావ్యాంగములే యగుచో కవిపైగల భారమును గూర్చి ప్రత్యేకించి చెప్పవలసిన పని యేమున్నది ? ఈ బరువు బాధ్యత లెరిగిన కవి సత్యకవి. అందువలననే కాబోలు యథోచితముగ కథాసందర్భము ననుసరించి యెడనెడ తన కావ్యమునకు శాస్త్రవాసనను సోకించెను.

రాజనీతి యొక శాస్త్రము.

రామచంద్రుడు భరతునకు అట్టి రాజనీతిని రమణీయముగ నుపన్యసించెను. కుశలప్రశ్నగా నుపక్రమించి శాస్త్రచ్ఛాయగా ప్రబోధించెను కావ్యములో శాస్త్రప్రబోధ పద్ధతి యుండవలెను. లేకున్న కాంతాసమ్మితత్వ లక్షణము కోల్పోయి, కొట్టవచ్చినట్లు ప్రభుసమ్మితమై కూరుచుండును. మంత్రులెట్లుండవలెననగా —

"శ్రుతిమంతు, లింగితజ్ఞులు
మతిమంతులు, యుక్తిపరులు, మాన్యులు, శూరుల్,
హితవరులు మంత్రులైనను
స్థితి యున్నతమగుచు వొసగు దేశము నందున్" [1-35

ఇట్టి యుపదేశములు నాటి భరత పుత్రునకే కాక నేటి భరత పుత్రులకును అనుసరణీయములే. భరత పుత్రులకే కాదు, సర్వదేశములకు అనుస

ణీయములే. నీత్యుపదేశము సార్వదేశికము, సార్వకాలికము, సార్వజనీనము కనుక కావ్యములో అట్టిది అవశ్యము సంభావింప దగినది.

రాముడు దర్శించిన శరభంగాశ్రమములో వైఖానస వాలఖిల్యాది తపస్వులు పలువురు గలరు. రామాగమనముచే ధన్యులమైతి మని వారు మిక్కిలి యానందించిరి. వారి యానందము మాట అటుండనిండు. నా యానంద మేమనగా - అవైఖానసాది మహర్షు లెవరు? వారి కథ యేమి? ఈ మొదలైన అంశములు పఠితృలోకమునకు కూడ తెలియవలె నని సత్యకవి యావేదన - అందరును పండితులు కాకపోవచ్చును గదా! సంప్రదాయార్థములను తెలిసికొనవలెనను ఉత్సుకతగల సాధారణ పఠితలు పలువురుందురు. వారి సౌకర్యమునకై కాటికోలు సత్యకవి అధస్సూచిక యందు ఆయా నామముల వ్యుత్పత్త్యర్థములను వివరించెను (పుట 177) శాస్త్రప్రీతి, సహృదయుల యెడ ఆదరములేని కవి ఈ యంశములను వివరింప నొల్లడు. వివరణలో ఎంత జాగరూకత వహించెనన్నది విష యాంతరము.

రామాయణములో వాల్మీకి ఈ ఋషుల పేర్లు గుదిగ్రుచ్చి మూడు నాలుగనుష్టుప్పులలో ముచ్చటగా ప్రస్తావించెను. అందలి తొట్టతొలి శ్లోక మిది.

'వైఖానసా వాలఖిల్యా స్సంప్రక్షాళా మరీచిపాః
అశ్మకుట్టాశ్చ బహవః పత్రాహారాశ్చ ధార్మికాః' [అరణ్య 6-2]

ఇది వట్టి పేర్లపట్టిక కాదు. ప్రవృత్తిసూచకమైన సార్థక నామ పంక్తి. మచ్చున కొకటి రెండు పేర్లను వివరింతును.

బ్రహ్మ నఖములనుండి పుట్టినవారు వైఖానసులు; కేశములనుండి పుట్టినవారు వాలఖిల్యులు.

బ్రహ్మణో నఖజాతా వైఖానసాః, కేశజాతా వాలఖిల్యాః
యే నఖాః తే వైఖానసాః, యే వాలాః తే వాలఖిల్యాః

— ఇతిశ్రుతేః

ఈ వ్యుత్పత్తి శ్రుతిప్రోక్తమైనను సత్యకవికి సొంతము రుచించి నట్లు లేదు. వేరొక వ్యుత్పత్తియు కలదు.

'విఖనసమునినా ప్రోక్తం సూత్ర మధికృత్య తన్మార్గానుసారిణో వైఖానసాః' —

అనగా విఖనస మునిప్రోక్తమైన సూత్రము ననుసరించువారని యర్థము.

మరి వాలఖిల్యులనగా —

'వాలఖిల్యాస్తు న వేఽన్నే లబ్ధే పూర్వసంచితం త్యాగినః'

అనగా క్రొత్త యన్నము లభింపగా అంతకుముందు సమకూర్చు కొన్నదానిని పరిత్యజించువారని యర్థము.

ఈ యర్థములు తత్త్వదీపిక ప్రసాదించిన యర్థములు. శ్రుత్యర్థము కంటె విలక్షణములు.

సత్యకవి వైఖానస విశిష్టార్థము స్వీకరించి, వైఖానసవాలఖిల్య శ్రుత్యర్థము కలిపికట్టి, వాలఖిల్యుల కంటగట్టెను. వాలఖిల్య విశిష్టార్థము అన్వేషింపదగినదైనది.

ఏమైనను శాస్త్రప్రలోభసిద్ధమైన సందర్భము గనుక సత్యకవి సంకల్ప శుద్ధి నగ్గింతును.

మూలమందలి మూడునాలుగు శ్లోకముల నొక్కసీసమున నొదిగించి వైఖానసాదుల సమిష్టిలక్షణము సత్యకవి సంధానించిన తీరు సముచితముగా నున్నది.

సీ॥ "కల రాశ్రమమున వైఖానసుల్, వాలఖిల్యులును సంప్రక్షాళులును మరీచి

పులు, నశ్మకుట్టకుల్ .... [5-33] ఇత్యాది

ఒక్క వ్యర్థపదము కూడ లేకుండ పద్యచ్ఛందమును పరమాహ్లాద జనకముగ నడిపింపగల నేర్పు సత్యకవికి కలదు.

ఛందస్సౌందర్యాది విశేషములను గూర్చి విస్తర మనావశ్యకము. ఈ మార్గమున చిరకాలము పరిశ్రమించి జితశ్రముడైన కవి కనుక ఈయనకు గల చందోరచనా సౌలభ్యమును గూర్చి చెప్ప పనిలేదను కొందును. భావానుగుణమైన ఛందః ప్రయోగము.

కాకున్న - చెప్పదలచుకొన్న అంశములను విస్తరించి చెప్పుట ఈయన కవిత యందు కన్పట్టును. అందును వస్తువు రామకథయగుటచే భక్తి పారవశ్యముతో సవిస్తరముగ చెప్పుటయు సహజమే. అయినను కొంత సంక్షిప్తత పాటించినచో కథనములో చిక్కదనము సిద్ధించియుండెడి దనిపించును.

కావ్యనామము ఆశ్రమసందర్శనము. సీతాలక్ష్మణ సమేతుడగు రామచంద్రుడు మున్యాశ్రమసందర్శనము చేయుట ప్రధానాంశము. కనుక సముచిత నామమే. 'ఆశ్రమ' శబ్దమునకు 'పర్ణశాల' యనియు 'బ్రహ్మ చర్యాది చతురాశ్రమము' లనియ అర్థములు. ముని పర్ణశాలాసందర్శనమే కావ్యనామమున సముద్దిష్టము కాని గృహస్థుడగు రామచంద్రుడు వనవాస మిచ్ఛయించుటచే బ్రహ్మచర్య వానప్రస్థ సన్యాసములను మానసికముగా అనుభవించినవాడయ్యెను. భాసుడీభావమును గడుసుగా ప్రతిమయందు

ధ్వనింపజేసెను. రామచంద్రుడు నారచీర ధరించుచు దానిని 'ఇక్ష్వాకుల వృద్ధాలంకార' మని ప్రశంసించును అంతేకాదు; వల్కలమనునది 'తపస్సంగ్రామకవచ' మనియు, 'నియమద్విరదాంకుశ' మనియు 'ఇంద్రియాశ్వఖలీన' మనియు, ధర్మరథసారథి యనియు తత్కారణమున అది ఆనందముతో ధరింపదగినదనియు ఉద్ఘాటించును. (ప్రతిమ 1-28) ఈ సర్వమునకు సారభూతమైన అర్థము ? గార్హస్థ్యమవలంబించియు రామచంద్రుడు బ్రహ్మచర్య వానప్రస్థ సన్యాసములననుభూతికి తెచ్చుకొను సదవకాశము వనవాసము వలననే కలిగెనని యానందించుట. అనగా చతురాశ్రమ సమ్యగ్దర్శన మొదవినదనియే పరమార్థము ఇట్టి భావమును కార్యనామమునందు ధ్వనింపదలచియే సత్యకవి నామముంచెననిపించును. సత్యకవి యొక్క ప్రౌఢి ఇచ్చటను గోచరించుచున్నది.

ఆశ్రమధర్మపాలనము క్షాత్రధర్మములలో నొకటియని భావించుట రామచంద్రునంతటి పరమపురుషునకు సహజమే.

రామచంద్రుని పరమపురుషత్వమును సత్యకవి పఱుతావుల వాచ్యముగనే నొడివెను. శరభంగమహర్షి రాముని దర్శించుటకై ఎదురుతెన్నులు చూచుచు.

'కారణజన్ముడ వీవని
శ్రీరామా నాకు తెలియు, శ్రీకాంతుడ వం
చారాధించుచు చూడగ
పేరాసను వేచియుంటి పేరడవి నిటుల్ [5-28]

'నీ కన్న బ్రహ్మలోకము
నా కెక్కువకాదు నిలిచినాడను శత్రుం
డాకాంక్షించిన రమ్మని
నీకై పరమాత్మ హర్షనిర్భరమతితో' [5

అక్షయ లోకముల కవలీలగ పోగల ఆ మహాతపస్వి ( చంద్రుడే పరమ బ్రహ్మలోకమని భావించెను. ఈ భావమునిట్లు ( చించుట వలననే సత్యకవి కావ్యలక్ష్యము పూర్ణముగ సిద్ధించిన దనవచ్చు

'ఆశ్రమ సందర్శన' కావ్యము రామచంద్రుడు పంచవటి ( శించుటతో ముగియుచున్నది. స్నేహవాత్సల్య ప్రపూర్ణుడును, త్యాగవ ధర్మవీరుడును నైన జటాయు పక్షీంద్రుడు వృక్షాగ్రముల నిల్చి యా ముతో వైరులను వీక్షించుచుండగా సాక్షాద్దేవతలవలె సీతా రామలక్ష్మణ ఆత్మజ్ఞులై పంచవటియందు కాలము పుచ్చుచుండ కథ ముగియుచున్న (6-143) అనగా వాల్మీకి రామాయణ మందలి అరణ్యకాండలో తొలి : నైదు సర్గలందలి కథ 'ఆశ్రమ సందర్శన' కావ్యమునకు వస్తువైనది. రామాయణమందలి ఏకదేశమైన వస్తువు.

సత్యకవి మనస్సు అంచెలంచెలుగా ఇట్లు రామాయణ కథయం గాఢముగా లగ్నమగుటచే తత్కథయందలి యితర భాగములనుకూడ క్ర ముగా పద్య కావ్యరూపమున వెలయించునేమో !

ఎవరెన్నిసార్లు చెప్పిననేమి ? మనసుమంచిదై నోరుమంచి( చెప్పినచో రామకథ నవనవమై పతితృలోకమును పరవశింపజేయదా అందును సత్యకవికి మనసుతోపాటు నోరుకూడ చాలమంచిది. మం పలుకుబళ్ళు బళ్ళకెత్తించి 'పులకిత బ్రహ్మపథము'గా 'అక్షయ కవి(

లోకము లందు పయనింపగల ప్రజ్ఞాపాటవము సత్యకవికి శ్రీరామ చంద్రుడు ప్రసాదించినాడు. తనుక 'సత్యకవి రామాయణము' సంపూర్ణ ముగా సహృదయలోకమున కందగలదని దృఢముగా నమ్ముచున్నాను. ఇట్టి నమ్మికతోనే ఈ ముందుమాటలకు 'సత్యకవి రామాయణ' మని పేరు పెట్టితిని.

ముందుమాట ఉపక్రమించుచు మాండకర్ణి సరోవర్ణనమందలి పద్యము నుటంకించితిని. ఆ పద్యమందలి

'సత్కవి కవిత్వమట్లు ప్రసన్న మధుర
ములు సరస్సున గల్గు నంబువులు' [5-142]

అను ప్రథమార్థము, అవాల్మీకము, గీతవాదిత్ర నిర్ఘోషాదికమైన ద్వితీయార్థము వాల్మీకమే. పూర్వార్థమందును 'ప్రసన్న సలిల' మన్నంత వరకు వాల్మీకమైన భావమే.

"ప్రసన్న సలిలే రమ్యే తస్మిన్ సరసి శుశ్రువే
గీతవాదిత్ర నిర్ఘోషో నతు కశ్చన దృశ్యతే" [అర-11-7]

మరి 'సత్కవి కవిత్వ' మను ఉపమాసంపద ఎచ్చటినుండి ఊడి పడినట్లు ? సత్యకవి మనసునుండి ఊడిపడినది. తమసా జలములను వాల్మీకి మహర్షి "సన్మనుష్య మనోయథా" అన్నట్లు సత్యకవి మాండకర్ణి సరోవరజలములను సత్కవి కవిత్వమట్లు ప్రసన్న మధురములని వర్ణించెను.

ఆత్మజ్ఞుడైన కవి రచన మిట్లే యుండును. ఇట్టికవిని సమ్మానించుటకు రిక్తహస్తుడనైన నాయొద్ద నేమున్నది ? ఆయన మాటలనే అటు నిటు త్రిప్పి సమ్మానింతును.

'అమలిన సరోరుహములట్లు 'సత్యకవి' కవిత
సుప్రసన్న మధురమై విశుద్ధభావ
గీత వాద్య ప్రబంధమై శ్రోతలకు అ
మేయ హర్షమ్ముగూర్చి, ఆప్యాయమయ్యె'.

హైదరాబాద్
23-2-83

వాసిలి వేంకటలక్ష్మీ నరసింహారావు





శ్రీ కరుటూరి సత్యనారాయణ
శ్రీమతి కరుటూరి సుభద్రాదేవి



# ఉపహారము

["సాహితీ లోక బాంధవ" "కళాప్రపూర్ణ" డాక్టర్ శ్రీ దివాకర్ల
వేంకటావధాని ఎం.ఏ (ఆనర్సు) పి.హెచ్.డి. మహోదయులకు]

శ్రీరామచంద్రుఁడు చిత్రకూటమునుండి
వనవాసమున నిజప్రమద తోడఁ
దమ్మునితోఁగూడి తాపసాశ్రమముల
దర్శించుచును నగస్త్యముని వరుని
యాదేశమున రమ్యమైన పంచవటిని
నిలువంగఁ బ్రస్థాన నియతి నరుగు
ఘట్టమ్ములను గల్గు గాథను బల్కుతి
నాశ్రమసందర్శనాఖ్య కృతిని
దీని నందు కొనఁగదే! శ్రీ దివాకర్ల
వేంకటావధాని! విబుధవర్య!
శశికి నూలుపోగు చందమ్ముగా నంకి
తమ్ము నేయువాఁడ ధర్మివగుట

భవదాశీర్వచనంబుఁగోరి రసికాస్వాద్యమ్ము నా కావ్యమున్
శివమేపార నుపాయనంబు నిడగా చేతమ్మునందెంచి నా
భవమున్ సార్థకముం బొనర్చుకొను సౌభాగ్యమ్ము నాశించి, మ
త్కవితా కన్యక త్వత్కరాంబురుహాయుగ్మశ్రీకి నర్పించెదన్

ఒసపరితనముతో నుస్మానియా విశ్వ
విద్యాలయమ్ములోఁ బెక్కుసమలు
ఆంధ్రభాషాధ్యక్షులై పదవీవిర
మణ మొనరించి వాఙ్మయము పెంపు

మిఱుంగ లెక్కకు మించి గ్రంథమ్ముల
వ్యాసములన్ వ్రాసి వందలాది
సభల నుపన్యాస విభవమ్ముఁజాటుచు
సంప్రదాయమును ప్రశస్తినిలిపి

ఎన్నొ కావ్యవిమర్శల నింపితముగ
శిల్పమును, మార్మికతఁదెల్పి శేముషీ వి
శేషముల స్పష్టపఱచి, విచ్ఛిత్తి నెఱుఁగఁ
జెప్పిమెప్పింతు రభినవ శ్రీకముగను

ప్రతిభా పాండిత్యమ్ముల
నతుల రసానంద జనకమగు రచనలతో
శతవిధముల సంతుష్టిని
ప్రతిపాదించితిరి సరస బంధుర శైలిన్

మీ నిస్తుల సాహిత్యము
మీ నిర్మల భావగరిమ, మీ వైదుషియున్
మానిత రసజ్ఞలోకము
నానందింపంగఁజేయు నభినంద్యములై

సమయస్ఫూర్తియు, సత్కవి
సమయములున్, సంప్రదాయ సంస్కారమ్మున్
రమణీయ వాగ్విలాసముఁ
దమకింపగఁజేయు సభలఁ దన్మయ ఫణితిన్

సాకధునీవేగమ్మున
ప్రాకటమై సాగు మీ యుపన్యాసమ్ముల్
మీకొక విశిష్ట పీఠముఁ
జేకూర్చెన్ దెల్గుభాష చెలువముఁ దెలుపన్

ఆచార్యుండుగ నుండి యెంతటికొ మీ రాచార్య పట్టంబులన్
బ్రాచుర్యంబుగ నీయఁ దోడ్పడితి రాహా! మీకు నానృణ్యమున్
వాచింపంగ నసాధ్యమౌనుగద పర్వంజేయగా సాహితీ
రోచిస్సుల్ నలుమూల లాంధ్రభువి నేర్పుం జూపుచున్ ధీనిధీ!

మీరు కళాప్రపూర్ణులరు - మీకులభించెను డాక్టరేటు - వి
స్ఫారతర ప్రకర్షమును, సాంప్రతవర్తన, మర్థవంతమౌ
నేరిమి, కూర్మియున్ నెనరు నిండుచు భాసిలు మాటసొంపు ల
వ్వారిగ లోఁగొనున్ బుధ సభాస్థలులన్ బ్రవచించు వేళలన్

ఆపోసనముఁబట్టి రాంధ్రాంగ్ల గీర్వాణ
వాఙ్మయాంబుధి కుంభభవునిబోలె
శ్రీవిద్య సతముపాసించుచు నైష్ఠిక
త్వమ్మున ధర్మపథమ్ము వెంటఁ
బయనించుచును శిష్యవర్గమ్మునలుఁగడ
దేశమ్మునంగీర్తిఁదెచ్చుచుండ
సాహిత్యరస సమాస్వాదనలోలుప
మానసోల్లాస సంధాన పటిమ

మంజుకవితా సమీక్షల మాన్యచరిత !
సహృదయ హృదయ పంకజ సవితృఁడవయి
వినుతికెక్కుచు వైదగ్ధ్యమునఁ జెలంగు
భావుకాగ్రణి ! శ్రీవేంకటావధాని !

అవధాన పటిమలో నమరాధిపాచార్య
ధిషణాప్రభావమ్ము దీటుఁగొలిపి
సాహితీ సంస్థలు సక్రమమ్ముగ సాగ
సుచితరీతులను జేయూఁతనొసఁగి
మధురభాషణము, నిర్మలచిత్తవృత్తితో
విజ్ఞుల హృదయముల్ విరియఁజేసి
నిరవధికమ్ముగా నిరుపమకావ్య పీ
ఠికలను విరచించి కీర్తి నెఱపి

చెలువముగ నెకాడెమీ విశిష్టసభ్య
పరిచయమ్ముల నిగదించి స్థిరయశమ్ముఁ
గాంచినారు దివాకర్ల ! గాఢశీల !
కృతి సమర్పించి నేఁగృతార్థత వహింతు.

— కరుటూరి సత్యనారాయణ





కళాప్రపూర్ణ
డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు
ఎమ్ ఏ (ఆనర్సు) పి. హెచ్. డి



# కృతజ్ఞత

పరమంబైన దయావిశేషము, సుహృద్భావంబు నొప్పార సుం
దర శ్రీరామ కథోజ్జ్వలమ్మగు కృతిన్నాకంకితంబిచ్చుచుం
దరణోపాయము చూపితీ వెటులనంతంబీఋణం బీగుదున్
కరుటూర్యన్వయ దుగ్ధవార్నిధి శశాంకా! సత్యనారాయణా!

నన్నయభట్టుచేత జననాథుఁడు రాజనరేంద్రునట్లు, తి
క్కన్న కవీంద్రుచే హరిహరాత్మకుఁడా భగవంతునట్లు, పె
ద్దన్న కృతిన్ గ్రహించి తుళువాన్వయవర్యుఁడు రాయలట్లు, త్వ
త్సన్నుత కావ్య భర్తృపదసంపద నేను ప్రశస్తిఁ గాంచెదన్

తేనెవలె తియ్యనయి, స
న్మానవ మనసట్టు లమలినంబయి, ఫుల్లం
బైన సుమమట్లు రసమయ
మౌనీకృతికేను మిత్రమ! కృతజ్ఞుండన్

గ్రామంబీయగలే ననర్ఘ్యమగువస్త్రంబైన నీఁజాల, చి
త్తామోదానుగుణంబగణ్యమగు ద్రవ్యంబీ నశక్తుండ, ను
ద్ధామంబౌ భవదాదరంబునకు సత్కారంబిడంజాల, ని
స్సీమ ప్రేమభరాంతరుండనయి యాశీర్వృష్టి జాల్వార్చెదన్

రసవత్త్వత్కృతి నాయకుండయిన శ్రీరాముండు మాన్యుండు ని
న్ను సదారాత్మజబాంధవాప్తజనసందోహున్ చిరాయుర్యశో
లసదారోగ్య సుఖాది వైభవము లెల్లం గూర్చి రక్షించుతన్
ప్రసరత్త్వత్కవితామృతాపగల నోలాడన్ హరిత్కన్యకల్.

— దివాకర్ల వేంకటావధాని



# మున్నుడి

ఈ 'ఆశ్రమ సందర్శనము' కావ్యకథాంశము వాల్మీకి రామాయణాంతర్గతమగు అయోధ్యాకాండము, అరణ్య కాండములలోని ఏకదేశమగు నితివృత్తము. ఇంతకుమున్ను నేను రచించిన సత్యదర్శనము కావ్యము తరువాత కథనుండి యీ కావ్యము ప్రారంభమగును. శ్రీరామచంద్రుఁడు వనప్రవాస కాలమున భరద్వాజ మహర్షిని సందర్శించి చిత్రకూట శైలమునకు సీతాలక్ష్మణులతో బయలుదేఱి వెడలు నప్పటినుండి కావ్య మారభ్యమాణమగును. చిత్రకూట గిరిపై కొంతకాలము ప్రశాంత జీవనము చేసిన తదుపరి అచ్చటి మునీంద్రులు రాక్షస భయముతో విడిచిపెట్టుట వలన నా తావుననుండ నిష్టపడక రఘురాముఁడు భార్యా సోదరసహితుఁడై అత్రి మహర్షి యాశ్రమమున అత్రి, అనసూయలను సందర్శించెను. అనసూయ సీతాదేవికి పతివ్రతా ధర్మములను దెలిపి అంగరాగములు, మాల్యాదుల నొసంగి ఆశీర్వదించెను. శ్రీరాముఁడు వారికడ సెలవుఁ దీసికొని దండకాటవిం బ్రవేశించి అచ్చటనున్న తాపస వాటికలను సందర్శించి, ముందునకు ప్రస్థానముఁ గావించుచు మార్గమధ్యమున విరాధుఁడను పురుషాదుని వధించి శరభంగాశ్రమమునకు పోయి శరభంగమహర్షికి, మోక్షప్రదానము చేసి, దానవ సంహారమునకు ఋషుల కభయమొసంగి సుతీక్ష్ణ మహర్షిని సందర్శించి, తదుపరి ఆ ప్రాంతమునగల తాపసాశ్రమముల సందర్శించుటలో వనప్రవాస కాలమున దశవర్షములు పూర్తియైనవి. సుతీక్ష్ణమునీంద్రుని పనుపున దాశరథులు, జానకీదేవితో అగస్త్యభ్రాత యగు ఉతథ్యుని సంద

ర్శించి యచ్చటినుండి అగస్త్య మహర్షి ఆశ్రమమునకుపోయి ఆ మహా త్ముడు వైష్ణవధనుస్సును, అక్షయతూణీరమును, ఖడ్గమును రామచంద్రు నకుఁ బ్రసాదింపగా ఆమహర్షి పనుపున అచ్చటి కనతి దూరములోనున్న పంచవటిలో నివాస మేర్పరచుకొనుటకు వెడలి యచ్చట నాశ్రమమును నిర్మించుకొను పటుకుగల ప్రస్థాన విశేషములీ కావ్యమున వర్ణితములు.

ఆత్మజ్ఞుఁడగు రామభద్రునకు పట్టాభిషేకమునకు ముందు తప స్సంపన్నులగు పెక్కుమహర్షుల ఆశీఃపరంపరతో, ధర్మప్రవచనములతో మఱింత ధర్మచింతన కలుగుటకవకాశము కలిగినది. ఏవంవిధరామప్రస్థాన గాథా వివరణములతో యథాశక్తి నీ కావ్యరచన కావించుట జరిగినది. సహృదయపరిష్కృతలోకము నిది యేమాత్రమలరించినను నా జన్మ ధన్య మైనట్లు నేను భావించెదను. ఈ కావ్యమును పూజ్యులు, సాహితీలోకబాంధ వులునగు కళాప్రపూర్ణ డాక్టర్ దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. (ఆనర్సు) పి. హెచ్. డి. మహోదయుల కరకమలములలో సభక్తికముగా నుంచి హృదయ పూర్వకముగా నంకితమొనర్చుచున్నాను. వారు విద్యానిధులు, పరిణత ప్రజ్ఞులు, ధార్మిక చింతనులు, శ్రీవిద్యోపాసకులు, వాగ్మి, నిగర్వి, వినయశీలురు. ఉస్మానియా విశ్వవిద్యాలయములో చిరకాలమాచార్యత్వము నెఱపి పదవీ విరమణగావించిన వారు. అట్టి వారికీ గ్రంథమును చంద్రునకొక నూలుపోగుగా సమర్పణమొనర్చి చరితార్థుఁడనయ్యెదను.

ఈ కావ్యమును సహృదయతతో విపులసమీక్షనొనరించిన డాక్టర్ యస్. సంజీవదేవ్ డి. లిట్ మహోదయులకు, డాక్టర్ వాసిలి వేంకటలక్ష్మీ నరసింహారావు సుహృద్వర్యులకు నా హృదయపూర్వక నమస్సు మనస్సులు,

గ్రంథముద్రణము నత్యంత సుందరముగా తమ సరస్వతీ పవర్ ప్రెస్సులో చేయించిన సహృదయులు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారికి నా కృతజ్ఞతలు. ఆశ్రమసందర్శనముఖపత్రాక్షరములు వ్రాసియిచ్చిన శ్రీబుద్ధా గారికి, యిన్నర్ టైటిల్ వ్రాసియిచ్చిన చిరంజీవి యమ్. యస్. మూర్తికి నా శుభాకాంక్షలు.

ఈ గ్రంథముద్రణమునకు ద్రవ్యసహాయ మొనరించిన శ్రీతిరుమల-తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారులు శ్రీ జి. కుమారస్వామి రెడ్డి I. A. S. గారికి నా సవినమ్ర ప్రణామ సహస్రములు.

— కరుటూరి సత్యనారాయణ



# ప్రథమాశ్వాసము

శ్రీ జనకాత్మజాతయు, విశిష్టచరిత్రులు రాఘవుల్ భర
ద్వాజమహర్షివీడ్కొని. ప్రవాసముఁజేయఁగఁ జిత్రకూట మం
దోజ వసించు కాంక్షమెయి నోరిమితో వనమార్గమందు సం
పూజనముం బొనర్చు మునిముఖ్యులఁ గొల్చుచు సాగి ధర్మిలిన్ 1

పదములు బొబ్బలెక్క, నడవంగ నశక్తత దోఁప దేహమం
దదవదనొందు చిత్తమున నాత్మవిభుంగనుఁగొన్న సీతతో
నదిగో ! యదే ! ప్రియా ! దరియనయ్యెను భూధరమంచుఁబల్కుచున్
గుదుటఁబడంగ నూఱటను గూర్చెను రాముఁడు ప్రేమఁజూపుచున్ 2

శ్రీరామున్ దపనాన్వవాయు, సమరస్థేమాభిరామున్ గృపా
సారున్, సీత, విదేహరాజతనయన్, శాతోదరిన్ గానలన్
రారాపుల్ పడుచుండఁ గాంచుచు సుమిత్రాసూతి స్వాంతమ్మునన్
ఘోరామిన్ దలపోసెఁ గ్రూరవిధి చెయ్వుల్ దుష్టమైతోఁపగన్ 3

అన్నా ! మీకొనగూడిన
ఖన్నములన్ దలఁపగుండె పాడఱిపోయెన్
ఛిన్నంబయ్యెను కాల్నడ
నెన్నిదినము లెంతదూర మిటు పోవలెనో 4

మాటకునిలబడి హృదయ వి
పాటనముం జేసికొంచు వనభూములలో
మాటికి వదినెను బాలను
బాటియె నడపింప దుఃఖపాటు కదన్నా ! 5

## అగ్రజ సందర్శనము

ఎక్కడి దశరథుకోడలు ?
కక్కసమగు కఠినరథ్యఁ గారడవులలో
నెక్కడి కాల్నడపయనము ?
చిక్కులఁబడుచుండ గుండెచెదరునుకాదే 6

పురపురపొక్కు లక్ష్మణుని భూరిభుజుండు, విశాలనేత్రుఁడున్
సరగున నూఱడించుచు విషాదమునందెడె సీతఁగాంచుచున్
ధరణిజకెల్లసంగతులు తాలిమిఁజెప్పితిఁ దండ్రియాజ్ఞపై
సరిగెద కాననంబులకటంచును రావలదంచుగోమునన్ 7

సత్యము, ధర్మరక్షణము, సత్పథవర్తనమున్, సమజ్ఞయున్
బ్రత్యయబుద్ధియున్ వలయుపాలకులందఱకున్ వివేకులై
నిత్యము నిష్కళంక కమనీయ మనోధృతి లోకమాన్యులై
వ్యత్యయమేమిలేక జనవాంఛితముల్ గమనింపగావలెన్ 8

పరువు,ప్రతిష్ఠకున్ విలువ ప్రాణమునైననులెక్కసేయుటల్
జరుగదు - జన్మకున్ ఫల మజస్రము ధర్మము రక్షసేయుటే
అరిదిగ స్వార్థబుద్ధిని ప్రయత్నముసేయ సుఖంబు కోసమై
విఱుగఁబడంగ వచ్చునది వెక్కసపాటె - మఱేది కాదికన్ 9

గహనమునందుసాగుటలు కష్టమయోధ్యనునిల్చినన్ ముదా
సహమగు నాకటన్న వనవాసమునల్పగ నిచ్చగించె తా
సహరహమాత్మకింపసుఁ బ్రియంపడివచ్చెదనంచుఁ బల్కుచున్
సహనముఁగోలుపోన విరసంబుగ నుండదె సాటివారిలో 10

అనుపమ ధర్మనిర్వహణ మందున దప్పవు కష్టనష్టముల్
పనవుట మేలె ? యిద్ది పరిపాటియగున్ జగమందు కావునన్
గొనకొని సైప న్యాయమగుఁ గొంచెతనమ్మును బొందనేల ? నం
దనవనపూనెకోన ? బహుధాపురుడించునె నాకమట్టులన్ 11

దీనికి జంకిన మఱి యె
ద్దానికిఁ గొఱగాము కాన ధర్మముకొఱకై
మానితమగు సచ్ఛీలము
తో, నిరుపాధిగ మెలంగఁ దోఁచును సుఖముల్ 12

పొటమర్లుమాని జానకి
యటునిటు నడయాడువఱకు నాఁగెదమిచ్చో
దిటవరులమైన నేదియుఁ
గటువుగఁ గన్పింపఁబోదు కష్టడయున్నన్ 13

సీతామానసమెల్ల బెండువడగా స్విన్నంబులై గండముల్
స్రోతస్సుల్వలె బాష్పముల్కురియగా శోకాబ్ధిలోమున్గుచున్
వాతూలమ్మున దూలుతీవపగిదిన్ వ్రాలంగ శ్రీరాముఁడున్
ప్రీతింజూపుచు సేవలన్ దనిపె దేవిన్ సాంత్వనోక్తిచ్ఛవిన్ 14

మఱచెన్ సీత ప్రియానుషంగ మృదు సమ్మానంబునందెంత దు
ర్భరమైనన్ జరణంబులన్ గలుగు నాబాధమ్ము నెట్టెట్టులో
కరుణాసాగరుఁడా రఘూద్వహుఁడు సాగన్ ముందు మెల్లంగ ని
ర్భరముంజూపుచు వెంబడిన్ జనియె సత్త్వంబేమిలేకుండియున్ 15

అవవుల వారలట్టులఁ బ్రయాణముసేయుచు దారినెన్నియో
యిసుకపులవంచముల్ గడచి నెట్టకో చేరిరి చిత్రకూటమున్
దడయక లక్ష్మణుండపటఁ దాలిమిఁగట్టిన పర్ణశాలలో
పుడమికుమారి రాముఁడును ప్రొద్దులుపుచ్చిరి సంతసంబునన్ 16

తన్మయత్వముఁగూర్చు వాతావరణము
శాంతత భజింప భూధరప్రాంతమందు
మందపవనోర్మికలను నానందమొంది
కమలలోచన క్రొత్తయందములువోయె 17

పర్యాప్త భాగ్యులగు ముని
వర్యుల సేవించి వనమువై పుల్యమ్మున్
నిర్యాతుధాన పథకము
లర్యమకులదీపకులు వియాతులెఱుంగన్ 18

ధర్మవిచారము, జ్ఞానము
మర్మముఁ దెలియంగ జ్ఞేయమై విలసిల్లున్
ధర్మమును రక్షఁజేసిన
ధర్మము రక్షించుతాను తప్పక ప్రజలన్ 19

మునికూటంబగు చిత్రకూటమున రాముండుండ శీతర్తువున్
జనె - వాసంత మనోజ్ఞదృశ్యములు వీక్షాస్ఫూర్తిశోభింపగన్
గనుగొంచున్ ధరణీప్రసూతి హృదయక్షాంతిన్ ప్రదర్శించుచున్
వనలక్ష్మింటబె గోచరించె రుచిమంతంబైన ప్రేమార్ద్రితన్ 20

చలితగ్గెన్ శిశిరర్తువున్ గడచె భాస్వంతుండు మీనంబులోఁ
దలసూపెన్ ఝషకేతుఁడున్ కుసుమకోదండమ్ముఁ జేఁబూని పూ
ములుకుల్ వేయుటకుద్యమించె విరహుల్ ముక్ప్రొద్దుబింగాఁకతో
కలఁతన్ నిల్చిరి వేసటం బ్రియులరాకల్ గోరు చాపక్తిమై 21

మీనరాశివెనుక మేషంబువచ్చును
నజమునెక్కి తిరుగు నగ్నిదేవుఁ
డిరువురేకమైన నిఁకఁ జెప్పగానౌనె ?
విరహిజనుల బాధ వేధ యెఱుఁగు 22

ఆకులురాలి మోడులయినట్టి తరుల్ చిగురించెఁ దీవలన్
ప్రాకట పుష్పగంధములు ప్రాకెను సద్రసలాప్రశాఖలన్
కోకిలపిండు తియ్యనగు గొంతుకలం పఱిపాడెఁ గానన
శ్రీ కమనీయమై ముదముఁజెందెను జానకి తన్మయమ్ముగన్ 23

మాధవుఁడేఁగుదెంచె మధుమాసదినమ్ముల నేత్రపర్వమై
భూధరసీమ సర్వమును బొల్పెసలారెను మన్మథప్రకో
పాధిగుణమ్ము మ్రోగఁ బొలయల్కలు మాని విధూతరోషసం
శోధితనాథవైరి పరిశుద్ధమనస్కత సావధానలై 24

భవుని కంటిమంట భస్మమయ్యును భావ
భవుఁడు విరహిజనుల బాధపెట్టు
కాఁకఁజెందినట్టి కాంతలు, కాంతులఁ
గలియునంత వఱకుఁ గారుసుఖులు 25

అతినిశ్శబ్దత తాండవించు వనియందామ్రాల, నా ప్రక్క నే
రుతమౌ, ధ్వానమొయుండి యుండి తమిఁ గూర్చున్ వేదనాదమ్ములున్
శ్రుతిపేయమ్ముగ హర్షవారినిధి ముంచుఁ షట్పదీఝంకృతుల్
కుతుకంబున్ కలిగించుకోనకొక సౌఖ్యంగొల్పి లాలించుచున్ 26

సీతాసహితుఁడు రాఘవుఁ
డాతపముగఁ జిత్రకూటమందున దిరుగన్
భూతలమున శంపా జీ
మూతమ్ములలీల నెలమి బొలిచిరి మిగులన్ 27

కలకంఠకంఠి మైథిలి
పులకించుచుఁ బ్రొద్దుఁగడపె మునిపత్నులు తా
మెలమి విశేషము లెన్నియొ
కలుపుంగోల్తనముతోడ కథలుగఁ జెప్పన్ 28

ఆ మధుమాసము సీతా
రాముల కానందదాయి, రాగప్రదమై
గోముంగూర్చుచుఁ బెల్లుగ
సామంతము నెఱపె హృదయ సారసములపై 29

లలితతమాల పల్లవనైగనిగ్యమ్ము
స్నిగ్ధత యొకచోట చేరినట్లు
ఇంద్రనీలమ్ములందిగురెత్తు నైల్యమ్ము
సర్వమ్ము మృదువుగా సాగినట్లు

నల్లకల్వలలోని నవకమ్ము, స్వారస్య
        మెల్లయుఁ బ్రోవుగా నిమిడినట్లు
జలధరమ్ములలోని శ్యామల కోమల
        త్వంబెల్ల రాశియై తనరినట్లు
కనులవెన్నెల, పీనవక్షమ్ము, బాహు
వీర్యమును, ధర్మరక్షణ, వినయశీల
మాత్మసంయమ గుణము, దయాస్వభావ
మునను శ్రీరామచంద్రుండు ఘనతకెక్కె. 30

అలరుల సౌకుమార్యం బంతముద్దుగా
        మూర్తీభవించిన ముదితసీత
కోకిల గళములోకుదిరిన కాకలీ
        స్వనము గొంతున గల్గువనితసీత
హంసలగమనమ్ము నందమ్ము నడలలో
        మెలఁపుగా నెలకొన్న మెలఁతసీత
బంభరమ్ముల నీలవర్ణమ్ము సాంద్రమై
        నెరులలో నిబిడమౌ నెలఁత సీత
కనులు పాదములును కమలమ్ములే, నాస
చంపకమ్మె, తనువు చారిమమున
తప్తకాంచనమ్మె, తామరతూడులు
మృదుల బాహులగుచు మెఱయుసీత. 31

అతఁడు నీరదమైన నామె క్షణప్రభ
అతఁడు సంద్రంబైన నామె తరఁగ
అతఁడు వృక్షంబైన నాయమ లతయౌను
అతఁడు విష్ణుండైన నామె లక్ష్మి
అతఁడు చంద్రుండైన నాయమ వెన్నెల
అతఁడు రాగంబైన నామెస్వరము
అతఁడు సూర్యుండైన నాయమ పద్మమ్ము
అతఁడు దేవుండైన నామె దేవి
అతఁడు ధర్మమైన నామె తితిక్షయౌ
అతఁడు వినయమైన నామె శీల
మతఁడు కుసుమమైన నాయమ గంధమ్ము
అతఁడు నామె యిరుపురాత్మవిదులు.

హరిపాన్పు శేషాహి యవతారమైతేను
లక్ష్మణస్వామియై; లక్ష్యమెల్ల
శ్రీరామచంద్రుని సేవయేకాని త
దన్యమేమియుఁదోఁచదాత్మ కతని
కినపుల ప్రాశస్త్యమెపుడు ముఖ్యంబగు
ధర్మము తప్పని ధన్యమూర్తి
కౌసల్యయనిసచో కడలేని గౌరవం
బతని తల్లి సుమిత్ర యమృతహృదయ

యగును - నిజపత్ని యూర్మిళ చిగురుఁబోఁడి
అడుగులకు మడుగులొత్తెడియతివ, భర్త
వనములకు రామువెంబడి వచ్చునపుడు
భక్తినంగీకరించెఁ బ్రపత్తితోడ 33

నిండుమనస్సుతో నిరతమ్ముసేవించు
 సంపూర్ణభక్తి దీక్షగవహించి
తల్లిదండ్రులపైని తనపత్నిపైగల్గు
 సంబంధ బాంధవ్యసరళివీడి
అవ్వియాటంకములంచు భావించెను
 త్యాగమ్ము మూర్తిగా తనరె సతము
సౌభ్రాత్రమున రామచంద్రుని గొలువంగ
 కుంచించుకొనియన్న కూడవెడలె

కైకనెంతయొ గర్హించె కఠినచిత్త
యగుచు వనసీమకంపిన మగువయనుచు
పితరుఁడగు దశరథేశ్వర పృథ్విపాలు
నతఁడు బంధింపనుంకించె నన్నకొఱకు 34

నిద్రకు దూరమై భద్రమ్ముగాఁగాచు
 నన్నను వదినెను నదిరక్తై
పగలును, రాత్రియు బాణముల్ విల్లును
 తోడుగా తిరుగును ధూర్వహుఁడుగ

ఏ చిన్ని సవ్వడి నేనియుఁ జెవులొగ్గి
విని జాగరూకత వెడలి వలయు
కార్యనిర్వహణమ్ముఁగావించి క్రుక్కడి
మృగముల జక్కాడ మొగియునెపుడు

పోటుమగఁడుగ నిల్చుచు నాటవికుల
నాటకట్టించు - దరిఁజేర రతనిఁ జూడ
అతని కోదండపాండిత్య మద్భుతమ్ము
మేటియై సంచరించు సుమిత్రకొడుకు

అన్నయెడల లక్ష్మణున కనన్యభక్తి
నద్ది యైకాంతికంబగు నుద్దిలేదు
దానికిన్ - తనసుఖమ్మును దలఁపఁబోవ
డతనికన్నియు రాముఁడేయగును నిజము

అప్పటికొక మాసంబుగ
నొప్పులకుప్పయును రాముడుండిరి తమ్ముం
డొప్పిదముగ నిర్మించిన
చిప్పకసవుకుటిని నిలువచేరిరి తమితో

సీతారాములు వనగిరి
వాతావరణమ్ము తృప్తిపఱుప మెలంగన్
ప్రీతింజూపిరి లక్ష్మణుఁ
డోత్ప్రోతముగ నెడఁద నూఱటఁగొలుపన్

చిలుకలపల్కులన్ వినుచు చెంతకుఁజేరిన గోరువంకలున్
కులుకగ, మంజుకంఠముల కోకిలలూరక పాడుచుండగన్
నలిగొని గెంతు బాలహరిణమ్ముల బిత్తరిచూపులందముల్
గొలుపగ జానకీరమణి కోర్కెలుపండగఁ దృప్తినందగన్ 39

ఆవన కామనీయకము, నాగిరియందము, నైగనిగ్యమున్
తీవల పూలసోయగము, తిన్నెలతోడి ఫలద్రుమంబులున్
క్రేవల కొండవాగులును, రెమ్మలనూగెడి కోఁతిమూఁకయున్
తావులఁజిమ్ము మందపవనమ్ములు నెక్కొను భూధరమ్మునన్ 40

పరవశమునంది రాముఁడు
గరితను గనుగొనుచుఁబలికె కాంతా ! భువిలో
గరగరికనెల్ల నియ్యెడ
కరుణింపగఁబోలు ప్రకృతికాంత వరముగా 41

ఇక్కడగల నీశాంతియు
నిక్కడి సౌందర్యమెచట నేనియుఁగలదా !
వక్కాణింపగఁ జాలను
నిక్కముగా నాకసీమనే పురుడించున్ 42

ముక్కిడి మృగముల తాకిడి
నిక్కడఁగనఁబోము వింతయేయగుఁజుమ్మీ !
వెక్కసము తోఁచ దెయ్యెడ
చక్కదనము తప్పవేఱుచాయలు కలవే ! 43

ఆశిఖరమెంత రమణీయమై చెలంగు
నావనమ్మెంత సుందమ్ముగా విరిసెను
ఆరవములెంత మధురమ్ముగా రహించు
జ్ఞప్తికిన్ రాదయోధ్య ప్రశాంతుఁడైతి 44

నీ తోఁడ లక్ష్మణునితోఁ
చేతః ప్రీతిగను నిల్చెదర కాలమిటన్
సీతా! మనజన్మలు వడి
పూతంబగు ధన్యమగును పుణ్యంబబ్బున్ 45

బహుపక్షి సమావృతములు
బహువృక్ష సమన్వితములు ఫలపుష్పంబుల్
కుహుకుహూ రావమ్ములతో
ప్రహరితిరుగ వాంఛపొడము గ్రామము చుట్టున్ 46

ఈపర్వతమ్ము నొరయుచు
చూపట్టున్ గాంగఝురము స్ఫూర్తినొసఁగుచున్
తీపార మధురజీవన
మేపారగ నిచ్చి జనులకింపుఁ గూర్చున్ 47

పాపముల నెల్ల తొలిచెడి
యాపగ యీగంగ భూమిజా! కనుగొంటే!
ఆపన్నుల రక్షణమున
గాపాడుచు మనుచునెల్లకాలములందున్ 48

పావన గంగాస్నానము
సేవధిగా మౌనికోటి సేవయు నాత్మ
జ్ఞావర్ధకముఁ భావము
సేవలనందోఁచు నిచట హిందితమగుచున్ 49

గిరిసౌందర్యము దివ్యమై వనము వీక్షింపంగ శ్రీరాముఁ డ
చ్చెరువందెన్ మిథిలేశ పుత్త్రియు రాశీభూతమోహమ్ముగా
పరికించున్ దిరుగంగ సాగినెలమిన్ భావమ్ము లానందము
ద్రరహింపన్ నవశక్తి దేహములఁ దెఱజేయ సంపాద్యమై 50

ఈ మందాకిని, చిత్రకూటమును రెండేచాలు మర్త్యాళికిన్
శ్రీమంతమ్ముగ నాకసౌఖ్యమొసఁగన్ చెల్వొందగా భూమిపై
ఈమందాకిని నీకు నెచ్చలియగున్ హేమాద్రి యీకొండ - యీ
సీమావాసము తృప్తినిచ్చుమన కాశీర్వాదముల్ సేయుచున్ 51

ప్రత్యూషమ్మున మందవాయువులు నైర్మల్యమ్ముఁ గూర్చున్ హృదుల్
నిత్యమ్మున్ మధురోహలన్ దనర లాలించున్ మదోన్మత్తు లౌ
ద్ధత్యమ్మిచ్చటఁ జూపఁబోవరు ప్రశాంతంబైన శైలంబుపై
సత్యాన్వేషణఁజేయ పిలగుఁ బ్రతీక్షన మౌనిరాట్బృందముల్ 52

జనకాత్మజాతతో వనవిహారము సేయు
విపిన సౌందర్యమ్ము వింతితనీయ
నందముల్ చిందెడి యలరుల సౌకుమా
ర్యము గుండెలన్ దోఁచియలఁతఁ బాప

ఆ శ్ర మ స ం ద ర్శ న ము

గిరిసానువులనుండి క్రిందికిజారెడి
సెలయేళ్ల స్నానముల్ సలిపి, సలిపి
పచ్చికబీళ్ల నిర్భయముగా గెంతుచు
హరిణముల్ పొదగట్టె నాత్మనలరి

ఆశ్రమంబుల నిత్యవేదాధ్యయనము
సాగుచుండగ సంతృప్తి, సంబరమ్ము
బొందుచున్ రామచంద్రుఁడు, భూమిజాత
హాయిగా కాలముంబుచ్చు నవసరమున

ఒక్కప్రభాతవేళ వనియుజ్జ్వలమై వెదజల్ల గంధముల్
ముక్కులు సోడుముట్ట కడుమోదముతో విహరించు సీతతో
నిక్కరణిన్ వచించె పతి యేలనొతోఁచె విషాదముద్ర తే
టక్కడ నెట్టులుండె తెలియంగల మార్గములేదు జానకీ

ఊరకనాయెదందఁ బొలయున్‌బది యూహలు తండ్రిపై, నతం
డూటబనందఁగష్టము నియుక్తి మెయిన్ జనుదెంచినాడనీ
తీరున నన్నుఁదావిడిచి త్రిప్పుకొనున్ వలవంతతోడ నీ
భారము మిక్కుటంబగుడు ప్రాణమునెట్టులనుగ్గపట్టునో

నాకేమో మదిసంశయమ్ము పొడమెన్ నాతండ్రికేమైన చీ
కాకుల్ కల్గెనొ - చెట్టపుట్టెనొ యెఱుంగన్ గష్టమా కోనలో
వాకోజాలను చెడ్డవార్త యెదొ రావచ్చున్‌సుమీ ! లేక యీ
ధాకంజూడుము భావిసంగతులు నీడల్ వాఱునీరీతిగా

ధరణిజ నాథుతోఁబలికె 'దండడియేల? మఱెట్టిచెట్టలున్
జరుగవు-నిత్యమున్ మనసుసాగుసు తండ్రిసుఖమ్ముకోసమై
అరతినిబొందనేల సదయాత్మ! విచారమునందనేల? మీ
నిరుపమభక్తిభావమె జనింపఁగఁజేయు విరుద్ధభావనల్ 57

ప్రియతమ ! మేలుకాదిటుల వేదనబొందగ ధైర్యమూనుఁడీ !
నయమగు సర్వమున్‌దెలిసి న్యాయమె డీల్పడనిట్లు, వీడుఁడీ
భయమునునెల్లయున్‌జరుగు బాగుగ పుణ్యుఁడు భూమిజాని సం
దియమునుమాని, మీయెడఁద నిబ్బరమున్ వెలయింపుఁడీ ప్రభూ ! 58

అనిన్‌రాఘవుఁడామె సాంత్వనముఁజేయన్‌బల్కె నీతేవగా
ననుచున్ శాంతియొకింతలేని హృదితో నారాటముం జెందుచున్
వనితా ! యేమియొ కాని ధైర్యమదిపోవన్ భీతిశంకించెదన్
మనమందెప్పుడు సందియంపడనుసుమ్మా ! యేమిరానున్నదో ? 59

కరిఘటలు, లేళ్ళ గుంపులు
విరియంబడుచుండె భయము, వెక్కసపాటున్
గుటికొనగఁ బక్షిగణములు
గిరిజనులున్ వెఱపుమిగులఁ గీడ్పడనంతన్ 60

రోదోంతరమ్ము నిండెను
మేదురముగ ధూళితోడ మిసిమింతలుగా
చీఁదఱతో విపినంబున
నేదియుఁ దెలియంగరాక నెల్లరుఁ జూడన్ 61

వ్యథతో నాతఁడు భూజమున్ దిగియె హేయంబంచుఁ దద్యత్నమున్
గ్రుధ నాపంగను జాల కార్యకడ వాక్కుల్ రాక నిల్వంబడెన్
విధుతంబైన మనంబుతో నడిగె సంవేగమ్ముఁబోఁగొట్టుచున్
కథయేమంచును రాఘవుం డనగ నుద్ఘాటించె నీరీతిగన్ 67

హయహేషల్, రథనేమిఘోషలు, భటాహంకారహుంకారముల్
భయదానేకప బృంహితమ్ములు చెవుల్ బాధిర్యమందింపఁగా
బుయిలోడన్ బ్రజ కాననాధ్వముల విస్ఫూర్తిన్ విడంబించు చె
మ్మెయి సైన్యం బిటులేఁగుదెంచెడినొ స్వామీ! చూడు డావంకకున్ 68

అన్నా! జానకి! చూచిరే! భరతుదౌష్ట్యంబెట్టిదో యెంతగా
సన్నాహంబున వచ్చుచుండెనొ? మిమున్ సంగ్రామరంగమ్ములో
చెన్నారంగనుగెల్చి శాశ్వతముగా సిద్ధింపఁదానేలఁగా
మన్నున్ మిన్నును బట్టకుండ నెటు వైమత్యంబునన్ వచ్చునో 69

కమ్మనిమాటలన్ నృపతికన్నులఁగప్పి విమోహమెంతయో
నెమ్మదినున్నరీతి యిఁకనెక్కొను గౌరవమున్నభాతి, లో
కమ్మును, నిన్నుఁ బంక్తిరథు ఘర్షణ లోపల ముంచి యెంత మో
సమ్మొనరించెకైక-యివి సమ్మెటపోటులుకావె అగ్రజా! 70

అమ్మకుఁదగ్గ పుత్త్రుఁడగు నాతఁడు-భర్తను జంపె తల్లి, తా
నిమ్మెయిచూడు నిన్నుఁబొలియింపగ వచ్చుచునుండె నేలనీ
వమ్మగువన్ దదాత్మజుని నందతివోలెను బ్రేమమూర్తులం
చిమ్ముగ గౌరవించెదవు-హీనులు, పాపులకేల మన్ననల్? 71

ఆతఁడొ మెత్తనిపులి - యిఁక
మాతయె పగఁబట్టు సర్పమై క్రూరముగా
భీతియొకింత యెఱుంగరు
నీతియు, నియమమ్ములేవు నిర్దయులగుటన్ 72

ఇదె కోదండము చేకొను
మిదిగో ఖడ్గమ్ము, పృతన నిర్ధరిత్రా :
అదటు నడంపగ నాపై
నదవదఁ గావింప సిద్ధమగుము - రయమునన్ 73

వచ్చితిమి మనము వనముల
కిచ్చటి కతఁడేల వచ్చె నిది పోఁగాలం
బచ్చెరు వయ్యెను గాదే !
మెచ్చునె లోకమ్ము వీని మిడిమేలమ్మున్ 74

పిచ్చిగ దండును దోడ్కొని
వచ్చెను రణమందు గెలువవచ్చునటంచున్
చిచ్చొడిగట్టెను భరతుఁడు
సచ్చరితుండెట్టు లౌను ? స్వార్థపరుండే ! 75

అరిసూదన ! నను బంపుము
పరిమార్చెద యుద్ధమందు భరతుని, ధ్వజినిన్
సరగున నాజ్ఞ నొసంగుము
సరసీరుహపత్రనేత్ర ! చక్కఁడంగన్ 76

చిచ్ఛక్తి సడలఁబోలును
ప్రచ్ఛన్నపథాన భానువంశసమజ్ఞన్
విచ్ఛిన్నము సేయగ నిటు
తుచ్ఛమ్మగు కోర్కెతోడఁదోతెంచెనుమీ । 77

విలుపోపని వదనముతో
నులుకుచు సౌమిత్రి భరతు నుక్కువుఁడనగా
లలితోరస్కుఁడు రాముఁడు
కలఁతపడెన్ భరతు నిందఁ గావించుటతో 78

ఆవాక్కుల్ విని విస్తుపోయె నపు డబ్జాక్షుండు నిర్విణ్ణుఁడై
సావజ్ఞంబుగ లక్ష్మణుం గనుచు నైక్ష్వాకాన్వయమ్మందునన్
జీవన్ముక్తులు కాక తక్కొరుల కస్తిత్వమ్ములేదే ? మఱీ
శేవల్ చూడక తొందరన్ బలుకు దిట్లే వేదనంబొందుచున్ 79

జనకుని సేమము నరయగ
మనమున క్షోభించు తనకు మఱియొకబాధన్
గొనితెచ్చె నిపుడు లక్ష్మణుఁ
డనియెను భరతుండు ద్రోహియంచును గ్రుధతో 80

గుణనిధియగు భరతుని ల
క్ష్మణుఁడిట్టుల నిందసేయ సారసనేత్రుం
డణఁగించుకొనుచు కోపము
ననురూపస్వాంతుఁ డగుచు ననె నాప్యాయముగా 81

ఏల ధనుస్సు? ఖడ్గ మది యేలను? వచ్చెడివాఁడు ప్రాజ్ఞుఁడో
ఏలికయౌ నయోధ్యకు-వహించెను భారము తండ్రివెన్క-, నే
నేలను పాపవాదమగు నీధరణిన్-భరతున్ వధింపగాఁ
బాలసుఁడౌచునే? యతఁడు వచ్చినకార్యము మాఱెఱుంగకే ?

మిత్రబాంధవులం జంపి మిహిరవంశ
మునకు దుర్యశముందెచ్చి మొఱకుగాను
అట్లుచేకొన్న రాజ్యమే మగును చెపుమ!
విషము కలిసిన భక్ష్యమే-వేఱుకాదు 8

నేను ధర్మార్థకామముల్ నిలుపఁబోవు
టెవరికొఱకు? మీకోసమే-యెందువలన
భ్రాతృవధ కుద్యమింతును? రాముననును
తమ్ములసుఖమ్మె ముఖ్యము—ధరణికాదు 8·

వేగిరపాటుదక్క- మఱి వేఱు గనంబడదేమి? తమ్ముడున్
యోగమునందు నిస్తులుఁడు-యోగ్యుఁడు నీతికిఁ దావలమ్ముగా
భోగము లాసచేయడు-విభుండుకదా! పరిభూతుఁడైనచో
వీఁగును వంశగౌరవము-వెంపరలాడుట కుత్సహించునే ? 8

భరతుని భ్రాతృవత్సలత బంధురమైనది-శంక నిట్టులన్
కలఁకుఁదనమ్ముఁ జూపెదవు కాని యతండును నాకు నీవలెన్
నిరతినిఁజూపుప్రాజ్ఞుఁడగు నేరము లెంచగరాదు వానిపై
నిరుపమమైనప్రేమ హావణిల్లను భక్తిచరింపనాయెడన్ 8(

సప్తాశ్వాన్వయదీపమౌ భరతు శ్రైష్ఠ్యమ్ము శంకించుచున్
సప్తార్చింబలె నాడ న్యాయమొకొ వత్సా! లక్ష్మణా! యెంతని
ర్లిప్తుండాతఁడు లోకరీతులకు నిర్వేదమ్ముఁ బొందుంగదా!
లుప్తంబయ్యె విశాలదృక్పథము నీలో నెంతదౌర్భాగ్యమో! 87

నలుపుర మన్నదమ్ములము - నాయనయెంత ప్రసిద్ధినందెనో!
బలరిపుమిత్రుఁడై కమలబాంధవవంశప్రశస్తికెంతగా
విలులితుఁడయ్యెనో యెఱుఁగవే ? పరికింపుము - ధర్మదూర మీ
తలఁపు వినింద్యమౌచు బహుధా పరితప్తుఁడనైతి తమ్ముఁడా! 88

మానిసి బ్రదుకును జగమున
మానిసిలోకలదు వెఱ్ఱి మఱియొక జగమీ
మానవ జగతిని లోపలి
మానితమగు జగతిఁగలుప మాన్యంబగుగా! 89

మనపూర్వుల ప్రథయెట్టిది
తొణకరు బెణకరును దిటవుతో సత్యమ్మున్
జనరంజకమగు ధర్మము
కనులను గాపాడి రెట్టికష్టములందున్ 90

ఏమి మాటాడుచుంటివో యెఱుఁగలేవె ?
ఎంతయావేశ మొందిన నిన్నినిష్ఠు
రోక్తులాడంగఁ దగవె నీ యూహకొలఁది?
భ్రమలు వీడుము - భరతుఁడు రాజునేఁడు 91

ఎందుకు సందియం బొదవెనిప్పుడు కైకసుతుండు కాపథం
బందున నెన్నడేని చనినట్టి విధమ్ములు కల్గెనే - మతే
పందిరిపెట్టి పేర్కొన విపర్యయమున్ గొనితెచ్చు వానితో
వందిలియేమిరాదు - పరిపంథిగఁ దోఁచెనె మానసంబునన్?

నీడనుఁజూచి భయంపడు
వాఁడవె సౌమిత్రి! భరతు భక్తినెఱుఁగకే
కోడిగములాడఁ జనునే?
గోడుందోసికొనఁదగునె? కుందడె వినినన్

అద్దమువంటి మానసము నందిసుమంతయు రాజ్యకాంక్షలే
దుద్దియశూన్యమౌ - భరతుఁడుండును తృప్తిగ - హేతువెద్దియో
ప్రొద్దుటినుండియున్ మనసు పోవుచునుండె నదేమొ తండ్రిపై
ముద్దియ సీత కీవిషయమున్ వివరించితిఁ జింతనందుచున్ [illegible]

భరతున్ నీవొకద్రోహిగా తలఁపగా భావ్యంబె? నీరీతి భూ
వరుసంతానముకాదె దుష్టమగు త్రోవంబోవ వీలుండునే?
పరుషోక్తుల్ మనభ్రాతృధర్మమున కాపాదించు దుర్వాదమీ
వరుసన్ బల్కుట మేలు కాదు గుణసంపన్నుండు నాదృష్టితో [illegible]

అనుజా! నీ వన్నంతటి
పనిఁజేయసమర్థుఁడగుదు-బంధుల, భ్రాతన్
మనసుగల మిత్రులను రణ
మున నాశముఁజేయ నీకుముదమయ్యెనొకో! 9

అంతటి ఘోరమొనర్పగ
స్వాంతమ్మెటు సమ్మతించు భాస్వంతుకుల
మ్మెంతటి ఘనమైనది? వి
భ్రాంతుడవే? నిష్ఠురములు వాకొనఁజనునే? 97

మన నలువురు సోదరులకు
నొనగూడనిసుఖము నొల్ల-నొకవేళ లభిం
చినయెడ నంగీకారము
నొనరింపక నగ్నిదగ్ధమొనరింతుసుమా! 98

భాగవతుండతండు-నయవంచన లేదు-స్వభావ మందునన్
త్యాగమునందు, రూపమున నన్నిట నన్నను బోలుచున్ బురో
భాగియుకాడు-సజ్జనుఁడు-భావమునందున గల్మషమ్ము లే
దాగము సేయ జంకను-ప్రియంబుగఁజూచిన మేలు తమ్ముడా! 99

ఉత్తముఁడైన కైకసుతు నూరక నాయెడఁ గల్గుప్రేమతోఁ
జిత్తమునందు సంశయముఁజెందుచు కూరిమివీడిపల్కెదే?
క్రొత్తగఁజూచెదేల? కలుకుందనిమేలను వానిపై; మదో
న్మత్తుఁడుకాడు-నమ్రుఁడు, గుణమ్ములరాశి, యకుంఠితాత్ముఁడున్ 100

పితరుండెట్టులనుండెనో-పురికి రప్పింపంగ నాకోసమై
జతనంబున్ బొనరించు నిచ్ఛమెయి నోజస్వంతుఁడుత్సాహియై
పృతనన్, బౌరులఁబెద్దలన్ గొనుచు నిర్వేదమ్ముతో వచ్చెడిన్
క్షితిమంతుం ధెగనాఢ ధర్మమె క్రుధామాలిన్యవిభ్రాంతిమై ? 101

రానిమ్మాతని నీవె చూచెదవు క్రూరంబైన నీవాక్కులన్
నే నిశ్చేష్టుఁడనైతిఁ గొంతవడి కానీః దీనినూహించితిన్
నేనందోడ్కొని రాజయోగ్యముగ వచ్చెన్‌గాని వేఱొండు దు
ర్మానంబుండగఁబోదు-నిర్మలుఁడుసుమ్మా! వానిశంకింతువా? 102

తనజన్మదాతయౌ తండ్రిఁ బ్రాణప్రాణ
ములనన్నదమ్ముల మొఱకు లట్టు
లెటు చంపఁబూనెద రెఱుఁగలేకున్నాను
ఎవరేమి యొనరించిరిపుడు చెపుమ!
ఇంతకు భరతుండు నెవ్వరి కేహాని
యొనరింపఁ జనుఁదెంచెనో తెలియదె!
ఏమియుఁ దెలియకే యెందుల కతనిపై
కార్పణ్యమును బూనఁగలుషబుద్ధి ?

అతఁడు ధర్మాత్ముఁడగును నే నతని నెపుడు
సందియంబునఁ జూడను, సజ్జనుండు
నట నయోధ్యను వర్తిలు నట్టి విషయ
మెఱుఁగఁజెప్పఁగ; నేతెంచు తెఱఁగుతోఁచు 103

నాకేమి రాజ్యమందున
నేకాంక్షయుచేచు - భరతుఁడెప్పుడుఁగోరం
డీ కువలయపాలనమున్
బ్రాకటవైరాగ్యమార్గవర్తిష్ణువగున్ 104

ఒకవేళ రాజుగా నుండంగ నొక యూహ
నీకున్న జెప్పుము నిర్భయముగ
జనకు వాగ్దానముల్ సఫలమ్ము సేయంగ
వచ్చితికాదె నే వనములకును?
నా నిశ్చయము భూమి నక్షత్రములురాలె
నేనియు మారదు - మానసమున
నియతిఁ జరింతును - నిస్తులమార్గము
వీడను భరతుండు వేడుకొనిన

దురము సేయంగ కైకసుతుండు రాడు
వానికిని రాజ్యమందున వాంఛలేదు
నీకు ధర నేలఁ కోరిక నిలుచునేని
నిమిషమున నీకుదక్కు క్షోణీతలమ్ము 105

భరతుఁడెట్టివాఁడో భావమందెఱుఁగవు
ధర్మపథముతప్ప ధరణినతఁడు
కోరఁడెపుడు నన్ను గొంపోవనేతెంచు
చున్నవాఁడెడంద నున్నతుండు 106

హృదయాళువు భరతుండని
సదయాత్ముఁడు హెచ్చరింప సంకోచమ్మున్
మదివీడి లజ్జనందుచుఁ
గుదుడుకొనెన్ లక్ష్మణుండు కోపంబుడుగన్ 107

స్వచ్ఛములు, స్వాదువులును, వాత్సల్యగరిమ
తొలఁకు శ్రీరామభద్రుని పలుకులువిని
భరతుపైగల్గు నక్కసు వదలి యన్న
తో వచించెను వినయమ్ముతోఁచు కనుల

దశరథుఁడు భర్త యెంతటి ధర్మపరుఁడు
భరతుఁడు కుమారకుండు సద్భక్తిపరుఁడు
విమల సాధుస్వభావుండు విమతయయ్యెఁ
గైక - యెంతటి వ్యత్యాస మాకళింప

అనవుడు నవ్వుచు నిటులనె
నినకులమణి కైక నిందనేలా సేయన్ ?
వినయాధికుఁడగు భరతుని
ఘనతను గీర్తింపు మెడఁద గౌరవమున్నన్

సౌమిత్రి రామచంద్రుని
సామర్షముఁగాగఁ జూచి జంకుచు భరతున్
కోమల హృదయుఁ డటంచును
సౌమనసమ్మును వెలార్చి సరగున బలికెన్

ఒకవేళ పితృపాదు లోపిక నినుఁజూడ
వచ్చుచున్నారేమొ భరతువెంట
ననుచును లక్ష్మణుండన్నతోఁ బలుకంగ
నశుభమ్ము నెంచకా యనఘుఁ డపుడు

కావచ్చు - జనకజ గారాబు కోడలు
కాదె ? యాయమ చిన్నకష్టమైన
నోర్వజాలదటంచు సర్వసాకేతంబు
నూహినితో వచ్చుచుండనోపు !

నింతకాలము జనకు సమీహ యిదియె
కావలయు - సిద్ధపఱుపు మర్ఘ్యమ్ము, పాద్య
మనుచు తొందరతోడ లక్ష్మణుని హెచ్చ
రించెఁ బెద్దలనెల్లఁ బూజించుకొఱకు 112

సర్వవాహినులను, సామజంబుల, నశ్వ
ములఁదేరులన్ దూరముననె నిల్పి
యవరోధజనమున కటనిల్వ నేర్పాటుఁ
గావించి భరతుఁడు శ్రీవసిష్ఠ
మౌనీంద్రుఁ గనుఁగొని తాను సుయజ్ఞుండు
తాత సుమంత్రుఁడు, తమ్ముఁడు, గుహుఁ
డును ముందుగాఁబోయి జనకుని మృతివార్త
నన్నకెఱింగింప న్యాయమనుచు

తల్లులను దోడుకొనిరండు తదుపరినని
పలికి శ్రీరాముఁడుండు నివాసమరయ
బంపి తగువారి నొకచోట వారికొఱకు
నెదురుచూచుచుఁ గూర్చుండె నిఱుకుపడుచు 113

మునుపె పోయి సుయజ్ఞుఁడు పొలకువలను
పరిసరమ్ముల గుహుని తోడ్పాటుతోడఁ
గనుఁగొనుచు వచ్చి చెప్పఁగఁ గనులనిండ
నశ్రువులతోడ లేచె రామావరజుఁడు 114

సొగసుకాని ముందడుగు సాగక లోఁగును - కొంత సేపసే
యాఁగును - మూఁగుభావముల కొదియు నంతము లేక నెట్టులో
సాగును - మూఁగయైనిలుచు సర్వము శూన్యముగా గనంబడన్
వీఁగును - కాఁగుచిత్తమున - వెంటనె లేఱుఖ - చేరబోయెడిన్ 115

తలపోయునొకసారి తల్లులందఱి రాముఁ
జూడంగఁ బంపిన సుగమమనుచు
ననుకొను నొకపరి నాసుయజ్ఞుని బంపఁ
బని తేలికగునంచు భ్రమను బొంది
మదినెంచు నొకమాటు మతిమంతుఁడౌదూత
నంపిన సరిపోవదా యటంచు
అప్పుడే రాజయ్యెనా? యెంత గర్వము
వచ్చె-తానుగఁ జెప్పవలదె యంచు

రామచంద్రుఁడు, సీతయు, లక్ష్మణుండు
నందఱును నన్నివిధముల ననెదరేమొ?
ఇంతయెందుకు జనకుని మృతి నెఱుంగఁ
దానుగా పోయి చెప్పిన ధర్మమగును 116

తప్పుచేసినవాఁడు తడబడఁ డిసుమంత
అదివాని తత్త్వమందడఁగి యుంట
తప్పుసేయనివాఁడు తడబాటు నొందును
జననిందకెంతయో జడియునతఁడు
భరతుఁడు రామునివనవాస విషయమ్ము
నెఱుఁగడు ముందుగా నిది యెఱుంగ
కాతని, తల్లిని నాడిపోయంగ లో
కము సుంతయును జంక దమలగుణులె

యయ్యు - భరతుఁడు దీనికై యటమటించె
రామదర్శన మొనరింపఁ బ్రేమయుండి
ముందునకుఁబోవ బెరుకు చూపును మనంబు
సున్నితంబగుటచే పరిశుద్ధుఁ డగుట 117

తనకెంతభక్తి రామునిపైని నుండిన
నేమాయె లోకమ్ము దృష్టిలోనఁ
దానయోగ్యుఁడు - తల్లి మౌనమూనగ నేమి
యో స్వార్థమిందులోనుండె ననుచు
భావించునే కాని భావింప దన్యము
వాస్తవమ్మెఱుఁగక వాదులాడు
దానిని వారింపతరము కాదెవ్వరు
విపులీకరించిన వినదు-రాము

సముఖమందు యదార్థము సంతరింప
వీలుకలుగు వసిష్ఠులు విషయమెల్లఁ
దెలియపఱచిన పౌరులు తృప్తిపడుదు
రంతవఱకును నమ్మింప నలవికాదు 118

ఒకదుష్టభావన నుండిన లోకమ్ము
నమ్మింపఁజాలని నరుఁడతండు
రామునిపై నెంతభ్రాతృభావంబుండి
యును దూరమందున నుండిపోయె
తల్లికి నన్నపై తగనిప్రేమయటంచుఁ
దెలిసి యూయమఁగాంచి తెగడెనెంతొ
జననిమాటలను వాస్తవమున్నదో లేదో
యని భరద్వాజుని యాశ్రమమున

సకలము యథార్థమంచు వీసంబుమోస
మిందు లేదంచుఁ దృప్తివహించె నతఁడు
లక్ష్మణుండెటుల నమ్మును-లాతిజనుల
కెట్లుతెలియును తనతల్లిహృదయసరణి 119

ఇతఁడయోధ్యకు రాజౌ యిటువంటి ప్రభువులు
మున్నెన్నడును రారు-ముదితమాట
లెల్లవేదమ్ముగాఁ జెల్లించె వాగ్దాన
ములను శ్రీరాముఁ గానలకుఁబంపె

అవియేమి వరములో? యవియేమి మమకార
మ్ములో ? భూమిజానికి-మునులపగిది
వరపాలనము సేయ వనములకరిగిరా ?
ఆ తండ్రి హృదయమ్ము నవగతమ్ముఁ
జేసికొని సిగ్గుచేటుగ చెనటికైక
కెట్టులిదితోఁచ దినవంశమిట్లుగార
వమ్ముఁగోల్పోయె నింకపై భరతుఁడగును
నేతయనుచును లోకమ్ము నిందసేయు 120

లోకకంటకులైన సోఁకుల నిర్జింప
వేల్పులు కలలోన వేఁడుకొనగ
శ్రీరామచంద్రుడు చింతించి జనకుని
సత్యవాఙ్నియమమ్ము సంతరింప
వనముల రాక్షసవధముఁ గావింపగ
జగతికి శ్రేయమ్ము సలుపఁగోరె
నిది సుంత గమనింప కేమేమొ పల్కును
దోషులటంచును తోఁచినటుల

నిందులో కైకస్వార్థమ్మె యిరవుకొనియె
భరతునకుఁ బట్టముంగట్ట భావమందు
నెంచి యని లోకమెల్ల భావించె-నిజముఁ
దెలిపినన్ గట్టుకథలని తీవరించు 121

ఇదియేమిలోకమ్మొ తుదిమొదల్ చూడదు
చెవులెయున్నవి కాని చింతలేదు
కనులతోఁ దిలకింపగాలేదు-నమ్మదు
పాటింపదెవ్వరిమాటఁగూడ
తాను నమ్మినదేదొ తనకుతోచినదేదొ
చేయుప్రచారమ్ము-వాయువూయ
మూకుడన్నదిలేదు - ప్రాకును వాస్తవం
బున్నను లేకున్ననొకటె దాని

కంతుఁబట్టదు యెట్టి వదంతులైన
నెట్టి దుష్ఫలితమ్ములు, బెట్టిదములు
కలిగినను నేమిపట్టక కరుణ వీడి
వ్యాపనము సేయు క్షణములో వసుధ నెల్ల 122

తాను రాజ్యము సేయఁ దలపోయ లేదు, రా
మునిగొనివచ్చి భూపుని నొనర్ప
జతనమ్ము సల్పంగ సైన్యమ్ము, మంత్రులు
పౌరులు వెంటరా వనములకును
పయనమయ్యెనుగాని పరిపంథివలె కాదు
రణము సేయఁగ గాదు - రాజసుటకు
కోర్కెసుంతయులేదు గురుని సమక్షమం
దండతికెని తనయభిమతమ్ముఁ

దెలుపుటకు తప్పు వేఱొక తిగుట లేదు
కావుననె తల్లులను గూడ గహనమునకుఁ
దీసికొనివచ్చె భరతుఁడధీరుఁడగుచుఁ
దనకు రాజ్యముపై కాంక్ష తనర దనుచు 123

ఇంతవఱకును భరతుఁడు హృదయమందు
నన్నుఁజూడంగ పొంగె-నానన్నుఁడైన
తరుణమున వింతయలజడి దాపురించె
నిద్రగహించి సుయజ్ఞుండు హితము పలికె 124

అడుగు ముందుకు పడదు నీకన్నయెడల
గౌరవమెకాని వైరమ్ము కానఁబడదు
రామునకు విదితమిద్ది - యారాటపడక
రమ్ము ! పోవుద మేమియు రాదు సఖుఁడ! 125

నగవులు చిందు నెమ్మొగమునన్ గనిపించు విషాదముద్ర దూ
రగుఁడుగ నుండెదేల ? రఘురాముని దోడ్కొనిపోవవచ్చి, యి
ప్పగిదిని నిల్చి సందియము భావమునన్ దలపోతతో నిటుల్
పొగులగఁ బాడియే - లవము పొచ్చెము లేదు కదయ్య నీయెడన్ 126

అనుచు ధైర్యమ్ము పలికిన నా సుయజ్ఞు
వదనమును గాంచి, భయమును వదలి, యొక్క-
నిశ్చయమ్మున గదలెను నిష్కళంక
చరితుఁడంతట రామదర్శనము సేయ 127

నానాధాతువిచిత్రితమ్మగుచు నానాపుష్పసంశోభితం
బై నిర్ముక్తుల వాసయోగ్యముగఁ గన్పట్టెన్ గిరీంద్రమ్ము - సం
దీనధ్యానముసేయు పక్షిగణముల్ డింగుళ్ళతో రాజస
న్మానంబిచ్చెడిభాతిఁ దోఁచె నపు డానందింప వారెల్లరున్ 128

పీతమాంజిష్ఠముల్, శ్వేతరాగచ్ఛవుల్
రమ్యమ్ములౌ శిఖరములఁ గనుచు
మెలికలు తిరుగుచు మిన్నాగు లట్టుల
ప్రవహించు సెలయేళ్ళరవళి వినుచు
బాటకుప్రక్కల పరిమళభరితముల్
మందమారుతముల మైమఱచుచు
శాద్వలస్థలులలో చరియించుచుం బూరి
మేయు మృగంబుల మించుఁ గాంచి

హృదయములు పొంగ భరతాదులింపుమిగులఁ
బాదచరులైన పరిసరప్రాంతమందు
దూరమందున మునివాటి తోఁచె వారిఁ
కపటఁ గన్నులపండువై హాయిఁగొలిపి 129

పర్ణశాల యొకంతు కన్పట్టె నెదుట
ధూమ మేతెంచుటలు కూడ తోఁచె నపుడు
అన్నయుండు నివాసమయ్యదియె యనుచు
దారిఁజూపంగ భరతుఁడు తలఁకె నెడఁద 130

ధర్మహార్మ్యములలో వసియించు రాముండు
పర్ణశాలలలోన బ్రదుకవలసె
మృష్టాన్నములఁగాని మెసవని రాముండు
కందమూలములతోఁ గడపవలసె

తేరులపైఁగాని తిరుగని రాముండు
కాలినడకను వనిన్ గదలవలసె
పరిచారకులసేవ భాసించు రాముండు
తమ్ముని సేవతోఁ దనియవలసె

నెచ్చెలులతోడఁ గాలంబు బుచ్చువదినె
ఒంటరిగఁ గొండకోనల నుండవలసె
లక్ష్మణుని త్యాగబుద్ధి కలంచె నన్ను
విధివిలాసముకాదె-రాపిడులఁ జూడ 131

శూరుండగు శ్రీరాముఁడు
పేరిమి సాకేతనగరి వీడి గహనమం
దారాటము పడుచును దా
వీరాసనమందు నిలిచె విధివచింతుఁడై 132

దీనికి కారణ మెవ్వరు ?
నేనేకద-రామచరణనీరజములపై
పూనికవ్రాలి యయోధ్యకు
మానితముగ రమ్మటంచు మఱి ప్రార్థింతున్

రంగుల మేలివస్త్రముల రమ్యముగా ధరియించుచున్ గిరీ
టాంగదతారహారముల నాకృతి మన్మథదేవు మించుచున్
తొంగలిఱెప్పలన్ దొలఁగఁద్రోయుచు లోకములోని పాపముల్
మంగళమూర్తియై తిరుగు మాన్యునికేల కుటీనివాసముల్? 1

జనకునిమాటలుసత్యమ్ము సేయగ
　　బద్ధకంకణుఁడౌచు వనులఁజేరి
యెండకన్నెఱుగనియింతి విదేహన్న
　　పాలనందన కష్టపడుటఁగాంచి
కంటకాధ్వమ్ముల కఠినశిలామార్గ
　　ముల బయనింపఁగఁగలఁతపడుచు
గుండెరాయిగఁ జేసికొని యేమిసేయంగ
　　నోపక, కడగండ్లఁ బాపలేక

తమ్ముఁడును, ధనువు, బాణముల్ తనకుతోడుఁ
గాగ తండ్రికి బిడ్డకుఁగలుగు బంధ
మినకులప్రశస్తి. ధర్మవర్తనము తెలుఁగుఁ
దెలుపఁబుడమికి దిగినట్టిదేవుడన్న । 13

అతఁడయోధ్యకు రాజైన నవితథముగ
కలుగు శుభములు, వైరులు కానఁబడరు
కుశలముగనుండు దేశమ్ము భృశము నిరతి
ధర్మదేవత నాల్గుపాదముల నడచు 13

రఘురాము దర్శనార్థము ప్రపన్నుండౌచు
సాగించు భక్తిప్రస్థానమందు
భరతుని హృదిని శ్రావ్యముగ్రమోగెను చతు
ర్విధరమ్యముక్తితంత్రీనినాద
మగ్రగజు, సుందరవిగ్రహు, రాముని
బలశాలి లక్ష్మణు, వదినెసీత
దర్శించువఱకు - నాతనువు ఝుంయూమారు
తమున గంపించు వృక్షము విధముగ

నూగులాడుచునుండె - ధన్యుండనగుదు
నాత్మవిదులను జూచిన సంతరంగ
మందు నలజడి పోయి యానందహేల
నెడఁద శాంతిని భజియించు నింపితముగ

పూర్ణచంద్రునిఁబోలు ముఖపద్మమేపారు
పద్మాక్షు నేత్రపర్వమ్ముగాగ
దర్శించువఱకు శాంతత భజింపదు చిత్త
మారాటపడుచుండె నందుకొఱకె
కారుణ్యమూర్తి యగ్రజు పదపంకజ
మ్ములకు శిరస్సుతో మ్రొక్కువఱకు
శాంతింపదించుక. శాంతిశూన్యంబయి
మానసం బుద్విగ్నమై పొగులును

## ఆశ్రమ సందర్శనము

తాతతండ్రులనుండియు ధరణినేల
నర్హుఁడెవ్వ డయోధ్యకునట్టిరాము
సింహపీఠమ్మునందభిషేక మొనరఁ
జేయువఱకును మదిశాంతి చిక్కపోదు

అనుచుఁదనలోన తానె భావనల నుండె
భరతుఁడును దారిలో వారి దరియువేళ
కలవరమునంది యభిషేకజలముఁబూని
సాగుచుండెను రఘురాము సవిధమునకు

భగవంతుఁడున్నట్టి జగమునుబొందెడి
ముక్తియే సాలోక్యముక్తియగును
ప్రభుసన్నిధానలాభము నిత్యమునుబొందు
ముక్తియే సారూప్యముక్తియగును
భగవంతుతో రూపప్రాశస్త్యమును బొందు
ముక్తియే సారూప్యముక్తియగును
ప్రభువులోనైక్యమై భక్తులుపొందెడి
ముక్తియే సాయుజ్య ముక్తియగును

భాగవతుఁడైన భరతుని భావమందుఁ
బొడమె నీనాల్గు విధముల ముక్తులెలమి
భక్తిసాధింప నున్ముఖంబౌ ప్రవృత్తి
సాగుచుండెను రఘురాము సవిధమునకు

భరతునిది కామవిరహితభక్తి - రాజ్య
మతఁడు కోరకపోయిన నతనికొఱకు
కైకచే కోరబడినదీ కామమగుటఁ
దెలిసికొనుట కగత్యము కలిగెఁ దీన 141

చేరెన్ భీరుకుఁడంతఁ బర్ణకుటి రాశీభూతనై భృత్యమై
యారాటమ్మునువీడి, ప్రాంగణమునం దానోహకచ్ఛాయలో
చీరన్‌లేక వితర్ది(గొంతవడి నిల్చెన్ శ్రాంతికై యింతలో
నే రోమాంచముతోడ లక్ష్మణుఁడు రానేవచ్చె నచ్చోటికిన్ 142

భరతుని కంత లక్ష్మణుఁడు స్వాగతిఁ బ్రేమపురస్సరంబుగా
నెరపెను రాజయోగ్యముగ నిర్మలభావము మోమునందు సుం
దరముగ భాసిలంగను-నదాటున లోనికిఁ బోయెనంతటన్
బిరబిర వారిరాకను నివేదనముం బొనరింప నన్నతో 143



# ద్వితీయాశ్వాసము

రాముఁడు, మేఘశ్యాముఁడు
ప్రేమను రమ్మనెను మాండవీరమణు నొగిన్
సామజగమన వధూనిక
గ్రామున నిలువంగఁ గైక కొమరుండేఁగెన్

ఆశ్రమమ్మెంతయో యందమ్ముగానుండె
లోనికిఁ బోవగ లోచనముల
కెక్కడఁజూచిన నక్కడే తోఁచెను
కార్ముకమ్ములు, సాయకములు తళుకుఁ
జూపు ఖడ్గమ్ములు, సుందరహరిణచ
ర్మమ్ములు, వ్యాఘ్రాజినమ్మ లెన్నొ
గోధాంగుళిత్రముల్, కుంతముల్, కవచముల్
కుడ్యభూషలుకాగ గోచరించె

శరధులందున దుర్లక్ష్యపృష్ఠములు చెలఁగు
నశనిసంకాశములు లేనిహీనఫలము
లవ్వి, యివ్వియనంగ నేమౌను-సర్వ
సమరసామగ్రి కలుగు నాసక్తిఁబెంచ

ఆశ్రమమో-రణశాలయొ
అశ్రమముగఁ దోఁచకుండె నాశ్చర్యముగా
ప్రశ్రితుఁడు తెల్లవోయెను,
విశ్రాంతిగృహమ్ముఁగాంచి వెఱవరి యగుచున్

క్షణకాల మ్మతఁ డట్టులే నిలిచి వీక్షాస్ఫూర్తి తోడ్తోడనే
అణఁగారంగను రిచ్చపాటు-భరతుం డబ్జాక్షు నన్నన్, ఘనా
ఘనసంకాశుని, వల్కలాజినధరున్, గారుణ్యమూర్తిన్, ప్రవా
సిని, శ్రీరాముని సింహసంహనుని గాంచెన్ నేత్రపర్వంబుగా 4

ధరణికి రాజుకాఁదగిన తామరసాక్షుఁడు నేలపై కుశా
స్తరణమునన్ వసించుచు, వ్యథాభరితుండుగఁ గాననాళి దు
ర్భరముగ జీవితంబు గడపన్వలసెన్ విధియెంతక్రూరమో !
ఇరవులు పర్ణశాలలగునే? శయనింపగ స్థండిలమ్ములా ! 5

కనులన్ బాష్పము లేకధారఁగురియన్ గంఠమ్ము దుఃఖమ్ముతో
ననుతాపమ్మున గద్గదంబగుచు ధైర్యంబెల్లఁ గోల్పోవుచున్
జని శ్రీరాముని పాదపద్మముల పజ్జన్ వ్రాలె సాష్టాంగమై
పనిగొంచాతఁడులేవనెత్తె ననుకంపన్ గౌఁగిటంగ్రుచ్చుచున్ 6

అక్కున జేర్చికొంచు దరహాసము మోమునఁ జిందులాడగా
మక్కువతోడఁదమ్ముని యమాయికభక్తిప్రపత్తికెంతయో
సొక్కుచు,సోలుచున్ భరతుశోకము మాన్పుచు నూఱడించుచున్
జక్కఁదనమ్మునూలుకొనఁజేసె రఘూద్వహుఁడాత్మవంతుఁడై 7

నిండుగఁగౌగిలింపఁ గమనీయత తోఁచెను నీలమేఘముల్
రెండు వియత్పథమ్మువిడి లీలగ నేలకు వచ్చినట్లు, దో
శ్చండిమయొక్కచోట వరుసన్ సమకూడినరీతి, రాశియై
నిండినప్రేమగానము ఘనీకృతనీలమణిచ్ఛవిన్ దగన్ 8

అచ్చముగ రామువలెనున్న నతనిగాంచి
తచ్చపాటున నిలిచె ధాత్రీకుమారి
ఇరువురకు దేహమందున నేమొ కాని
కృశత(గాన్పించుచుండె నొకేవిధముగ 9

ధాత్రిజకు మ్రొక్కినిలిచె, సౌమిత్రి కెరఁగె
భరతుఁడంతట - లోనికివచ్చి రెలమి
గుహుఁడు, శత్రుఘ్నుఁడును, మంత్రి, కూర్మిసఖుఁడు
మాన్యులకు భక్తిమీఱ నమస్కరింప 10

రామచంద్రుఁడు ప్రేమవారాశి యపుడు
వారి నాలింగనముఁజేసి పల్కరించి
మృదువుగా-మాండవీనాధు వదనసీమ
మ్లానమైయుండ గమనించె మమత పేర్మి 11

ఏమి సుయజ్ఞా! మిత్రమ!
క్షేమమె మీకెల్లరకును-స్నేహితుఁడు గుహుం
డేమిటి కిటులేతెంచెను
రాముని గాంచంగ వచ్చిరా! సఖ్యముతో 12

వాడినమోముతో మసకవాఱిన కన్నులతోడ పల్కెలా
పీడితగాత్రుఁడై యెదఁద వేదన నిండగ శోకమూర్తియై
పోఁడిమిదక్కి రామకడ పొందిక నుండిన మాండవీధవున్
జూడగ పొక్కెరా జనకసూతియు, లక్ష్మణుఁడార్తి మిక్కిలిన్ 13

విలపించెన్ భరతుండు రాముఁగని యుద్వేగమ్ముతో నిట్టులన్
నిలుపంబూనుచు తండ్రివాక్యముల నిర్ణీతిన్ బ్రదర్శించుచున్
బొలతింగూడి విశాలరాజ్యరమపొల్పుల్ వీడి యేతెంచితే?
కలమాన్నంబులఁ బట్టుతల్పముల నాకాంక్షింప కేమాత్రమున్ 14

నామూలమ్మున గాననాళి కరుగంగానయ్యె నీకిట్లు శ్రీ
రామా! నన్ను క్షమింపవేడెదను-కారాకూరముల్ పొందుచున్
క్షేమం బింతయు లేనిచోటులను సాగింతే ప్రవాసమ్ము నీ
ప్రేమన్ వీడగ న్యాయమే! తిరిగిరా! వేమారు ప్రార్థించెదన్ 15

ఇనవంశోత్తమ! రామచంద్ర! కరుణాబ్ధీ! నేను పాపాత్ముఁడన్
నిను నే భక్తినిగొల్చువాఁడనుగదే! నీరేజపత్రేక్షణా!
కనుకన్ జూడు మయోధ్యనొక్కపరి కన్గోకున్కి నిన్నున్ ధరా
తనయన్, లక్ష్మణుఁగోలుపోయి చటులాంధ్యంబందునన్ మున్గుచున్ 16

సాకేతమ్మున నేను లేనితఱి రాజ్యత్యాగముంజేసి, యిం
దాకన్ వచ్చితివేమి? నాయెడల వాత్సల్యమ్ము లేదా? పురిన్
కైకేయీతనయుండు నిల్వఁగలఁడా! కాకుత్స్థవంశాగ్రణీ!
చీకాకొందుచు సర్వపౌరజనమున్ 'చీ'కొట్టగా నిందలన్ 17

అన్నకుఁజెందురాజ్యమున కడ్డమునచ్చుట కిచ్చగింతునా!
మన్ననతప్ప వేఱొకటి మామకమానసమందు నిల్చునే!
తిన్నగ కాననమ్ములకు దిట్టతనమ్మున వచ్చినాఁడవే?
విన్నదనమ్మునన్ హృదిని వేదన బొందుచు నుంటి నార్తితో 18

ఎక్కడ మిహిరకులం బిం త
నెక్కడి వనగమనదీక్ష - హేతువు కలదే ?
సొక్కించునె వరపాలన
మిక్కిలిగాఁ దోఁచెనేమి? మెట్టితి వటవిన్ 19

తాలిమితూలిపోవునుగదా ! మిముఁ జూచ ననర్ఘ వస్త్రముల్
దాలుచు మీరు వల్కలములన్ ధరియించుచుఁ గందమూలముల్
హేలగఁ దృప్తిమై మెసవ, నిట్టుల ఖిన్నము లందుచుండగన్
వ్రీలవె గుండియల్ పురిని వీడగ న్యాయమె? రమ్ము ! వేగమే 20

ఏ రాజ్యము నీ వేలగ
పేరిమితో రమ్మటంచు పిలువగనిటులన్
కోరికతోఁ జనుదెంచితి
కూరిమితో తిరిగివచ్చి కొనుమీ ధరణిన్ 21

హొంబట్టు హౌదాల నూరేగఁదగు నీవు
అడవిత్రోవలవెంట నరుగవలసె
పంచకల్యాణిపై స్వారిచేసెడి నీవు
కాళ్ళ కాయలుకాయ కదలవలసె
సింహాసనమ్ముపై చెలువారఁదగు నీవు
బండలపై కూరుచుండవలసె
మృదుతల్పములపైని నిదురింపఁదగు నీవు
గుహల వృక్షచ్ఛాయఁ గునుకవలసె

నెన్నికరు లెన్నియశ్వమ్ము లెన్నితేరు
లెంత పరివారముండియు నేమిఫలము?
ఒక్కసదుపాయమును లేక యుండవలసె
దశరథుని జ్యేష్ఠపుత్రుఁడు తరుణితోడ 22

ఇష్టమృష్టాన్నభోజనమేమిలేక
కందమూలఫలమ్ములఁగడుపునింపు
కొనగనయ్యె మౌనులరీతి తనువు కృశత
నొంద సంరక్షణము లేక డిందుపడుచు 23

తానువాగ్దానముల నిచ్చి దశరథేశ్వ
రుండు తల్లికి పొరపడె - రెండువరము
లీవు తీర్పంగ బాధ్యుఁడవెట్టులగుదు
వంతయు నగమ్యగోచరంబటులఁదోఁచు 24

అమ్మా! మైథిలి! లక్ష్మణ!
సమ్మతిఁజూపంగ రామచంద్రుని మీరల్
సమ్మదమున నా కొఱకై
రమ్మని చెప్పంగ వలయు రాజ్యముఁగొనగన్ 25

అని యింకేదియొ పల్కఁబోయె భరతుం 'డార్యా'! యటంచన్నతో
విన నుత్సాహముఁజూపకా సరణినాపెన్ గంట నీర్వెట్టుచున్
తనతమ్ముల్, గుహుఁడున్, సుమంత్రుఁడును మిత్రమ్మున్ వెసన్ దేర్చగా
వినతుంజూచి వచించె రామవిభుఁడుద్వేగమ్ము పోనాడుచున్ 26

చాలశ్రమించివచ్చితివి సాదరబుద్ధిని నన్నుఁజూడ నీ
వేళను నింతదూరమిటు వేదనబొందుచు సందియమ్ము నీ
కేలను ? నిన్ను నేనెఱుఁగనే ? యతసీకుసుమాభదేహ ! మేల్
మేలగు భావముల్ కలుగు - మేపడియున్నది వర్తనంబునన్ 2[illegible]

నేను వనాళిఁగ్రుమ్మరగ నీవెటులోదువు కారణమ్ము ? రా
లేను బురంబుఁజేరగ - చలింపదు నాస్థిరచిత్తమెన్నడున్
కాన త్వదీయప్రార్థన ప్రగాఢమెయయ్యును సమ్మతింపగా
లేనుసుమా ! విరుద్ధమిది - లేశము ధర్మము కాదు నాయెడన్ 2

జనపతిమాట చొప్పున విశాంపతివౌచు నయోధ్యనేలగాఁ
జనును - మతేమియుద్ధములు, సాకులుచెప్పక రాజ్యపాలనం
బొనయుటమేలుకాని యిటు లేమియొ పల్కుచు రమ్మటందువే ?
ఇనకులమెట్టిదో తెలియదే ? యిఁక దుర్యశమేల దానికిన్

తండ్రియాస్తికి నెట్టులఁదనయుఁడగునో
యౌరసుఁడు - జనకుని ఋణభారమునకు
నటులే యౌరసుండగునయ్య ! లోక
ధర్మమిది - తప్పుకొన నేరితరముకాదు

పితృపాదులింకను వేదనతోనుండి
రాయేమి ? తేఱిరా ? యిచటికీవు
వచ్చుటకును ముందు వారినిఁజూచితే ?
నన్నుదోడ్కొనిరాగ నిన్నుబంపి

నారెటులెంతొ దైన్యముతోఁచు మోమున
చెప్పకచెప్పనే చెడ్డవార్త ?
ప్రొద్దుటినుండియు ముద్దియ నేనును
వార్తలేమియులేక వనటనుంటి

మితరమేమియుఁ దలఁపక, యెట్టులుండి
రెట్టులుండిరి జనకులు ? చెట్టయేమి
జరుగలేదుకదాయను సందియమ్ము
పట్టిపీడించుచుండెను వత్స ! నన్ను 31

వాస్తవమ్ముగ వారింకబ్రదికియున్న
పంపియుండరు ? నీతోడవచ్చినారె ?
ఎచటనుండిరి – చూచెద నిపుడెపోయి
వనితతో, భ్రాతతోడను భరత ! నేను 32

సత్యవిక్రముఁడైన జనకుని సేవింతు
వా? నిత్యమును నీవు వాసిమిగుల
వివిధాధ్వరమ్ముల వేమరుఁగావించి
పూతచరిత్రునిఁ బూజచేసి
తృప్తుఁగావింతువా ! సప్తాశ్వకులగురు
లైన వసిష్ఠులు, నఖిలమిత్రు
లారోగ్యముగ నుండిరా ? తల్లికౌసల్య,
మేల్గోరుమాత సుమిత్ర సుఖులె ?

కుశలమా కైకతల్లికి ? కుదురుకొనెనె
హృదయమిప్పటికైనను ? నదవదలుగ
సున్నదా ! నీవు గౌరవంబొసఁగి చింతఁ
బాఁపయత్నమ్ముఁజేయుదే పరమభక్తి ! 33

నిరతాగ్నికార్యముల్ నెరపుదురే సకా
    లమున బురోధసుల్ విమలమతులు ?
వినయసంపన్నులై వృద్ధుల సేవింప
    నోర్మిఁజూపుచు నున్నె యువజనమ్ము ?
దైవభూసురభక్తి తనరారునేకదా
    పౌరజీవితమందు సౌరు మిపుల ?
క్రమశిక్షణము, పురోగామి దృక్పథమున్నె
    సైనికహృదుల సంస్పృహచెలంగ ?

జ్ఞానపూర్ణులయెడ నభిమానమెసఁగ
గౌరవముఁజూపు నాప్రజ ? శూరులకును
గురువులకు నేమమొక్కొ ? వేగులునువినతు
లగుచు మెలఁగుదురే ? హితులంతసుఖులె ? 34

శ్రుతిమంతు, లింగితజ్ఞులు
మతిమంతులు, యుక్తిపరులు, మాన్యులు, శూరుల్
హితవచులు మంత్రులైనను
స్థితియున్నతమగుచుఁ బొసఁగు దేశమునందున్ 35

నీ సచివు లట్టివారలై
దేశాభ్యుదయమ్ముఁగోరు ధీమంతులె-నీ
కోసము ప్రాణం బిత్తురు
లేశము నొప్పింప కేపరిస్థితి నైనన్ 36

అష్టమంత్రులతోడ నాలోచనము సేయఁ
దగుఁగాని యొక్కనికగునె ? దాని
వలన సత్యము బయల్పడదు - నిర్ణయములు
బాగై నవనుటకు వలనుపడదు
బహుముఖమ్ముల చర్చ ఫలియించు మంత్రుల
యభినివేశముఁగూడ నవగతమగు
కాలోచితముగ మేల్కాంచిన మంచిది
యలసత యెప్పుడు హానిఁదెచ్చు

నృపతి సేమము పండితుల్ నిరత మెంచి
మంచిమార్గము నందున మలఁచుకొనుచు
సాగుదురు - మూర్ఖు లెప్పుడు నేగిఁదెచ్చి
శాంతి భంగింపఁ జేయఁగ సాహసింత్రు 37

పార్థివుని లోన గల్గు లోపములఁగప్పి
పుచ్చు దక్షతమై మంత్రి పొల్చు మిగుల
సుఖములంగూర్చు నృపునకు శుభముఁగోరి
మంత్రి వంశానుగతుఁడైన మతియు మేలు 38

ఒకసారి మన్నించి యొకసారి దండింప
    నవమానమున గ్రుంగు నట్టినరుఁడు
చెడ్డకల్గిన గూడఁ జేతమ్ములో నుంచు
    కొనవలె కోపమ్ము నణఁచుకొనుచు
రాజబంధువులను రాజెప్పుడును బూర్తి
    గా నమ్మగారాదు - ప్రాణహాని
వెన్నంట నవకాశ మున్నది - దూతలు
    చదువరులైనచో జరుగుఁ జాల

నమ్ము శాంతికి నెలవుగా నయము కలుగు
విషయమున నపరిచితులు వేగులగుట
మేలు - కుట్రలఁ బన్నంగ వీలు లేదు
న్నాస్తికుం దూరమందుంచ కప్తిరాదు 39

[illegible]

ఏవేళ హితముఁగోరెడి
సేవకులను, శిష్టజనుల, సిగ్గరిజనముస్
కోవిదులను, వైద్యుల స
ద్భావమునన్ గౌరవింపవలయును బ్రీతిన్ 40

సైనికుల వేతనంబులు
మానితముగ నీయవలయు మాసాంతమునన్
కానియెడల వారలలోఁ
గానఁబడు నతృప్తి మంచి కాదిది నీకున్ 41

సరియైన నిర్ణయమ్ముల
సరియగు కాలమున జేయ సాగును ధృతితో
నరమరిక లేక పాలన
మరితిన్ జను నెల్లకాలమందుఁ బ్రశాంతిన్ 42

గోపనము ముఖ్యధర్మము
భూపునకున్, చేయు సరళిముందుగఁ దెలియన్
రూపఱగవచ్చు కార్యము
కాపాడ రహస్య మతనిఁగాఁచు సతమ్మున్ 43

అధికారు, లర్థమత్తులు
నధికామముతోడ మెలఁగి, యనిమిత్తముగాఁ
గ్రుధఁబూని యటమటింతురు
యథేచ్ఛముగ లేనిపోని యగడులతోడన్

ఎవ్వారలుత్తములో? మఱి
యెవ్వరు మధ్యములో-యధములెవ్వరో తెలియన్
నివ్వటిలు శుభము-పాలన
రవ్వలు, రట్టులును రావు రాజ్యము నందున్ 45

తగువారలఁ దగురీతులఁ
దగుపదవుల యందు నిలుపఁదగు నరపతికిన్
మొగమోటముఁ జూపినయెడఁ
దగవులె నిరతమ్ము-శాంతిదక్కదు నాఁటన్ 46

అపరిమిత సన్నుతాప్తుం
సవరింపగవలెను జండకాసనుఁ దగుచున్
తివుట నృపాలుఁడు - లేదేన్
తపులపడున్-రాజుమాట ధరణియదెల్లన్

ఎక్కువ పన్నుల వేయుగ
మక్కువతో నుండరాదు - మనసులు విఱుగున్
చిక్కులు పడెదరు పౌరులు
స్రుక్కుదు రాపన్నులగుచు సురిగెదరెంతో 48

సున్నితంబుగ మధుపమ్ము సుమమునుండి
మధువుఁ గ్రోలినభంగి నెమ్మదిగ నృపతి
నొప్పిఁగలిగించకుండఁ బన్నులవిధింపఁ
ప్రజలు సేవింత్రు భక్తితో ప్రభుని సతము 49

ప్రతిదినము చేయుపనులను
చతురముగా రాత్రివేళ చర్చింపఁదగున్
ప్రతితప్పుదు నీ చనియెడి
గతిసిబు దిద్దంగనౌను - కలుగు శుభమ్ముల్ 50

ఆదాయముకంటెను వ్యయ
మే దాఁటినయెడల క్షేమమే ? రాజ్యమునన్
భూదేవతలకు, దీనుల
కాదరముగ దానమీయ న్యాయము సుమ్మా ! 51

కోశమ్మెప్పుడపాత్రుల
నాశాపాతకులఁజేయు నందువలన రా
జీశంక నట్టివారల
కోశాధ్యక్షులుగ నిలుపఁగూడదుసతమున్ 52

దురుసుగ మాటాడినచో
పరిజనహృదయముల వైరభావము ప్రబలున్
వెరవరియగు భూపాలుఁడు
మరియాదగ నాఁచితూఁచి మాటాడవలెన్ 53

అధములు, మధ్యము, లుత్తము
లధికారమునందు గలరు- పోవడితొలఁగన్
విధుల నియోగించుటలో
నధినాధుం డుచితరీతి నరయఁగవలయున్ 54

రాజనగ చారచక్షువు
గా,జనులనుబ్రోవఁ దగును - జాగరియగుచున్
బీజమునుబట్టి మొలచును
సాజమ్ముగ భూజమగును సమయము నందున్ 55

న్యాయముగా, ధర్మమ్మ
ధ్యేయముగా, సాధుజనుల హిత మెల్లపుడా
ప్యాయముగా, మనుగడ నా
ధ్యేయముగా నడపఁదగును క్షితిపతి నిరతిన్ 56

దక్షత కావలె ననువగు
శిక్షాముఖ్యంబు రిపులఁజెండాడఁగ ని
ర్దాక్షిణ్యముతో మెలఁగిన
నక్షిగతంబౌను శాంతి యవనిపుశక్తిన్ 57

ధర్మాధర్మవిచక్షణ
నిర్మలవర్తనము, కార్యనిర్వహణమునం
దేర్మిలి, దిట్టతనమ్మును
మర్మజ్ఞత వలయు రాజమార్తాండునకున్ 58

అనుమానము పెనుభూతము
సునిశితముగ నేర్పుకొలఁది చూచిన యెడలన్
జనహృదయమాకళింపగ
ననువగు - శంకయును గలుగ దావంతైనన్ 59

పిడివాదమ్ములతోడను
పెడవాదము సేయునట్టి పెడగుల నెప్పుడున్
కడుదూరమ్మున నుంచుము
చెడుగుకలుగు వారివలన స్థితియును మాఱున్ 60

రాజైనవాఁడు విధిగా
ప్రాణితముగఁగొలువుఁదీర్పవలయు దినమ్మున్
ప్రాజాపత్యము స్థిరమై
రాజిల్లును సందియముల రాయిడిలేమిన్ 61

చానలకుఁబాలనంబున
స్థానంబుండంగఁజనదు - చాపల్యమునన్
లూనంబగుచు రహస్యము
లానాల్కలపైని నిల్వకాపదఁదెచ్చున్ 62

తనచుట్టు మెలఁగువారల
జనపతి కనుగలిగి చూడఁజను - భృత్యులపై
ననిశము కొండెములాడుచు
మనసు విఱువఁజూచు వారి మార్గ్మాన వలయున్ 63

వేదవిరుద్ధము ధర్మము
కాదు - వృథాజల్పనములఁగల్మషమతితో
వాదమ్ముఁజేయఁగూడ, వ
వైదికముగ నట్టివారి వారింపఁదగున్ 64

అధికృతుల క్రూరవర్తన
మధిపునిరాసక్తతయును, నౌదాసీన్యం
బధనులలో ద్వేషమ్మును
వ్యథగూర్చును, నప్రమత్తుఁడై యరయవలెన్ 65

దోషులను విడిచినను, ని
ర్దోషుల దండించినయెడ దొంగలు దొరలై
భేషజముంజూపుచుఁగడు
వైషమ్యముతోడదోఁచివైతురు ప్రజలన్ 66

హితవరిణాటుఁటన్కొని నహీనపరాక్రమశాలి తండ్రితోఁ
[illegible]నార్చి ధర్మమును వర్ధిలఁజేయగ, తల్లిమాట న
ప్రతిహారి[illegible]యాటుధానవధ ధావితమై యిటువేఁగుదెంచి, నే
[illegible]నేలగా వెనుకకున్ జనుదెంచుట రాజనీతియే 67

అరువదివేల వత్సరము లాయన రాజ్యము నేలె నోర్పుమై
పదునెనిమిది[illegible] పౌరజనంబు పాలనసేయుము - మేలు దాన. నీ
[illegible] చెప్పు రమ్మనుట, వచ్చుట నేను సమ్మతించుటల్
ధరణి ! ప్రశస్యమౌనె ? పరివారలలో నిదిదూష్యమౌ కదా ! 68

మితవాదిత్వము వదలుచు
హితమును గావించె రాముఁడెంతయొ ప్రేమన్
చతురత దీపింపగఁగడు
పటుతరముతో భరతుమనసు కుదురుకొనుటకై 69

ఋషియంత విన్న భరతుఁడు
[illegible] వాత్సల్యవచనవారిమవెల్లన్
హృదయమున బట్టఁబలికెను
వచనమ్మునదోఁప విన్నఁబాటు వెలుచనై 70

అన్న ! నీ చెప్పిన దంతయు సత్యమే !
వర్తించురాజైనవాని యెడల
మానవధర్మమే మట్టిఁగల్పిన నాకు
రాజధర్మమ్ముల రగడ యేల ?

ఔరసుండగు నిన్ను దూరంబునందుంచి
నేను రాజ్యము చేయనేర - ధర్మ
మిందుసుంతయులేదు డెందము ఘూర్ణిల్లు
రాజ్యార్హుఁడవు నీవు - రాజవీవు
రావలయు నీ వయోధ్యకు - రాజ్యపీఠ
మధివసించిన సంతృప్తినందువాఁడ
నేను భావింతు నృపతిగా నిన్ను రామ
భద్ర ! సాకేతమున కేఁగు వారమిపుడు 71

వేంచేయుమా రామ! వెన్కకేతెంచి నీ
రాజ్యమ్ముఁ జేకొన రమ్ము ! రమ్ము !
నీ యభిషేకము నే కన్నులారగఁ
గాంచెద-నిల్పుము గౌరవమును
ప్రజలకు భూపుఁడే ప్రాణమ్ము, నాదృష్టి
లో నీవునేతవు-లోకదృష్టి
యందున గూడ నీ వౌదువు జనపతి
నాకాంక్షఁదీర్పుము హాయిఁగూర్చి

రామ ! భగవంతుడవు, పరంధాముఁడవని
మానవాకృతిలోనున్న మహితమూర్తి
వనుచు స్ఫురియించు నాహృదయమ్మునందు
నన్ను మన్నింపవే కరుణాసముద్ర ! 72

అతిమానుషము కదా! అగ్రజా! నీవృత్త
మడవులలోనుండ నగునె నీవు?
మేనమామల యిండ్ల నేనుంటి ననుజుతో
నింక జనకునకు నేది దిక్కు?
పుత్రులుండియు లేకపోవంగ మనతండ్రి
దేహమ్ముచాలించి దివి కరిగెను
అడవులకేంగ నిన్విడలేక యాతని
ప్రాణముల్ నీతోడ పయనమయ్యె

తండ్రి యెక్కడనింక! వాగ్దాన మిటులఁ
దీర్చెజనకుండు నీ వ్రతదీక్షఁ గూడ
విడువనగు నేరికోసమై యడవి నుంగు
రచటికేతెంచుఁ దర్మిలి ననఘ! మీరు 73

వరమోత్సాహముతోడ నీకు జరుగున్ పట్టాభిషేకంబిటన్
చిరకాలమ్మగ వేచియున్నప్రజ కుత్సేకమ్ముకల్గున్-నిశా
చరసంహారముఁజేయ వీలగును వాంఛాపూర్తిఁ గావింపగా
కరుణాసాగర! రమ్మయోధ్యకిపుడేకాదంచు మారాడకే 74

అపరకర్మలఁ గావించి నృపతి కిటకు
వచ్చితిమి నేను తమ్ముఁడు, ప్రజలు, గురులు
తల్లులును, మంత్రులును వెంట తరలిరాగ
దూరమునగలరు వారలు-చేరఁగలరు 75

నిన్ను గూర్చియె విలపించె నృపతి తాను
మరణకాలమునందు నిమగ్నమైన
మానసమ్మున నీకొఱకై నిరీక్షఁ
జేసె-నీ విచ్చు జలములు చేరు నతని 76

ప్రీతిపాత్రుఁడవగుటవు పితరునకును
పెద్దవాఁడవు మాలోన విడువుమీవు
పూజ్యునకు నివాపోదకములను మరల
నక్షయసుఖమ్ము పితృలోకమందుఁ బొంద 77

గతచేతనుండుగా పితరుని మృతివార్త
తెలిసిన రాముఁడు కలఁతపడుచు
భరతునిమాటలు వజ్రాయుధము వోలె
పైఁబడ ధరణిపై వ్రాలె నతఁడు
శిలాంఘాతమ్ముపఁ గూలిన మత్తవే
దండమ్ము పోలికఁ దలఁకె నతఁడు
గుండెలలో బాకు గ్రుచ్చిన రీతిగా
వేదన విలవిలవేఁగె నతఁడు

సీతయును, లక్ష్మణుండును శీతలోప
చారవిధుల నొనర్పగఁ దేఱుకొనుచు
లలితహృదయుఁడు పసిబాలువలెను రోద
నమ్ముఁజేసెను తమ్ముల, నాతిఁగూడి 78

శోకమూర్తులైన సోదరులును సీత
నూఱడించె సాంత్వనోక్తు లాడి
వృద్ధమంత్రి సుమంత్రుఁ డిద్ధమానసుఁడప్పు
డెఱుకపఱచె ముందు జరుగు పనుల 79

అనుసరింపగ దాషుపుంతనియె నిటుల
సుదయముమాదిగ నూహాతో మెదలు నేదొ
చెట్టజరుగునటంచు నీ వెట్టివంపు
మాటవిననయ్యె దుర్భరోద్వాసముగ 80

దుర్జాతరుఁడ నేను తోతెంచి తేలసు
నన్నుఁ దోడ్కొనిపోవ-నన్నుఁగూర్చి
మరణించె దశరథ మహీవల్లభుఁడు నేను
సంస్కార మొనరింపఁ జాలనైతి
నీవు శత్రుఘ్నుండు నిస్తులమతులు, న
దృష్టవంతులు గాన నిది పొనఁగెను
లేకుండె మనతండ్రి సాకేతపురి నాకు
పనియేమి? రానిష్డ భరత! యింక

మంచిచెడ్డల వివరించు మాన్యురెవరు?
ఎంతయాప్యాయముగఁ జూచె నెదురుపడిన
మనసు మనసంతఁ జూపుల మధురభావ
రుచులతో నచ్ఛమగు ప్రేమ రూపుఁ దాల్ప 81

ఈజన్మంబున దండ్రిప్రేమయనుమాటే లేద! ఆ ప్రేమలో
రాజీవమ్ములు పూచుచుండెడివి గారాబంబులో మున్కలై
ప్రాజాపత్యము సంగతిసేమఱచి స్మేరస్ఫీతసౌహిత్యముల్
సౌజన్యమ్మును చాటుచుండెడివి హర్షస్వాంతునిం జేయుచున్ 82

సీతా ! నీయెడ నెంతప్రేమఁగురియించెన్ జన్మవాసింపగా
నోతప్రోతముగా ముదంపడుచు నెంతోప్రేష్ఠభావమ్మునన్
ప్రీతింజూపెను-నేఁడులేఁడు-తనువున్‌వీడెన్ విశీర్ణమ్ముగా
చేతంబెట్టిదొ వేద్యమయ్యె విధివంచించెన్‌సుమీ క్రూరమై 83

కోడలిని. సుమకోమలి, సుందరదన
జలరుహానన, చక్షుష్య, చారునేత్రి
కుటిలకుంతల నినుగాంచి కూర్మిఁజూపి
మమత మన్నించువాఁడుగా మాన్యుఁడెపుడు 84

జనకుండేఁగెను స్వర్గధామమునకున్ సాకేతముంజూడగా
కనులన్ బాష్పము లేకధారగురియున్ కాకుత్స్థ వంశాగ్రణిన్
తనలో లీనముఁ జేసికొంచుఁ గడువంతంగూర్చె, నేనింతలో
వనముల్ వీడుచుచాఁ బ్రయత్నమొనరింపంజాల దుఃఖమ్ముతో 85

నేనురాలేను వెనుకకు నిశ్చయమ్ము
మారఁబోవదు - జనకుండు మరణమొందఁ
బదటఁ గల్పుదునా వరపాలనమ్ము?
ఎదల న్యాయంబె దైత్యనిబర్హణమ్ము? 86

సజలనేత్రపద్మములన్ నిల్చె ఖిన్నమూర్తి
దశరథుని పట్టరాని వత్సలత నెంచి
రామచంద్రుని దుఃఖమ్ము, ప్రేమఁగాంచి
నోట మాటలురాక నారాటపడుచు 8

తండ్రిమరణ మెడందఁగదల్చికొని
ప్రథిమతో లక్ష్మణుండటఁ దాల్మినిలిచె
ధైర్యమును జిక్కఁబట్టుచు ధరణిజాత
నగ్రజన్ము మృదూక్తుల ననునయింప 8

తదుపరి రామచంద్రుఁడును దక్కినవారలు గాంగవారిలో
పదపడి స్నానముల్ సలిపి ప్రక్కలనుండ జలంబులంజలిన్
పదిలుఁడు పూనుచున్మదిని బంక్తిరథున్ మననమ్ము సేయుచున్
గుదురుకొనంగ నంబరముఁ గుందుచుఁ గాంచుచుఁ బల్కెనివ్విధిన్ 8

“పితృలోకగతుఁడు జనకుఁడు
సుతుఁడొసఁగెడి జలముఁగొంచు సురుగగ దాహం
బతిధృతి సుఖించుఁ గావుత
మతిశయముం బొందుగాత నస్తోకముగా” 90

గంగాజలమునుండి గట్టునకేతెంచి
శ్రాద్ధకర్మ నొనర్ప సిద్ధమగుచు
నింగుదీపిణ్యాకముంగొంచు బదరీప
లంబుల దర్భ ప్రాంతంబునందు

నునిచి తండ్రికి మ్రొక్కి। జనక! యీ యన్నంబు
భుజియింపుమతి ప్రేమ - పురుషుఁడేది
భుజియించునోయది భోజ్యమ్ము వేల్పుల
కగుసు నైవేద్యమ్ము సాదరముగ

స్వీకరింపు మటంచును వేఁడుకొనుచు
పిండముల గాంగజలములవేసివెడలెఁ
జిత్రకూటమ్మునకుఁబత్ని సీతతోఁ
లక్ష్మణునిగూడి రాముఁదాలఁజియగుచు 91

తమ్ములను గౌఁగిలించిశోకమ్ముతోడ
గోడుగోడున విలపింప, గొంతుకలిపె
జానకియు కూడ వారితో సవ్వడివిని
శ్రీవసిష్ఠులు మాతలు చేరి రటకు 92

మందాకినీతీరమందుండి వచ్చెడి
త్రోవలో రాజపత్నులకు నక్షి
గతమయ్యె నటస్నాన ఘట్టముల్ వేదికల్,
రాముండు శ్రాద్ధకర్మను బొనర్చి
నట్టి తావును, దక్షిణాగ్రమ్ము లౌకుశ,
లింగుదీపిణ్యాక మిచట నచట
నీపిండవిధియ మహీమండలంబేలు
భూమిజానికిఁజేయఁబొసఁగదనుచు

నాఁపుకొనలేని శోకమ్ము, నలఁతతోడ
జానకీరాము లుండు నాశ్రమమువైపు
సాగిపోయిరి గురువులు చనినదారి
దిక్కులంఁజూచు తహతహ వేగిరింప

పౌరులును, సైనికులు, తక్కువారలచటి
కేఁగుదెంచిరి వెనువెంట - ప్రోగుపడిరి
వారి రాకతో ధ్వనియించె ప్రాంతభూమి
దుఃఖవిచలితదృశ్యముల్ తోఁచె నచట 9

అందఱు నొకచో యేడుపు
ప్రమందెను భూపాలుఁడనుచు, మాట కొఱకు రా
జ్యేందిరను వదలి రాముఁడు
వందురుచు వనంబులందు వర్తిలు ననుచున్ 95

పృతనను, మంత్రులన్, ప్రజలఁ బ్రీతినిగాంచుచు రాముఁడున్ యథో
చితముగ గౌరవించెను - వసిష్ఠమహర్షి పదమ్ములంటి స
త్కృతి యొనరించె భక్తి - పరిదేవనముంబొనరించి తల్లులున్
శ్రుతపఋషన్ సమస్తము విశుద్ధచరిత్రులు మ్రొక్కిరర్మిలిన్ 96

నిస్తిలకపోలభాగపై నిలిచియున్న
తల్లులంగాంచి రాముఁడు తల్లడిలెను
తరుణులకు శాపమైన వైధవ్యమంత
దుర్విపాకము కన్పింప దుర్విననుచు 97

కులగురువు శ్రీవసిష్ఠులు
నలినాక్షినిగాంచి సాంత్వనముఁ గావింపన్
బహువిధముల - తత్రత్యుల
పలుకులతో రామవిభుని స్వాంతముతేఁటెన్ 98

సత్యధర్మములకు మానసమ్మునందు
విలువ తనకెక్కువనుచును బలికె రాఘ
వేంద్రుఁడంతట సందటినెంతొ ప్రేమఁ
దనరఁజూపి కృతజ్ఞత కనులతోనె 99

'జనకుని జ్ఞాపకమ్మువె యజస్రము నాహృదియందు నిల్చుచున్
మనుచునునన్ను - జీవితము మాన్యుఁడుచూపిన ధర్మమార్గమం
దనిశముసాగు - సత్యము ప్రియంబుగవర్తిలు మానసంబునన్
వినయముతో చరింతు నడవిన్, పడవిన్ సమదృష్టిఁ జూచెదన్ 100

రాముని గాంచ స్వర్గమునుండి పతితుఁడై
నట్టి సుపర్వుఁడోయన గఁదోఁప
నూర్మిళాధవుఁజూడ నూపిరియేతప్ప
ఆహారమెఱుఁగని యట్టులుండ
ధరణిజఁ గాంచ నాతపతప్తపద్మమ్మొ,
జలదనంచ్ఛన్నమౌ చంద్రకళయొ,
కలఁగిన మడుగునుత్పలమొ, రజోగ్రస్త
కాంచనమ్మో యనగానిపింప

రాజపత్నులు హృదయవిదారకముగ
బిట్టు విలపించి రయ్యెడ బెడఁకుతోడ
రాచపుట్టువుపుట్టి రారాపిడులను
ఘోరవిపినంబులంబొందఁగుంది, కుమిలి

కడుపుచెలువైన కౌసల్య సుడివడంగ
రామచంద్రుని, సౌమిత్రి, రమణిసీతఁ
గౌఁగిటఁగదించి వాపోయె కనులనీరు
తిరుగుచుండంగ వారి దుస్థితికి వగచి

అశ్రువులు గండభాగమ్ములందు నిలువ
నత్త కౌసల్యవచియించె నమ్మ! సీత!
భర్తతోడిదేలోకము పడఁతికనుచు
సిలుగులకు జంక కడవులఁ జేరినావు 1

ధర్మపత్ని పదమ్ము సార్థకముచేసి
తేజముంగూర్చి నావు నారీజగత్తు
నందు నాదర్శవనితవై యందుకొంటి
వినకులయశమ్ము దిక్కులకెగసె నేఁడు 1

శివధనుర్భంగ మొనరించి సీత ! నిన్నుఁ
బరిణయంబాడి రాముండు తరలువేళ
నిన్ను నాకప్పగించుచు నీజనకుఁడు
పలికె నీరీతి నన్నుఁ గాంచి కలఁతపడుచు 10

'కన్నుల దీపమువలె నీ
యన్నుంబెంచితిని బెండ్లియాడె రఘువరున్
తిన్నగ తెలియక వర్తిల
మన్ననతో మందలించి మమతంగనుఁడీ ! 106

సీతను నుద్వహించె గుణశేఖరుఁడౌ రఘురాముఁడామె నా
కూఁతురె కాని రాఘవుల కోడలిగా నిపు డప్పగింతు నే
నీతరళాక్షిఁబెంచితిని నెంతయొ గారవ మొప్ప నింక 'మీ
సీతయె' రెండువంశముల శీలముతోడ యశమ్మునించెడిన్ 107

అమాన్యుని వచనమ్ముల
కోమలి ! సఫలమ్ము సేయఁగూరిమితోడన్
రాముని కనువగు సేవల
నేమఱక నొనర్చుచుంటివే పనిగొంచున్ 108

సహధర్మచారిణివి నీ
సహకారము వలన రామచంద్రుఁడు వనులన్
బహువిధములఁదృప్తిని బ్ర
త్యహమున్ వర్తింపఁగలుగు టబ్బుర మగునే ? 109

పర్ణశాలల మేడల పగిది నెంచి
కందమూలఫలమ్ము లానంద మొసఁగ
నిష్టమృష్టాన్నముల వోలె నింపుఁగూర్ప
నడవులం బాదచారిగ నడవఁగడిఁది ! 110

సహనశీల సుమిత్రయు, కలితహృదయ
కైకయును సీతనట్టులే కౌఁగిలించి
శిరము మూర్కొంచు దీవింప పరమభక్తి
నత్తలందఱికిన్ మ్రొక్కె నవని పుత్రి

అందఱు ముఖ్యులాశ్రమము నందునివిష్టులుగాగ రాముఁడున్
కొందలపాటుతోఁబలికె కూర్మిసహోదర ! యేల వచ్చినా
విందులకున్ బురిన్ విడిచి యేర్పడఁజెప్పుము రాజ్యమేలగా
సందియమేల ? నీతెఱఁగు సాంప్రతమై చనునే వచింపుమా ।

మరణించెన్ జనకుండు-ధారుణిని సామర్ధ్యంబుతో నేల ?
కరణిన్ మౌనివలెన్ మృగాజినము దీక్షాజటాజూటమ్ముతో
భరతా! వచ్చుటకేమికారణము? నిర్వర్తించెదేరాజ్య? మీ
సరణిన్మెచ్చగ లేనయోధ్యకరుగన్సాధ్యంబె నాకింతలో ।

భరతుండేడ్చుచు రాముపాదములపై వ్రాలెన్ 'విరుద్ధమ్ము నీ
ధరణిన్జేకొన న్యాయమెట్టులగు - సాధ్యంబే ప్రజాభీష్టమే
కరణిన్గాదనె దీవు-తల్లులును నాకాంక్షింతు రాసక్తిమై
నిరతంబేను త్వదీయభక్తుఁడను సందేహింతువే చెప్పుమా! ।

రమ్ము! శ్రీరామచంద్ర! నీరాజ్యమీవు
తీసికొనిమమ్ముఁ గాపాడ తిగుటలేదె ?
సర్వజనప్రీతిపాత్రమౌ సరణి కాన
హర్షదాయకమగు నిది యందఱకును ॥

రాముండల్లననవ్వి 'నీ పలుకులన్ రవ్వంతధర్మమ్ము లే
దేమార్గమ్మున జూచినన్-జనకుఁడాసించెన్ నినున్ రాజుగాఁ
బ్రేమంజేయగఁగోరె దల్లియునుగోరెన్ దాననాయాజ్ఞలన్
నేమంబున్ మఱిగాలికిన్ వదలిరానే? యద్ది దుర్నీతిహా 116

తల్లిదండ్రుల మాటల దాటఁవశమె?
నాకు నధికారమేది? యన్యాయమనదె
జగతి? పితరుండు లే డిపు డగపడువచ్చు
మన కతనిమాట పరమ ప్రమాణమగును 117

అతఁడు జీవించియుండగ నడవికేఁగి
యతఁడు మరణించినంతనే అకట! తిరిగి
వచ్చి స్వార్థమ్ముతోఁ బృథ్వీపాలనమ్ముఁ
జేయ సింహాసనం బధిష్ఠింపగలనె? 118

సే కిచ్చె రాజ్యపాలన
నాకుఁ బ్రవాసమ్ము నొసఁగె నాయన! కనుకన్
చేకొనగ దాయభాగము
లీకరణిన్ మేలకాదె-యింపెసలారన్ 119

దిక్కుమొగమువైచి స్రుక్కెను భరతుండు
తలఁకి రచటనున్న తక్కుజనులు
కొంతవడికి తేఱుకొని పల్కె రాముని
జూచి భరతుఁ డేడ్చుచున్ విరక్తి 120

అయిననొకమాటఁ జెప్పెద నాలకింపు
మన్న! నీచెప్పినట్లిచ్చెనవని ధవుఁడు
నాదురాజ్యము - భక్తిని నీకొసంగఁ
దలఁచితిని స్వీకరించిన ధన్యుఁడగుదు 121

అశ్వవేగము ఖరమున కలవియగునె?
గరుడి సత్త్వము సామాన్యఖగమునకును
గల్గునే? గుణసామ్యము కలదె నీకు
నాకు? కావున నీరాక మాకువలయు 122

ఉదయ సూర్యునివలె గద్దెనొప్పు నిన్ను
ప్రజలు కనుగొన్న హర్షవారాశిఁదోఁగి
పులకితశరీరులగుదురు పూజ్య! పురికి
వచ్చివారలఁ దనియింపవలయు సుమ్ము 123

అతనిప్రార్థన కేమియు నంతులేదు
మఱుపాటున కన్నీరు తుడుచుకొనుచుఁ
చెప్పికొని పోవుచుండె - కుసించుచుండె
గుండెలందు విషాదమ్ము గూడుకట్ట 124

కడుపులో చెయిపెట్టి కలఁచినట్లయ్యెను
రామచంద్రుని కంత ప్రేమమూర్తి
భరతుని త్యాగమ్ము, భక్తి, నిస్తులమని
భావించి యబ్బురం పడుచుఁబలికె

ధనములన్నియు క్షయాంతములును, పతనాంత
ములగు సముచ్ఛ్రాయములు, ననల్ప
విప్రయోగాంతముల్ విమల సంయోగముల్
మరణాంతములు సుమ్ము మసరుజీవి

తములు, పడితీరుఫలములు తరులనుండి
నీడవలె మృత్యువెపుడు వెన్నాడు నరుని
ధనికుడు, దరిద్రుఁడన్న భేదములు లేవు
శాశ్వతమ్మటె తనువులు జగతియందు! 125

వార్ధకమ్మున ముడుతలుపడును దేహ
మందు - కేశముల్ నరయును మనుజునకును
శక్తిసామర్థ్యములు తగ్గు — సంక్రమించు
దుర్బలత్వము తప్పదీ దుఃఖపాటు 126

తూర్పుకొండపై భానుండుతోఁచు నప్పుడు
అంతులేని యానందము నందు నరుఁడు
పశ్చిమాంబుధి సూర్యుండు వ్రాలు నప్పుడు
చెప్పగాని సంతోషముఁ జెందునతఁడు 127

ఒకటిమాత్రము గమనింపఁడొకఁడు కూడ
కాలగమనమ్ములో తగ్గగలదు నాయు
వనుచు సుంతయు — జీవితం బనఁగ నిదియె
ఈ రహస్యమ్ముఁదెలియంగనేరఁడెవఁడు 128

చైత్రమరుగుదెంచి చిత్రమ్ముగా పూలు
పూచి ఋతువుశోభ పులకరింపఁ
జేయు నాయువును విశీర్ణమ్ముఁగావించు
టెఱుఁగబోడు నిజము నరయలేఁడు 129

రెండుకాష్ఠములును నిండుప్రవాహమ్ము
నందు కొంతదూర మరుగుఁగలిసి
తిరిగి రెండు నెడము - తెన్నులు వేఱగు
నాలుబిడ్డలట్లె చీలఁగలరు 130

మానవునకులేదు దేనియందును గూడ
స్వాతంత్ర్యమన్నది సమకొనంగ
వీలుగల్గదు ముందువెనుక కృతాంతుఁడే
పొంచియుండి సమయమెంచుచుండు

పాంథులరుగుచుండు బాటవోలెను జీవి
తాధ్వమందు బయనమౌనుజీవి
పెద్దవారలరుగుబాటయే పిన్నలు
పోవుమార్గమగును - పొగులనేల

బుద్ధి కర్మానుసారిణి - పూర్వసుకృత
దుష్కృత ఫలంబులంబట్టితోఁచు సుఖము
దుఃఖమును - తప్పుకొనఁగాదు - తోయదములు
నిలుచునే వ్యోమపథమున తొలఁగకుండ 131

ధర్మసంబంధియై తనర సౌఖ్యమ్ముల
 నందంగవలె నరుఁడందుకొనిన
సుఖముప్రియంబగు సుమ్ము మానవునకు
 పాపమార్గమ్ము నిష్ఫలము కాదె
దశరథుండెన్నియో ధర్మకార్యమ్ములు
 యాగముల్ కావించి యఘవిదూరుఁ
డగుచు సుఖంబందె నాపయి స్వర్గసు
 ఖంబందె నతనికై కలఁత యేల ?

మానుషంబైన దేహమ్ము మాయమయ్యెఁ
గాని దైవసంపద పొందె ఘనుఁడు కాన
ధీరుఁడెందును శోకమ్ముఁజేరనీడు
చేయునదిలేదు చింతించి చేవఁ దొఱఁగి 132

సత్యసంధుడు పితరుని జనని రెండు
వరము లడిగెను - దానికి వల్లెయనెను
సమ్మతించితి నేను వనమ్ముఁజేర
వచ్చితి, నయోధ్య కెట్లు నే వత్తువాఁడ! 133

చరిత్రవతుఁడవు-ధర్మము
నెఱిఁగినమాన్యుండ విటుల నేల భయపడన్
నరవరు కాంక్షితమిది-దు
ష్కరమనిభావింతె సత్త్వసంపన్నుఁడవై 134

పరువెత్తువాఁగును తిరిగి వెన్కకుఁ ద్రిప్ప
సాధ్యంబె యెంతటి సాహసునకు?
మానవులందఱు మరణమ్ముఁ బొందుదు
రెప్పుడోయొకసారి తప్పదిద్ది
తనుదాన రక్షించుకొనలేఁడు పరులను
గాపాడ గలనంచు గర్వపడును
మనుజుండు, గడచిన దినము గడచుకాని
క్రమ్మఱరాదుగా క్రమము తప్ప

కాయువది తగ్గిపోవు నిక్కముగనెఱుఁగ
రానివిధమున మందుఁడై మానవుండు
కాలగతి నరయఁజాలఁడు, నోలు, స్రుక్కు-
నాత్మవంచన చరియించు ననవరతము 135

భార్యలయెడ తనయులయెడ
పర్యాలోచనము సేయ భావ్యమె? తండ్రుల్
కార్యముల నిర్వహింప న
కార్యమ్ములుకావు కామకారంబున్నన్ 136

తల్లిదండ్రుల మాటలు తనయులకును
గౌరవార్హము లగుకాదె - వారు నాక
రణ్యవాసమ్ము మఱినీకు రాజ్యమిచ్చి
నారుగా ధాయభాగములై రహింప 137

ఇటులఁ బలికి మౌనమును వహించె రామ
చంద్రుఁడొక కొంత సేపు నిశ్శబ్దమయ్యె
భరతుఁడంతట శిరమును వంచి యేమి
పలుకఁజాలక కూర్చుండెఁ బ్రతిమవోలె 138



# తృతీయాశ్వాసము

మౌన ముద్వాసముఁజేసి తానె ముందు
భరతుఁడగ్రజుఁబరికించి పలికెనిటుల
'నన్న ! మన్నింపు మిపుడు నాయభిమతమ్ము
ధన్యుఁడగుదును సద్దాన మాన్యచరిత !

జగతిని నిన్నుబోలు గుణసాగరుఁడెచ్చటనుండు ? చేరవే
పగఁపుబు - త్రుంగవెన్నడు - ప్రవర్తన మంజుల మెట్టిధర్మమున్
గగనము కాదు - సత్యమును గంతమువోయిన వీడవెమ్మెయిన్
తగులపు స్వార్థచింతన - వితర్కము సందియ మందవెన్నడున్

పెద్దల గౌరవించెదవు - వేత్తవె యయ్యును సంశయమ్ములన్
విద్దెలలోని మర్మమును వేడుకకై వినువారి కోస, మే
ప్రొద్దునెఱుంగఁగోరెదవు - రూపితధర్ముఁడ వాత్మగౌరవం
బొద్దిక నీకు భూషణము లొప్పిదమున్ సమకూర్చు శిష్టమై

దరిఁజేర దేవిచారము
నిరుపమసౌహార్దగరిమ, నిస్తులమేధా
పరిపూతమనస్కుఁడవై
పరిపూర్ణుఁడ వన్నియెడల పావన చరితా !

జనకుఁడు దివముంజేరెను
జననియు శోకమ్ముతోడ సదమదమగుచున్
వనములకుంజనుదెంచెను
నినుఁజూడగ నార్తితోడ నిష్కపటముగా ౬

వేల్పులకోర్కెపై జనని వెక్కసమైనను నిస్పృఁ బొంపె న
త్యల్పవరద్వయమ్ము మిష నాయమ కారణమౌచు దివ్యసం
కల్పము మేరకున్ దనకుగా తన భావి నెఱింగియున్ వెతన్
బొల్పడఁజేసె నివ్విధి ప్రవాసము ప్రేమను లోనడంచుచున్ 6

నిందంజేసిన లోక మామె ద్రఢిమన్ నిర్భీతితో మార్కొనెన్
సందర్భంబది వచ్చినప్పుడు కథన్ సొంతంబుగా నామెదె
ల్పందథ్యమ్మును నాపయిన్ ముని భరద్వాజుండు సర్వంబుఁదాఁ
గుందున్ మానిపి మాకునెల్లరకు వాక్రుచ్చెన్ భ్రమల్ వాపుచున్ 7

పదునాల్గుదినములనుటకు
బదులుగఁబదునాలుగేండ్లు వనవాసమటం
చెదియో పల్కెను తత్తఱ
మదిలో నిల్పకుము తల్లిమాటలు దానన్ 8

నేనున్ ద్వేషముఁ బెంచుకొంటిఁదొలుతన్ నిష్కాసముంజేసె నే
దోనైచ్యమ్ము నెడందఁబూని యిటులన్ నిర్ధూమధామమ్ముగా
తానై స్వార్థమ్ముతో వరద్వయముతాతన్ గోరెనంచున్ వృథా
నూనామర్షణచిత్తవృత్తి జననిన్ వ్యాకూతియుంచాదితిన్ 9

నీకున్ సర్వము వేద్యమే కద ప్రజానిర్ణీతి నీవెంతయో
ప్రాకాశ్యముగ గౌరవించెదవు సద్భావమ్ముతో వెన్కకున్
రాకున్నన్ బ్రజ చిన్నఁబోవుఁ గనుకన్ రామా! ప్రహర్షమ్ముతో
సాకేతమ్మున నిల్చి, దానవపరిస్పర్ధన్ నివారించుమా! 10

ఆ శ్ర మ స ం ద ర్శ న ము

నిలుతుము మేము ముప్పురము నీకు సహాయమొనర్పఁ గానలన్
ఖలులగుదానవాధముల నాశముసేయగ నందరన్నిచో
టుల భవదీప్సితమ్ములఁ గడుంగడు యోగ్యముగా జరించుచున్
తలఁకము ప్రాణగొడ్డముల తాఁకిడి కాఁగుదు మేపరిస్థితిన్ 11

జనకుని యకార్యకరణము
పనివడునే? దానిఁజక్కఁబఱపగ మేలౌ!
అనఘా! నీ రాజ్యముకొని
యినవంశము కీర్తి నిలుపవే! రఘురామా! 12

తొలుతన్ రాజునొనర్తునంచుఁ బిత నీతోఁజెప్పె నాపైనిఁ దా
నలఘుండమ్మ వరద్వయమ్ము నడుగన్ వ్యక్తంబుఁగావించె న
వ్వల-దీనంగల ధర్మసూక్ష్మమెదియో వాక్రువ్వుమా! నేరపై
నిలువన్ న్యాయము, సత్యసంధతకు హానింగూర్ప దెప్పట్టునన్ 13

అయినన్ జెప్పడు నోటితో నదియు నీవారాజుమౌనంబు ని
శ్చయమంచున్ దలపోసివచ్చితి ప్రవాసంబున్ బొనర్పంగ నీ
భయమున్ వీడుము ధర్మసంశయము నిర్బంధింపదేమాత్రమున్
బయనంబయ్యెదమయ్య! వెన్కకరుగన్-పాలింపవిచ్చేయుమా! 14

అన రఘురాముఁడు సందియ
మున బల్కెను భరత! యద్దిభూపుని యాలో
చన, వాంఛిత, మేర్పాటగు
పనిగొను వరపాలనమ్మె వాగ్దానమగున్ 15

పదునాలుగేఁడులే కదా!
'ఇదిగో! యదిగో! యటన్న నిట్టేనిండున్
ముదమునఁ గైకొని రాజ్యము
చదురుగఁ బాలింపుమయ్య సహనము తోడన్ 16

తానుఁ గైకను బెండ్లాడు తరుణమందు
తండ్రియొసఁగెను మాట మాతామహులకు
కైకసుతుఁడౌను రాజని - కాని మఱచె
సమయభంగమొనర్ప దుస్సహముకాదె 17

తండ్రిమాటను పాటించి ధరణి నేలి
ఋణవిముక్తుఁడ వగుము సద్గుణవరిష్ఠ!
ఇంతలోనేమియగును దోతెంతుకాదె
వచ్చిరాజ్యమ్ము నేయుదు - వాదమేల 18

పరమపవిత్ర నీజననిభావము నర్థముఁజేసికొంటివా?
భరతుఁడు మాటలాడునటు పల్కితివెంతయొ సంతసించితిన్
సురలొగికోరనాయమ కసూయగ మంధరజిహ్వనిల్పి భా
సురపరమేష్ఠిరాణి రిపుసూదనముం బొనరింపఁజేసెడిన్ 19

లోక కల్యాణకాంక్షవిలోకమున
మాతృదేవి కైకమ్మ నామాటకొలఁది
దేశనిష్కాసనము ప్రసాదించె నాకు
దానవనిబర్హణము సేయఁ దలఁతునేను 20

కనుక నీవయోధ్యకు వేగఁజనుము-నేను
దండకారణ్యసీమకుఁ దరలిపోదు
కుశలమతి రిపుఘ్నుండునీకూడనుండు
లక్ష్మణుండుండు నావెంట లలితహృదయ! 21

శంబరాసురునితో సమరంబు సేయున
ప్పుడు కైక సాయమ్ము భూపునకును
జేసి యాతనిని రక్షించెను - దానికి
రాజచంద్రుండు వరంబు లొసఁగె
లలికొంతకాలమ్ము వెలలినతదుపరి
పట్టాభిషేకమ్ముఁ బ్రభు వొనర్ప
నిర్ణయించెను-తల్లి నేర్పున దేవ కా
ర్యార్థమై వరముల నడిగె నృపతి

కనుక నీవాదమందు నిక్కముగ బలము
లేదు-వరముల నీయగ లేదె ముందు?
ఇంక వాదమ్ము సేయుట కిరవుకలదె?
సమ్మతింపను-తిరిగి రాఁజాల ననుజ! 22

తామరసనేత్రుఁ డిట్టు లుదాత్తధర్మ
వచనముల నాడుచుండగ భరతుతోడ
నతనిగని ప్రజ సత్యసంధతకు మెచ్చి
ప్రస్తుతించిరి పరిపరి పరమభక్తి 23

ధర్మసూక్ష్మమ్ములందెల్పి తమ్ముఁగాంచి
రాజ్యపాలనసేయ నిరాకరించు
రాముని౦గని నవ్వుచు లాఘవముగ
ముదలకించెను జాబాలిముని వరుండు 24

విపరీతప్రతిభాషణమ్ములివికావే ? సుంతయోజింపుమా !
నెపముల్ వెట్టి తిరస్కరించెదవు కానీ దోషమేముండు వి
న్నపముంజేయుచు నిల్చి నాభరతుఁడానందించు 'నౌ' నన్నచో
గృపఁజూపింపుము రాజ్యముంగొనుము సాకేతమ్మునన్ నేతవై 25

రాఘవా ! యెంతనిరర్థక మీవాద
ము ను నిరసింపుము - ముదమునందు
మెవ్వనికెవ్వరు నేమియుఁజేయరు
పుట్టునొంటిగ జీవిగిట్టునటులె
మరణించె భూపుండు మరణించుటది సహ
జంబె నిల్వగబోరు చావకుండ
స్వర్గమో నరకమో పరికింప నెవ్వరి
తరముకాదిఁకతల్లి, తండ్రియనుచు

వారి వాక్పాలనము సేయవలయుననుచుఁ
దలఁచు నున్మత్తుఁ డావలఁదలఁకుఁగాన
బ్రదికియున్నంత వఱకె సంబంధములివి
నిధనమ్మొందిన తదుపరినిలువవేవి ? 26

పయనమ్ముసాగించు పాంథుల మార్గమ
ధ్యమునందు మఱికొందఱటులెవచ్చి
వారలతో కొంతదూరమాహ్లాదమ్ము
గా కాలముంబుచ్చి గమ్యములకుఁ
దరలిపోవుదురా విధఁబున జీవులు
కూడను నాయువు మూఁడు పఱకు
'నాతండ్రి' 'నాభార్య' 'నాబిడ్డ' నా'తమ్ము'ఁ
డని బంధములఁబెంచికొనుచు వారు

మృతినిఁబొందిన వారికై మిగుల, పొగిలి
తమను కూడను మరణమ్ము తప్పదనుచు
మదినిదలపోయ కూరక మసలు మనుజు
లుందు రీమహి వారలు మందులె కద ! 27

ఆలోచనముసేయ కంగలార్చుచునున్న
మనుజునట్టుల నేపు మాటలాడె
దేలను ? జగతియందెవ్వరు సాధింపఁ
దగినదేమున్నది ? ధర్మమనుచు
న్యాయమటంచు దుఃఖావిలమ్మొనరించు
కొనసేల నలజడి పెనఁగొనంగ
జీవితఫలమన్న జీవించుటయె కాని
వేఱుగాభావింప వీలులేదు

ఊరకొన్నబ్రదుకు కురిఁదెచ్చుకొననేల
నందుకొనుము సుఖము ననవరతము
బొందెలోన ప్రాణమెందులకేఁగునో
చెప్పఁజాలరెవరు ? చింతయేల ? 28

చేతికిఁదక్కురాజ్యమును చేకొనఁబోవక ధర్మపన్నముల్
నీతులఁజెప్పఁబూనెదవు నేరమికాదిది కంటకాధ్వముల్
తాతల సత్యసంధతకుఁదాలిమిఁద్రొక్కఁగ నుత్సహింతువే ?
చేతము సమ్మతించెనెటు ? చెప్పెడివారలులేక రాఘవా ! 29

జంతూత్పత్తికి రక్తశోణితములే సామాన్య హేతూత్కరం
బింతేకాని తదన్యకారణములున్నే ! మానవుండాస్థతో
సంతానంబును గాంచబోడు విషయేచ్ఛాలాలసందప్ప నీ
వెంతోకాలముపన్యసించితివికాదే శుష్కవాదమ్ముతో 30

మాటికి మాటికిన్ కఱకు మాటలనాడుచు వాదమాడుచున్
చేటునుదెచ్చికొంటకిటు సిద్ధపడంగను యుక్తమే ? జగ
న్నాటకమందుఁదండ్రియును, నాథుడు, బుత్త్రుడు, తమ్ముఁడంచు జం
జాటముతోచరించెదవె ? జాల్ముఁడవెవ్వరికెవ్వరీధరన్ 31

ధర్మాసక్తియనన్యమై చెలఁగనర్థజ్ఞుండవయ్యున్ మృషా
ధర్మముల్ ప్రవచింపఁబూనెదవు వాదప్రజ్ఞతో నెన్నియో
ధర్మమ్మెచ్చటనుండె? నీజనకు కాంతామోహమందుండెనా ?
మర్మమ్మున్ గమనింపకే సుఖమునెమ్మాడ్కిన్ విసర్జింతువో? 32

ఇహమందు సుఖియింపఁడించుకయైనను
　　ధర్మమ్ము పేరుతో తలఁకు నతఁడు
పరమునందేదియో పరమార్థముండునం
　　చాశతో దుఃఖమ్మునందు మిపుల
అష్టకాదివిధుల నన్నినష్టమెకాని
　　మృతుఁడుక్రిందికి వచ్చిమెసవఁబోఁడు
యజ్ఞయాగము లవశ్యాచరణీయము
　　లగు ధర్మకార్యము లవధియేమి

లేని విధముగఁజేయంగఁబూనుఁడనుచు
జపతపమ్ములఁబుణ్యము సమకొనునని
స్వల్పబుద్ధు లమాయికప్రజలదోఁచి
పై చెదరు స్వార్థబుద్ధితో సేచులగుచు 33

గ్రంథములయందుటంకించి గాథలెన్నొ
కల్పనముఁజేసి వ్రాసి నిక్కములటంచు
మాయమాటలఁజెప్పిరి హేయబుద్ధి
అవ్వి ధర్మములెట్లగునయ్య ! రామ ! 34

రాజభోగములనిన విరాగివగుచు
కొండకోనల వసియింప కోర్కెయేల ?
మఱలిరమ్మధికారమునేలప, నేక
వేణితోఁచనయోధ్యతా వేచియుండె 35

పం క్తిరధునకు, నీకు సంబంధమేమి?
బ్రదికి యున్నంతవఱకది పాటియగును
నీవు, నాతఁడు వేర్వేరు నృపతులగుదు
రతనివాగ్దానముల నిల్పనౌనె నీకు? 36

మానవుండెంతకాలము మహినినిల్చు
మరణ మవిలంఘనీయమై పరగుఁగాన
నతఁడు పాటించుధర్మమ్ము లతనితోనె
పోవు-వరపాలనము మాటపోసఁగ దపుడు 37

పరమొ, గిరమ్మొ యెవ్వరికిపట్టదు-సర్వముమిథ్య - కానలన్
దిరుగుటలేల? సోదరుఁడు దేవియు వెంటనురాగ సౌఖ్యముల్
సొరిదిఁబరిత్యజించి వివశుండు నృపాలునియిచ్చమేరకున్
విరసముకాదె నీ తెఱఁగు విజ్ఞుఁడవై మునివృత్తినుండగా? 38

ఒంటరిగా జనించితివి-యొంటరిగాఁ జనిపోదు వెవ్వరున్
వెంటనురారు-జీవితము వేదనతోఁ గడపందలంచితే?
మంటనుగల్పి సౌఖ్యముల మాటఁదలంపక వెఱ్ఱివాఁడవై
కంటకమార్గమందుఁ జనగా మనసయ్యెనెపారగుండవై 39

ప్రాజ్ఞుఁడవయ్యు నీవు వరపాలననేయ గనిచ్చగించి, ధ
ర్మజ్ఞునిరీతిఁ దండ్రికిడుమాటలమేరకుఁ గాననమ్ములం
దజ్ఞతతోమెలంగుటది యర్థము, పర్థములేనిచేఁత రా
జాజ్ఞకు బద్ధుఁడైతి-విఁక నాతఁడుపోయె-పురంబుఁ జేరుమా! 40

పిండములు శ్రాద్ధవిధులట
తిండికి మృతుఁడెట్లువచ్చు-దేబెలు, కుహనా
పండితులు పొట్టకూటికి
కొండొకకూటకము గుండగొయ్యలొనర్పన్ 41

వారు భుజించిన మృతులకు
తీరగబోవునె బుభుక్ష? తీరునొ? లేదో?
యేరికి తెలియును-దండుగ
మారితనముతక్క వేఱు మంచి జరుగునే? 42

దేవానాంప్రియులను సేవ
లేవిధమున నమ్మరాదు హేయంబగు వా
రావర్జనమువ దాతల
కావడిఁగల్పింతురెపుడు స్వార్థముతోడన్ 43

ఏటికొకమారు పెట్టెడి
కూటికొఱకు మృతులు కాచుకొని యుండుదురే?
వాటముగ రెండు పూటలు
నోటికిదోసమ్ముపోక పొసఁగదు మనకున్ 44

ఇంటిలో గృహమేధి తానేదొతినిన
దారిఁబోయెడి పాంథుని కారగించి
నట్టిపెట్టెను-తుంటిపై కొట్టినయెడ
నోటిపండ్లూడునే వట్టిమాటకాని। 45

అనుభవింపుము ప్రత్యక్షమైనసుఖము
నవలఁద్రోయకు మిది సత్యమగుటవలన
రూపమేలేని యేవొ పరోక్షసుఖము
లాశఁజేయుచుఁ గష్టమ్ము లందనేల? 46

తిరిగి యయోధ్యకీవు చనుదేరుము రాజ్యముఁజేకొనంగ దు
ర్భరమగు కష్టసంచయము రాయిడి పెట్టగఁజేఁదు మేనెదే?
పురిగలముఖ్యు లెల్లరును బొంపిరి వోవగఁగొంచుపోవగా
సరగునవచ్చినారిటకు సమ్మతిఁజూపుము సాగిపోవగన్ 47

మొరటుతనము వీడుమోరామ ! కృపఁగొని
పట్టువిడుపు నుండవలయు; ప్రజలు
భరతుఁడెంత నిన్నుఁబ్రార్థించినంగూడఁ
బ్రీతిఁజూపవేల నీతిపేర? 48

ఉందురె యుట్టిఁగట్టుకొనియూఁగుచుఁ గాలముతీరిపోవగా
గ్రమందెను భూమిపాలుఁడు-భ్రమల్ విడనాడుము మెచ్చరెవ్వరీ
చందములన్నిటిన్, తిరిగిచయ్యనఁ దోడ్కొనిపోవ నెల్లరున్
ముందునకేఁగుదెంచిరి ప్రమోదముతోడ ననుగ్రహింపుమా! 49

భరతుఁడువచ్చె పౌరులునువచ్చిరి-తల్లులు, సైన్యముల్ వ్యథా
భరితులు,మౌనికోటి, రవివంశపురోహితులావసిష్ఠులున్
పురికిని నిన్నుదీసికొనిపోవగవచ్చిరి కాదటందువా?
గురుతరబాధ్యతల్ విడిచి కొండలఁగోనల సంచరింతువా? 50

ఎవ్వరునిన్నుఁ గానలకు నేఁగుమటంచును నాజ్ఞచేసిరో
నెవ్వగఁగూర్చినీకు, ధరణీసుత, కర్తివితమ్ముకజ్జకున్
దవ్వుగనుంచిక్రోధము, యథాయథలై నయెడందఁబ్రీతిమై
అవ్వనితాశిరోమణియె నాత్మజుతోచనుదెంచె నీకునై 51

పట్టును, విడుపునుగావలె
నెట్టిసరునకైన గాని యెల్లరు నీకే
పట్టముఁగట్టగ వచ్చిరి
పుట్టిముసుఁగదేమిదీన - బోవగలెమ్మా ! 52

నరకమునందు బాధలును నాకమునందు సుఖమ్ములుండునం
చరతి నిహంబునన్ దలఁపన్యాయమె ? యెవ్వరు చూచి వచ్చి యా
సరణిని దెల్పువారు ? జని సార్థకముంబొనరింప కిట్టులీ
యరగలిపాడుసేయును - భయంబును వీడుచు ధైర్యమూనుమా ! 53

కావున నంతర్మథనము
తోవేఁగుచుఁ ద్రస్తురీతిఁదుఁదుడుకుమెయిన్
బోవగ నెఱతనమగునే ?
చేవగలిగి, ధర్మముండి, సిలుగులఁబడగా 54

ప్రేష్ఠుఁడవు సకలజనులకు
శ్రేష్ఠుఁడవు సర్వశాస్త్ర శిక్షితుఁడవు, సా
ధిష్ఠగుణవరిష్ఠుండవు
జ్యేష్ఠాపత్యమవు రమ్ము ! సీతారమణా ! 55

వింతగనుండె నీదు సరవిన్ గమనింప నిరాశనుండి వే
దాంతము పుట్టినోపునని త త్త్వవిదుల్ తలపోయ పీలగున్
పంతము వీడుమంచు నిలువంబడె సోదరుడెంతొ యాసతో
భ్రాంతిని వీడుమా ! భరతుప్రార్థన కాదన ఖిన్నుఁడౌ సుమీ ! 56

నీవైరాగ్యము మెచ్చరెవ్వరును - యత్నింపగలేదెమ్మెయిన్
నీవైరాజ్యము పొంద - సర్వజన వాణింద్రోసిరాజందువే ?
రావే ! గౌరవభావమున్ నెఱపుచున్ రామామణిన్, లక్ష్మణున్
నీవెంటంగొని రమ్మయోధ్యకుఁబురాణింపంగ రాజౌటకున్ 57

వెదకుకొనుచు వచ్చెకద రాజ్యరమ నిన్ను
నీవు కోరలేదు నీరజాక్ష!
సత్యవాదివంచు సాకులు చెప్పక
రాజ్యమేల నీవు రమ్ము ! పురికి 58

దశరథేశ్వరు మరణవార్తకుఁదలంకి
పాడటినచిత్తవృత్తి నెవ్వగలఁబొగులు
పరమవశి రామచంద్రుని వదనసీమ
జేగురింపగజాబాలి 'నాఁగు' మనియె 59

బాధన్బొందె నధర్మమార్గమున సంభాషించు జాబాలి నా
నేధింపన్ ముని యంచుఁగొంతవడి యౌచిత్యమ్మునెంచెన్, జిత
క్రోధుండయ్యు విరుద్ధభావనల సాకుల్చెప్పి వాదించుచున్
సాధింపన్దలపోయ రాఘవుఁడు దూష్యంబంచుయోజింపుచున్ 60

హేతువాదమ్ముతోఁబల్కు నాతని గని
ముంచుకొనివచ్చు కోపమ్ము దించికొనుచు
ధర్మదూరమ్ములైన వాదములు శ్రవణ
కుహరమున దూఁటుకట్ట ముల్కులవిధముగ 61

భ్రుకుటి ముడివడ కంఠరమ్ములును బిగియ
పరమనాస్తికునటులఁ గన్పట్టు మునిని
కనులలో విస్ఫులింగముల్ తనుకుచుండ
సౌధుఁ గణుచుచు వచియించె నతనితోడ 62

సామంజస్యము సుంతయేనికలదే జాబాలి జ్ఞానీంద్ర! నీ
వామాచారకటూక్తులన్ వినగ చార్వాకమ్మొ, నాస్తిక్యమో
ప్రామాణ్యమ్ముగనెంచి చెప్పినటుఁ గన్పట్టున్ వివాదమ్ముతో
ప్రామిన్కుల్ గమనింప దోషమగునే! ప్రాల్మాలివర్తింతునే? 63

సారాచారవిచారకూస్యునివలెన్ చర్చింతువీరీతిగా
మేరల్దప్పియుపన్యసించెదవు స్వామీ! ధర్మమార్గమ్ము నే
నారాధింతుఁ బ్రవర్తనన్ వెలయఁ జేయన్ యత్నముల్ సల్పెదన్
ధారాళంబగు నిర్ణయమ్ము నిరాతంకమ్ముగాఁ జేసెదన్ 64

వాదంబేటికిఁజేయఁబూనెదవు? పూర్వంబెప్పుడుంగూడ మ
ర్యాదాపేతములైన కార్యముల నూహంజేసిరే రాఘవుల్?
వేదప్రోక్తపథమ్ములం జనిరి భావింపంగ వీరౌనొకో?
పాదృశ్యమ్ములులేవు హేతుకులప్రాశస్త్యమ్ము హెచ్చింపరే! 65

మనముంద్రిప్పగ మీ ప్రయత్నములు ధర్మగ్లానిఁగల్గింపవే?
మనికిన్ నిస్తులమార్గమందు నడపింపంజూతునే వేళ, నా
పని రోధింపగరాదు నింద్యమగుత్రోవన్ భిన్నచారిత్రద
ర్శనులన్ దూరమునందె నిల్పెదను సంరంభమ్ము హేయంబుగా 66

సమ్మానంబును బొందఁగల్గునొకొ దూష్యంబైన కార్యమ్ములం
దెమ్మాడ్కిన్ బురికొల్పఁజూచినను, వాదింపంగ యత్నించినన్
బొమ్మంచున్ నిరసింపఁజాలుదురు-చూపుంద్రిప్పఁ దావంకకున్
సుమ్మా! సజ్జను లట్టిభ్రష్టజనులన్ శుద్ధాత్ములై నిత్యమున్ 67

నేనే నీతిని గోలుపోయిన యెడన్ నేనేరికింజెప్పుదున్
హీనుంగా దలపోయరే బుధులు సౌహిత్యంబుఁజూపంగనె
ట్లానో చెప్పిన సంతసించెదను - ధ్యేయమ్మేది? భూపాలకుం
డే నిర్దళముఁజేయనోపు - ప్రజయట్లేయుండు దుర్నీతితో 68

ఆచరణయోగ్యములుగను నగపడునవి
ముప్పుఁదెచ్చు సనాచారములె మునీంద్ర!
నీవు చేసెడి యుపదేశభావములవి
పథ్యపుంబూత పూయు నపథ్యములగు 69

చిత్తమువచ్చిన రీతిని
చెత్తచెదారమ్ము గణనసేయగనగునే?
ఉత్తమ సంస్కారమ్మును
తత్తఱ బిత్తఱ నొనర్పఁదగునె మహర్షీ! 70

పాపాచారికి, గౌరవ
మే పట్టున దెలియలేని హీనుని కెందున్
చూపరు తగుమర్యాదను
క్ష్మాపాలకుఁడైన గాని సర్వత్రజనుల్ 71

నీయుక్తులనుసరించిన
'ఛీ' యని నిందించి రట్టుసేయుదు రేనున్
హేయముగ సర్వనాశన
మేయగుదున్ చెప్పఁగూడ దీవిషయమ్ముల్ 72

నావిశ్వాసము బీఱువోవదెపుడున్ నక్షత్రమ్ముల్ రాలినన్
చేవంజూపుచు యాతుధానులను విచ్ఛేదించి మౌనీంద్రులన్
గావంజేరితిఁ గాననమ్ములను విఘ్నంబేమి రాదిందులో
పోవంజాలనయోధ్యకున్ సమయవిస్ఫూర్తిన్ విడంబించుచున్ 73

హీనప్రజ్ఞులు తప్ప కాపథమునం దేఁగంగ యత్నింపరో
మౌనీంద్రా ! నను వంటివారికిది గమ్యంబెప్పుడుంగాదు, నా
కానందంబగు లోకకంటకుల ప్రాణాంతమ్మె ! యేకష్టముల్
రానిండింతయు లెక్కసేయ నసిధారా దీక్షనేఁబూనెదన్ 74

ప్రత్యేకతయేమున్నది
ప్రత్యహము సుఖమ్ముకొఱకు పరుగులుతీయన్
సత్యపథమ్మున బోయెద
నిత్యము కాపాడు కష్టనిచయమునందున్ 75

రాజు సుఖకాముకుండైనఁ బ్రజలు కూడ
నట్లెయుండఁ బ్రయత్నింతు రవని నెపుడు
ధర్మము సనాతనమ్ము సత్యాశ్రితమ్ము
రాజవృత్తములివియె నేత్రద్వయమ్ము 76

సత్యప్రతిష్ఠిత జగతిలో రాజ్యమ్ము
సత్యస్వరూపమ్ము, సార్వకాలి
కముగఁ బ్రవర్తిల్లు క్రమముఁదప్పిన శాంతి
విరళమైపాలితుల్ విరతిలేక
వేదనతో కాలమేదిక్కుతోఁచక
అష్టకష్టములతో నార్తిగుంద
సన్మార్గమునువీడి స్వర్గమ్మునేనెట్లు
కాంక్షింపఁగల్గుదు కనుక ధర్మ

భ్రష్టుఁడనగుదునె చెపుము జాబాలిమౌని !
సుఖములన నశ్వరమ్ములు, సొలఁపుతోడ
త్రోసిపైచెద - పరమమౌత్రోవనడతు
స్థిరుఁడనై నిల్తు దీనికి తిరుగులేదు 77

సమ్మతింపను నీతిదూరమ్ము, నింద్య
మైన నేక్షత్రధర్మము - కాననములె
మేలు - క్షుద్రులు, లుబ్ధులు మేరమీఱి
కోరెదరుగాక ! దాని నే కోరుకొనను 78

పరమధర్మమ్మునకును తర్పణమొనర్చి
నాస్తికత్వముఁబూని యనార్యమైన
యుక్తులంజెప్పనేనెటులొడబడంగఁ
గల్గుదును కామభోగముల్ కాంక్షఁజేసి

మంచితనమున నిన్నాదరించెనృపతి
ధర్మహీనుని, నాస్తికుఁదాల్మితోడ
మానవీయముకాదు నీమాట వినుచు
నే ప్రమాదము రానీయనిపుడు మౌని ! 8

సత్యవాదియైన సకలధర్మమ్ములు
వానిననుసరింపవలసి గలదు
సత్యసంధుడైన జనకునికై రాజ్య
మేను స్వీకరింపలేను స్వామి ! 8.

కర్మభూమిమనది - ధర్మసంస్థాపన
ముఖ్యమగును సకల భూవిభులకు
యజ్ఞయాగములను విజ్ఞతఁగావింప
నిలుపవలెను కీర్తినిష్ఠతోడ 82

చెంతను జేరనిచ్చె నిను చేటును దెచ్చెదవంచు నెంచకే
కొంతకుకొంత నీయెడలఁగూరిమిఁజూపుచు తండ్రి! యేల భా
స్వంతుకులమ్ముపేర్మి నిలుపందలపోయక మంటఁగల్పఁగా
నెంతునె నీ దురుక్తుల సహింపను ధర్మము నుజ్జగింతునే ? 83

లోకాయతికుల బోధన
మాకర్ణింపంగరాదు యమనియమంబుల్
వాకొందు రర్థరహితము
లాఁకట్టుసుఖమ్ములంచు వ్యాఘాతములన్ 84

కెరటము రాతిని దాఁకిన
కెరటంచే విఱుగుఁగాని కెలఁకునె బండన్ ?
గిరగిర తిరుగుచు కష్టము
లరుగును కెరటమ్ము విఱుగునట్టి విధానన్ 85

ధైర్యముకావలె దేనికి
కార్యము సాధించుకొఱకు కష్టము లెదురై
పర్యస్తమగును - జీవిత
పర్యంతము నిలువఁబోవు - వచ్చుసుఖంబుల్ 86

అర్యమకులజులు ధౌరం
ధర్యముగా సహనబుద్ధి, ధైర్యముతోడన్
కార్యముల నిర్వహింతురు
పర్యాలోచనముఁజేసి పరిపరి నియతిన్ 87

తలపెట్టిన పనిమధ్యను
నిలిపినచో నట్టివారినిందింతురు కా
దె - లలిన్ నెరవేర్చిన దా
మలరుచు మన్నింతు రతని నందఱుఁ బ్రేమన్ 88

చోరుఁడెంత ప్రమాదియో మేరమీఱు
నాస్తికుఁడుకూడ నంతియే - కస్తికలుగు
నతనియెదుట కూర్చుండిన వెతలుతప్ప
వనుచులేచెను రాముఁడాసనము వీడి 89

కన్నుల విస్ఫులింగముల గ్రక్కుచురాల్చుచు నిల్చియున్న నా
ప్రోన్నతుఁగాంచుచున్ గులపురోధసుఁడైన వసిష్ఠమౌని చే
సన్నలనాఁపిరాముని ప్రసన్నుని సేయగ మాటలాడగన్
మన్ననఁజేసెనాతఁడు నమస్కృతితో వినయమ్ముఁజూపుచున్ 90

పక్కమనినవ్వి జాబాలి పలికె నిట్లు
'నాయనా! రామచంద్ర! నేనాస్తికుఁడనె
నాస్తికుఁడనైనఁ దపముల నవయు టేల?
నీమనసుపట్టిచూచితి నేమికాదు! 91

అందుపై రామభద్రుని యాననమున
హాసచంద్రిక లలమ మహర్షిఁగాంచి
వినయవినమిత గాత్రుఁడై విహితుఁడగుచు
మ్రొక్కె చేతులు జోడించి మునివరునకు 92

తెలివిడింజేయు ధర్మోపదేశము గని
క్రొత్తగాఁజూచె రామచంద్రుని వసిష్ఠ
మౌని యాశ్చర్యపడుచు సంభావ్యుఁడనుచు
రామమానసధర్మసుస్థేమ మెంచి 93

శ్రీవసిష్ఠుఁడు రామునిఁజేరి పలికె
'ఓ చిరంజీవి ! జాబాలి యుక్తముండె
నీవు శంకింపఁబనిలేదు నిస్తులుండు
నినుఁబరీక్షింప నతఁడు యత్నించెనంతె ! 94

ఇక్ష్వాకువంశమందెప్పుడు జ్యేష్ఠుండె
ప్రభువౌట పరిపాటి - భరతుఁడెపుడు
రాజు కానేరడు - తేజస్వివగు నీవె
దశరథభూపు సంతానమందు
పెద్దవాఁడౌదువు - పిన్నవాఁడెట్టుల
రాజ్యార్హుఁడౌనని పూజ్యుఁడైన
జాబాలి వచియించె సమ్మతి నిచ్చెద
వేమొయంచును దాననేమిలేదు !

నాయనా ! ధర్మమిద్ది సనాతనమ్ము
పుడమిలో పురుషునకు మువ్వురు గురువులు
తల్లిదండ్రు లాచార్యుండు - తండ్రి నేఁడు
లేఁడు మిగిలిన యిర్వురి లిప్సయిదియె 95

కాననంబుల కంపిన కైక వచ్చె
భరతుఁడును వచ్చెనయ్య ! నీ భావమింక
మార్చుకొనుమని చెప్పి సమ్మతిని గొనగఁ
గోరుచుంటిమి శ్రీరామ ! కోవిదుఁడవు 96

వృద్ధికాముఁడవనియు, వివేకివనియు
సకలభూతానుకంపన సరసహృదయు
నిగను భావింతురెల్లరు నీరజాక్ష !
వారిప్రార్థన మన్నింపవలెను సుమ్ము 97

రఘురాముఁడంత గౌరవమున గురుని వీ
క్షించి వినమ్రుఁడై చెప్పె నిటుల
ప్రథమగురుండైన ప్రభువేమొ దివికేఁగె
నతని ఋణంబీఁగనగును నాకు
నడవికేఁగుమటంచు నాతఁడు శాసించె
బద్ధుంగ దానికి భయము దాఁట
నాసాహసముసేయ నలవికా దాకార
ణమున వెన్కకు రాగన్యాయమగునె ?

సత్యకాముని ధర్మదీక్షకుఁదలంకి
రెల్లరును మానసంబులనెంతొ మెచ్చి
కొనిరి గత్యంతరములేక యనఘునకును
భరతుఁడంతట సాష్టాంగపడుచు మ్రొక్కె 98

అంతట వసిష్ఠుఁడెంతయొ
స్వాంతమ్మున మెచ్చి రామచంద్రుని ఘనతన్
చెంతకుఁజేరుచు జానకి
కాంతునిలో నిట్టులనియె కారుణ్యముతో 99

రామా ! నేనాచార్యుఁడ
క్షేమమ్మొనరింతు వంశకీర్తిని బెంపన్
నామాటలు కాదనరా
దామోదముఁ దెల్పి వెన్కకరుగుదమయ్యా ! 100

నాహితవును పాటించిన
నేహైన్యముఁ రాదు నిత్య మినకుల ప్రగతిన్
నేహేరాళముగా నెంచెద
నాహితలక్షణుఁడ వీవు వ్యాజము కలదే 101

భరతుఁడు మంచివాఁడు పరిపాలనఁ జేయుమటంచు నిన్నుఁదా
పరిపరి వేడెడిన్ పరమభాగవతోత్తముఁడౌను దీన నే
దురితము నీకునంటదు ప్రతున్నమగున్ హృదయమ్ము కాదనన్
విఱుగును చిత్త మాతఁడు పవిత్రుఁడు - కూరిమిఁ జూపన్యాయమౌ ! 102

కర్తవ్యమ్ము నెఱుంగఁ జెప్ప మునిలోకస్తుత్యు వీక్షించి యి
ట్లార్తింబల్కె రఘూద్వహుండు 'గురుదేవా ! రాముధర్మజ్ఞతన్
గుర్తింపంగను నీకసాధ్యమగునే గుంజాటనం జేసినన్
హర్తంగావుటకేను మొగ్గుదునె ? నిందంబొంద వాంఛింతునే 103

ఎఱిఁగి, యెఱిఁగి యెట్టులీరీతి వచియింతు
రేమిచెప్ప వాఁడనింక నేను
పరుని సొమ్ముకొఱకు ప్రాకృతునవలె ధర్మ
మార్గ ముజ్జగించు మానవుఁడనె? 104

నేను చేసికొన్న నిర్ణయమావంత
మార్చుకొనగ నుంత మనసు లేదు
భ్రాంతిలేదు నన్ను బలవంతమును జేసి
నైష్ఠికమ్ముఁ జెఱుప న్యాయమగునె? 105

జానకీజాని హృదయసంస్కారబలము
నర్థముంజేసికొనుచు వైయర్థ్యమనుచు
నూరకుండిరెల్లరును - సహోదరుండు
భరతునియెడంద నగ్నిపర్వతము పగిలె 106

ప్రత్యుపవేళము భరతుండు నేయంగ
దర్భల పఱపించె ధరణి నతఁడు
వెనుకకు రాముండు చనుదెంచు వఱకేను
నిచ్చటనేయుందు - నిచటినుండి
కదలను రామునియెదుటనే మరణింతు
నన్నపానమ్ముల నంటకుండ
నిర్ధనుండగు ధరణీసురుండట్టు లీ
పర్ణశాలను నేలఁ బవ్వళింతు

ననుచు నుపవిష్టుఁడైన తమ్ముని గనుగొని
రామచంద్రుఁడు వాకొనె 'రాజధర్మ
మిద్దికాదయ్య! ద్విజధర్మమిది - యయోధ్య
కేఁగి రాజ్యము పాలింపఁ దృప్తిపడుదు' 107

అంతటిమొగముల భరతుఁడు
కుందుచుఁ బరికింప వారుకూడను శిరముల్
పొందికగా నూఁపగ తన
సందియమునువీడి యతఁడు సరగునలేచెన్ 108

పౌరులఁ గనుగొని భరతుఁడు
మీరెవ్వరు పలుకకట్టి మిన్నులుచూడన్
సారాచారులు వేరికి
నేరిమి, కూరిమియులేదొ? నేయముకాదో? 109

అనవిని పౌరులు చెప్పిరి
'అనఘా! మీభ్రాతృధర్మ మమలమగుఁగదా!
జనకాజ్ఞావశి యాతఁడు
వెనుకకుఁ జనుదెంచుటనిన వేదనకాదే? 110

అందులకే వెనుకాడితి
మందలి పరమార్థ మిప్పుడర్థముకాగా
నందము, చందములెఱిఁగితి
మిందనుక నెఱుంగమైతి మీవత్సలతన్ 111

అడుగుట మంచిదె ? రాముని
నుడువులలో ధర్మముండె నోరాడకయే
మిడుకుచునుంటిమి ప్రతినను
విడువుమనినవీడు వాఁడెవిధ్యుక్తకృతిన్ 112

మానోత్కు కట్టువడినవి
జ్ఞానోదయమయ్యెమాకు సారప్రజ్ఞం
దేనోదూరుఁడు పలుకగ
భూనాధుని యాజ్ఞమిన్న పోవనటన్నన్ ॥

భరతుఁడు వివశుండయ్యెను
నెరపెద పిత్రాజ్ఞ వనుల నిల్చెదనేనే
పురికరిగి వేగనాకొక
సరణింజూపింప జన్మ సార్థకమగుగా । ॥

రఘురాముం డభిమానపూర్వకముగా రంజిల్లుచున్ బల్కె "నే
యఘముంజేయగ సాహసింపను సుమీ । న్యాయాధ్వమందేఁగెదన్
లఘువై పోయెద రాజలోకమున నాలాయమ్ముకాదెంతొ నిం
దఘటిల్లున్ గద । నీతిఁదప్పుటయెకాదా । నేను తోతెంచినన్ ।

ప్రత్యామ్నాయపథమ్మునందరుగ ధర్మంబౌనె శక్తుండనై
నీత్యాగమ్మను స్వార్థబుద్ధిగణియింతే ? చెప్పుమా ! లోకమం
దత్యాచారమటంచునవ్వెదరు కాదా ! లౌకిక జ్ఞాను లీ
సత్యంబున్ గమనింపగా వలయుఁద్రాసంబందనేనెమ్మెయిన్ ।

ధర్మాతిక్రమణమ్మున
కర్మస్థిరుదైనవాఁడు కఱకఱపొందున్
దుర్మంత్రమనుచు నెంచెద
దుర్మదుఁడని లోకమెంచి దూఱదె నన్నున్ ।

ఎవ్వరిబాధ్యత వారిదె !
నెవ్వగ నందంగనేల నీవిపుడాత్మన్?
నివ్వటిలు దుర్యశంబిఁక
నొవ్వను గల్గింప నెవరి నూల్కొను కడకన్ 118

ఇఁకమాతాడకపొమ్మయోధ్యకును నీవీవేళనిర్భీతమై
చకితంబున్ బొనరింపవీలుపడ దాశాబంధముల్ కోసితిన్
సకలోర్వీతలరాజ్యభారము భుజస్కంధమ్ములంబూనుమా !
వికసింపన్ రఘువంశగౌరవము సంవిస్మార్గ సంభూతిమై 119

ఒకపదునాలుగేండ్లెకద - ఓపికపట్టుము వచ్చి నీదు కో
రిక నెఱవేర్చెదన్ గనుక తేనిగనుండుము కొంతకాల మూ
రక ననురక్తితో తిరిగి రమ్మన న్యాయమె వెన్కకేఁగి, యొ
ద్దికమెయి నాకు మాఱుగఁ బ్రతీక్షల రాజ్యభరమ్ము నూనుమా ! 120

రానేవచ్చెద నెల్లకాలమిట నిల్వంబోదునే కానలన్
నీ నామధ్యను భేదముల్ కలవె ? తండ్రిన్ సత్యసంధుండుగా
వైనత్యమ్మన జేయవీలగును సంభావింప మేలయ్యెడిన్
లీనంబయ్యెను నామనంబు ననుకూలింపగనేఁగోరెదన్ 121

ఈ మధుర సన్నివేశము
లామోదముఁగూర్పఁ బ్రజలకాదర్శముగా
శ్రీమన్మంగళకరమై
ప్రాముఖ్యమునెరపె జగతి భ్రాతృత్వమునన్ 122

ఈ పుడమి పునీతమై యింపుమిగిలె
నీ పవిత్ర సంఘటనతో నేపు మీఱె
ధర్మనిష్ఠితమైన వాదముల వినిరి
తన్మయత్వమునంది తత్రత్యులెల్ల 123

అన్నదమ్ముల ప్రేమలు నచటనున్న
మౌని వరులకు కథలుగాకానిపించె
వారి సంభాషణము విని వారిఁగనిన
దశరథుఁడు ధన్యుఁడంచును దలఁచిరంత 124

ఆదశగ్రీవు దునుమాడునంతవఱకు
రామచంద్రుఁడు తిరిగిపోరాదు పురికి
వారు భరతుని వారించి పలికి రిటుల
'ననుసరింపుము రామువాక్యముల' ననుచు 125

ఆ మాటలను విన్నరాముండు నమ్రుఁడై
మునివరులను గాంచి మ్రొక్కి నిలువ
నాశీర్వదించుచు నరిగి రచ్చోటు వాసి -
గత్యంతరములేక కనులనీరు
చిప్పిలుచుండ 'రాశీభూతకారుణ్య !
నీకు ధర్మముఁజెప్పనేరను గద !
ప్రియముసేయుచుఁబ్రజాభీష్టంబు మన్నించి
యుక్తమేదియొ దానినొనరుపంగ

విమలమతి వ్రాల రాము పాదములపైని
కరఁగుచును లేవనెత్తుచుఁగౌఁగిలించి
యనునయించుచు గాత్రమ్ము నట్టెనిమిరి
తలఁకుచు వచించె నెంతో గాద్గద్యమొదవ 126

కాంతి చంద్రునివీడి కదలిపోవచ్చును
నేలపై చుక్కలు రాలవచ్చు
హిమగిరీంద్రము తాను హిమము వీడగవచ్చు
ప్రొద్దు పడమటిదెసఁ బొడమవచ్చు
కదలి తా చెలియలికట్టదాఁటగవచ్చు
పిడుగులు పుడమిపై పడగవచ్చు
విలయమ్ము జగతిని వెలపింపగావచ్చు
కులశైలములు కూడ క్రుంగవచ్చు
జరుపుదును తండ్రి మాటకు తిరుగులేదు
సవితృకులమున కనృతదోషమ్ము రాదు
నావలన — వెన్కకేఁగగ న్యాయమగునె ?
వేఁడెటులొ ప్రజయు నన్నెై చరించుఁగాదె ! 127

ౕలేక గోగణము గగ్గులకాడయి బిట్టు వందురున్
ఫుఁడులేని రాజ్యమున బొందుదు రాపద పౌరు లార్తితో
ౕడి మూఁకలెల్లెడలఁ ద్రుంగుడు సేయును-శాంతియుండ దీ
ముఁబొందనేల ? రఘువంశము దుర్యశ మందరాదుగా ! 128

శల్యార్థమ్ముగఁ బ్రాణముల్ విడిచె వత్యుండౌచు భూమీశుఁడం
చల్కంబూను ప్రజావళిందనుపుమయ్యా ! సర్వముం దెల్ప నీ
పల్కుల్ భావము నిస్తులమ్ములని కోపంబూనకావంతయున్
ముల్కుల్ వోలెడు భాషణమ్ములను మిమ్ముందూఱరేమాత్రమున్ 129

శౌర్యధనుఁడు శత్రుఘ్నుని సాయముండ
వీర్యవంతుఁడ వీవుసంప్రీతి ధరణి
నేలఁజాలుదువీశంకలేల భరత !
నన్నుబలె నిన్నుఁ బ్రేమించి యెన్నుఁ బ్రజ 130

ఇప్పటికే జాగయ్యెను
చెప్పకు మేసాకు పురికిచేరి నిరూఢిన్
నెప్పుకొనఁ బృథివినేలుము
గొప్పతనము తెమ్ము ప్రజలకున్ హితవరివై 131

నాయాశీర్వాదము నీ
కేయెడలను ధైర్యమొసఁగు నీఁకసాగు మయో
ధ్యాయానతత్పరుఁడవై
ఆయుష్మంతా ! విరక్తినందగమేలా ! 132

నలినీపత్రాక్షమ్ముల
నిలిచిన బాష్పములఁదుడిచె నినుపారఁగృపన్
జిలుకుచు భరతుని రాముం
డలరించుచుఁ జింతయుడిపి యాప్యాయితుఁడై 133

భరతుండూఉటనంది రాముదెస సర్వాంగీణసౌహార్దమున్
నెరపంజూచుచు నమ్రుండై పలికె నేనే రాజు నెట్లౌదు నీ
ధరణిన్ బాలనసేయు నా కృతి విరుద్ధంబంచు దూషింపరే
కరుణాసాగర ! నాదుప్రార్థనము నాకర్ణించినండెప్పెదన్ 134

అంతరజ్ఞుండు రాము నేత్రాంచలముల
మిలమిలలు గోచరించె - విస్మేరవదనుఁ
డనుమతి నొసంగె సోదరు నవధరింప
పరమభక్తివచించె పూర్వజున కతఁడు 135

వ్యక్తముఁ జేసెద నామది
యుక్తముగా నాకుఁదోఁచు ద్యుమణికులమునన్
శక్తులును, శక్తిమంతులు
భుక్తముగానేలి రవనిఁబ్రోన్నతులగుచున్ 136

నీకుఁబ్రతినిధిగా మెలంగెదనుగాని
రాజుగానుండనోప నారాధయితగ
వెళ్లఁబుచ్చెద మంత్రులు, విబుధవరులు
శౌర్యవంతుఁడు తమ్ముఁడు సాయపడగ 137

నీ సాన్నిధ్యము నందునన్ మెలఁగుచున్ నిత్యంబు సౌమిత్రి యెం
తో సాయమ్మును జేయు నీకు వనులన్-దూరమ్ముగా నుండుటన్
నీ సౌహార్దములేకయే మసలితిన్ నిశ్చింతగా-మూర్ఖుఁడన్
దాసుండై తిన నీకృపాగరిమ పొందన్ వీలుకల్గున్‌కదా ! 138

కష్టపడు లక్ష్మణుండె యదృష్టశాలి
నేను సుఖభోగములతోడ నీకు దూర
మైతి-నౌకరిగాంచిన నవ్వ చేత మలర
వేఁబొకరిఁజూడ నిరసించు విధికృతమిది 139

నిష్కామ సేవతో నీయెడ భక్తితో
సౌమిత్రి చరియించు సన్నిహితము
గా నాకు రాజ్యకాంక్షయొకింత లేకయె
కాంక్షాపరుండుగ కానిపించు
దురదృష్ట మబ్బెను-వరముల మాతల్లి
జనకుని గోరంగ - పనవుచుంటి
నా యపవాద మనాకారమయ్యెను
జంబాలమునఁ జిక్కిచపలురీతి

తప్పు చేసిన దోషిగా తలఁకవలసె
నింద నెత్తిపై పడియెను-నీకు, నాకు
సామ్యమున్నదె-నీదు రాజ్యమ్మునీవు
తీసికొనవేని రాజప్రతినిధినగుదు. 140

ఆర్య ! భవన్నియుక్తి కెదురాడుటలుండునె ? నిత్యమున్ శిరో
ధార్యముకాదె ? యౌరసుఁడు తప్ప తదన్యుఁడు భూపుఁడైనచో
పర్యవసానమెయ్యది ? విపర్యమున్ గొనతెచ్చికొంటయే
కార్యముఁ జక్కదిద్ద నవకాశ మొసంగిన విన్నవించెదన్ 141

ఎంతగ వేఁడినన్ వెనుకకేఁగుట కిష్టముఁజూప నట్టి నీ
వెంతటి త్యాగమూర్తివో ? మఱెంతటి ధర్మపథానువర్తివో !
చింతనకందదెవ్వరికి - శీలము నిర్మలమౌచుఁగ్రాలు నా
స్వాంతము బెగ్గడిల్లు-ఋజువై ఖరి ప్రస్తుతి పాత్రమౌనుగా! 142

మమ్ములవీడి రాజ్యమును మాటకు బద్ధుఁడవై తృణంబుగా
నెమ్మదినెంచి కాననమునే వరియించుచు ధర్మమార్గ మం
దిమ్ముగనేఁగు నిన్గనిన నెట్టియెడంద ద్రవించు నార్తితో
తమ్ముని రాజ్యమేలుమని తత్పరతన్ వచియింతువే ప్రభూ ! 143

చెప్పగనేల నీయెడల చేయక చేసిన పాపమిద్ది నే
నెప్పగిదిన్ నృపుండనయి హ్రీరహితుండుగ నుండ గల్గుదున్
చెప్పిరి సర్వులున్ బురికిఁ జేరుమటంచును-దానికొప్పకే
చెప్పినమాట చెప్పెదవు శీలము శ్రీకరమంచుఁ జాటుచున్ 144

మానవలోకోద్ధరణము
దానవ సంహారకాండ ధర్మమ్ములుగా
పూనికతో జన్మించిన
మానవ దైవతమురీతి మన్నింతు మొగిన్ 145

ఈ మూలంగల పాదుకాద్వయమునం దీవుంచుమీ పాదముల్
శ్రీమంతంబగు సర్వరాజ్యమునకున్ శ్రేయమ్ములం గూర్చెడిన్
నీమార్గమ్మున ముందు కేఁగుటకు సాన్నిధ్యమ్ము గల్గించుచున్
క్షేమోల్లాసము లిచ్చిప్రోచు నియతిన్ స్వీకార మీయంగదే 146

రామా ! క్రమ్మఱ రావయోధ్య కిపుడే రాజ్యంబుఁబాలింపగా
హేమాలంకృత పాదుకాద్వితయమీవే ? సింహాపీఠంబునన్
బాముస్ ధన్యముఁజేసికొంటకయి నిల్పింబూనితిన్ నీకుగా
ప్రేమాంభోనిధి ! నాపయింగరుణ వర్షింపగఁ బ్రార్థించెదన్ 147

నందిగ్రామనివాసినై నిలుతునన్నా ! నీపదధ్యానమా
నందంబుం గలిగింప మౌనివలె స్వాంతమ్మెల్ల లగ్నమ్ముగా
మందాక్షమ్మున నీదురాకకయిరామా ! వేచియుందున్ సుమీ!
సందేహమ్మను వీడి పాదుకల వాత్సల్యమ్ముతో నీఁగదే 148

క్షేమంబియ్యది యెల్లవారికిని సాకేతమ్మునందుండగా
బాముస్సైప నశక్యమౌ జనకుడుం బంచత్వముం బొందె నీ
వేమో దీక్షగ ఘోరకాననము లందే యుండఁగాంక్షింపగా
నేముండెన్ నగరంబు పాడువడె స్వామీ! నిల్వలేనచ్చటన్ 149

పేచియుండెదను జటాచీరధరుఁడనై
కందమూలమ్ములె గ్రాసమగును
నందిగ్రామమునందు నుందు సింగపుఁబీఁట
నీదివ్యపాదుకల్ నిలిపి రాజ్య
పాలనంబొనరింతు ప్రతినిధిగా నీకు
పదినాలుగేడుల వఱకె రామ !
ఒడలె కన్నులు కాగ నోపికతో నుందు
నెట్టులో నీకోస మెదురు చూతు

నందు పై నొక్కక్షణమైన నాఁగలేను
గడువుదాఁటిన నగ్నిలోఁబడుదు నిదియె
పరిగణింపుము కడమాటవలె మహాత్మ !
అగ్రజా ! నన్ను మన్నించి యరుగుదెమ్మ 150

ఆమోదించుచు భరతుని
ప్రేమకు భక్తికిని బులకరించుచుఁ బెలుచన్
రాముండొసఁగెను పాదుక
లామెతఁ బెట్టంగ భరతుఁడానందింపన్ 151

భరతునకు గల్గు నావేశబలము, తక్క
జనుల సంకల్పబలమున సవదరించి
పురికొనుచు, నేకమౌచు, నిముడ్చుకొనుచుఁ
గ్రమ్మయత్నించె రాము మేఘమ్ము పగిది 152

రామచంద్రుని ధర్మాభిరతిపవనము
చెదరఁగొట్టగఁజాలె వారిదమునటుల
లొంగిపోలేదు వారిప్రలోభమునకు
స్థిరముగా నిల్చె హేమభూధరము మాడ్కి 153

గెలుపోటము లెవ్వరివో
పలుకుట కష్టమ్ము రామభరతులలోనన్
కలదిర్వురిలో విజయము
గెలిచెను ధర్మమ్ము పుడమికిన్ సుఖదముగా 154

పురజనులు, ఋషులు, వేల్పులు
పరవశులై వినిరి వాదివాదము, ధర్మ
స్థిరతయు రాముని త్యాగము
భరతుని ప్రేమమ్ము, భక్తిభావముఁగనుచున్ 155

ముదమును, దుఃఖము వారల
మదిలోపల నిల్చిపోయె మాన్యుల ప్రేమల్
చెదరని భక్తిప్రపత్తులు
ప్రిదులని ధైర్యమ్ముఁ గాంచి వెఱఁగొంది రొగిన్ 156

తిగుట భరతుఁడు మరల ప్రాధేయపడుచు
తలను వంచి నమస్కృతి సలిపి వేఁడె
దాసుని ననుగ్రహింపుము- ధన్యుఁడగుదు
నాకృతజ్ఞత లర్పింతు బ్రాకటముగ 157

ఇది చిత్రముగాఁ దోఁచెను
సదయుడు రామునకు భరతు సంప్రార్థనమం
దిది తుది యత్నంబంచును
మదినాఁటగఁబలికె మంచి మాటలతోడన్ 158

ఉపదేశావృత్తికినై
నుపదేశకుఁడెట్లు జరుపు నుపదర్శనమున్
గృపతో తత్ప్రక్రియ భరతుఁడు
నపేక్ష్యముగ జరిపెఁబ్రార్థనావృత్తి వెసన్ 159

మునుల నేమయ్యె తఱుగని మమతనీది
అవగతంబయ్యె నీహృదయమ్ము నాకు
తేలిపోయె సమస్య మఁదే కదయ్య!
తిరుగఁదోడగ న్యాయమ్ము తెలుఁగె చెపుమ! 160

ఏదియు పుట్టియున్నదిపుడేమి యనర్థమురాదు దీనికై
వాదములాడి ధర్మమును వంచనసేయఁగ లాభమెద్ది? యిం
కేదియుఁజెప్పఁబూనక వహింపుము రాజ్యభరమ్ము నాకుగా
నాదియయెట్లు రాజ్యరమ-నాకొఱకై సహియింపు మన్నియున్ 161

సానుక్రోశుఁడు రాఘవేంద్రుడు సమాశ్వాసించుచున్ దమ్మునిన్
మేనెల్లం దమకమ్ముతో నిమురుచున్ మీప్రేమకున్ ధన్యుఁడన్
దానీయమ్మగ నాకొసంగెదె యయోధ్యారాజ్యమున్ - తాళుమా!
నేనేవచ్చి పరిగ్రహించెదను కానీ నేఁడు రాజాలుదే! 162

పౌరుల, మౌనుల గాంచుచు
శ్రీరాముఁడు పల్కెనార్ద్రచిత్తము తోడన్
'నారాకఁగోరి కొండల
దారింబడి వచ్చితిరి కృతజ్ఞుఁడనెంతో 163

నాయెడల మీకుఁగలిగిన
నీయభిమానమ్ము విలువ యెంతటిదగునో
ఆయతముగ నేనెఱుఁగుదు
ధ్యేయము వీడంగనంత తేలికయౌనే? 164

జనకుని సంపాద్యమునకు
తనయుఁడె యౌరసుఁడు నిజము తండ్రి వచనముల్
తనకేమి చెప్పకున్నను
తనయుని బాధ్యతలు పోవు - తప్పవు నెరపన్ 165

ముగ్గొయ్యి రాజ్యపాలన
మగ్గలమౌనంచుఁ దలఁచి యదరుచునుండెన్
సగ్గిస ముగ్గిసలగునని
తగ్గెను భరతుండు భక్తి తత్పరుఁడగుటన్ 166

నేనొక దైవకార్యమును నిర్వహణమ్మొనరింపవచ్చితిన్
కాననసీమకిట్లు సహకారము నేయుడు నాప్రయత్నమున్
మానితమై విరాజిలగ మాన్యులు నాయెడఁ జూపుప్రేమయే
పూనికతోడఁ దమ్మునకుఁ బొల్పెసలారగనీయవేఁడెదన్ 167

ఏసౌజన్యము నాయెడంగలిగి మీరిచ్చోటి కేతెంచిరో
ఏ సౌహార్దము భానువంశమున కీరెంతేని చూపింతురో
ఆ సౌజన్యము, సౌహృదమ్ము వినయం బర్థింతు నాతమ్ముఁడున్
వాసించున్ రవివంశభూషణుఁడుగా ప్రఖ్యాతి నార్జించుచున్ 168

మతిమంతుఁడు రాజగుటకు
సుతరాం దానొప్పుకొనక సుతిమెత్తగనే
ప్రతిమాలగఁ దుదకెట్టులొ
ప్రతినిధిగానుందుననుచు ప్రతిభాషించెన్ 169

అస్తుంకారముఁ జూపితి
ప్రస్తుతమున కీతెఱంగు ప్రగ్రహమగుచున్
క స్తిం బాపగ నెడఁదను
నస్తోకముగాగ తలఁచితానందమునన్ 170

తృప్తింగాంచిరి పౌరముఖ్యులును సందేహమ్ములన్ వీడుచున్,
సప్తాశ్వాన్వయన్యాయ దృక్పథముఁ బ్రస్తావించుచున్ మెచ్చుచున్
దీప్తింబొందు మఱింతగా నీఁకను సాధిష్ఠంబు, సంపన్నమై
ప్రాప్తించెన్ దగు నాయకుండిపుడు భద్రంబుల్ పిసాళింపగా 171

భరతుఁడు పాదుకల్ వినయ భావముతోడ గ్రహించెనంత సో
దరుఁడును, దల్లులున్, గురువు, తక్కుజనుల్ పురికేఁగఁ బోవగా
ధరణిజ భక్తినత్తల పదంబులనంటి నమస్కరింపగన్
సరగున లేవనెత్తుచును జానకిఁగౌఁగిట గ్రుచ్చిరందఱున్ 172

పూడిన గొంతుక నశ్రువు
లోడికలై కనులవెంట నూఱక జాఱన్
గోడున గౌసల్యాసతి
కోడలి గుండెలకు హత్తుకొని యిట్లనియెన్ 173

చెదరు గుండెల దుఃఖించు సీతచీర
చెఱగు నోటను గ్రుక్కుచు చెంతనిలువ
నత్త కౌసల్యచూచి యాప్యాయనముగ
కడుపుచెఱువౌచు నూరార్పఁగడగె నామె 174

అమ్మా! మైదిలి! యెంతచిక్కితి వసూర్యంపశ్యవౌ నీవు సా
ధ్వమ్మా! కొండల, కోనలన్ దిరుగ నాత్రం బందుచున్ వచ్చి పా
దమ్ముల్ పొక్క పరిక్రమింపగ పరీతాపంబు గల్గించెడిన్
కొమ్మా! యెంతటి సాధ్వికెంతగనొ సిల్గుల్ వచ్చె దూపిల్లగన్ 175

ఇంతులలో మేల్బంతివి
కాంతా! నీవంటి సతిని గాంచగనౌనా?
చింత నెఱుంగవు నాథుని
చెంతను నుండంగ వనులఁ జేరితివికదే! 176

నిన్నొక బిడ్డవోలె ధరణీపతి యెంతొ ప్రియంబుఁ జేసెఁ దా
నెన్నడు వేఱుగాఁ దలపనెంచగలేదు విదేహరాజనన్
ప్రన్ననగౌరవించు రఘువంశయశమ్మును నిల్ప రామునిన్
నిన్నుగణించె నెమ్మదిని నిర్మలభావముతో చరించుటన్ 177

చిలుకయు గోరువంకలటుఁ జెల్వొసలారగఁజూచి భూపుఁడే
పలుకును జెప్పలేక కులపాలిక! మూర్ఛగమయ్యె-రామునిన్
వెలలము దుర్గమాటవికివేదనఁ బొందుమటంచుఁ జెప్పెనే
కలికియె మిమ్ముఁబంపె తిరుగన్ గొనిపోవగవచ్చెఁ గానకున్ 178

కొడుకుగఁ బుట్టెను రాముఁడు
నడవడిలో మేలుదారి నయముగ జూపెన్
కొడుకునకుఁ దండ్రికిం గల
విడువని బంధమ్ముఁ దెలిపి విశ్రుతికెక్కెన్ 179

నా భాగ్యము పండెనుసుమి!
సౌభాగ్యవతీ! కుమారుసన్నిధి నిలువం
గా భద్రము లొనగూడును
స్వాభావ్యముగా! జయమ్ముఁ బడయుడు మీరల్ 180

"సీతారాముల నిద్దఱ
మాతయు, జనకుండువోలె మన్నింపుము, నీ
వీ తల్లి దీవెనల గొను
మీ! తనయా!" యనుచు నాసుమిత్ర వచించెన్ 181

రాముని, లక్ష్మణు, జానకిఁ
బ్రేమనుగను గొంచుఁ గైక ప్రీణనమొసఁగన్
వేమరు నాశాసించెను
క్షేమమ్మును, జయము, బలము, శివముఁ గలుంగన్ 182

కైకంజూచి నమస్కరించి పలికెన్ కన్నాకు రాముండిటుల్
నాకార్యమ్ములఁజక్కపెట్టగను స్వాంతంబందు దాక్షిణ్యమున్
నాకై పూనుచు లోకనింద నవమానంబున్ ధృతిన్ మార్కొనన్
నీకేచెల్లును దేవకార్యమును సంధింపంగనీరీతిగన్ 183

ఈ సహకారమున్ మఱువనెప్పుడు చిన్నతనంబు నుండియున్
పీసరలేదు నాకు శరవిద్యల నెన్నియొ కన్నబిడ్డగా
వేసటలేక నేర్పితివి వేల్పుల కామన మేర కివ్విధిన్
త్రాసములేకొనర్చితివి రాముఁడు నీకు కృతజ్ఞుఁడెప్పుడున్ 184

ఈతలపెట్టిన కార్యము
భీతినిబొందకయొజేసి వేల్పులు తనియన్
చేతఃప్రీతిగ నసుర
వ్రాతముదండించి జగము రక్షింతునొగిన్ 185

ఇది నీయాశీర్వచనము
ముదముననసాగుదును ముందు ముందునకమ్మా!
అదవదనొందెడి లోకము
కుదురుకొనంజేతు శాంతిఁగూర్చెదవిధిగా 186

మరలనొకసారి మ్రొక్కిన
సరళహృదయు రాముఁగాంచి సంతోషముతో
తరళాక్షికైక దీవెన
లరిందమున కొసఁగెఁబ్రేమ, నార్ద్రిత మివులన్ 187

సాదరమేదురమ్ములగు సాంత్వనవాక్యములాడితమ్ములన్
వాదములాడరాదని నివారణఁజేయుచు మాతృమూర్తులన్
గాదిలిమాటలన్ దనిపి గౌరవ మొప్ప వసిష్ఠవామదే
వాదులకాదృతిన్ బదములంటి నమస్కృతిఁజేసె రాముఁడున్ 188

నెచ్చెలియౌనిషాదుఁడును, నెయ్యుఁడు భూసురుఁడా సుయజ్ఞుఁడున్
బచ్చెనబొమ్మలై నిలువ వారినిఁగౌఁగిటఁజేర్చి మీరలున్
వచ్చిరి నన్నుఁజూచుటకు - వచ్చెదనంటిఁప్రవాసకాలమం
దిచ్చటనిల్చెదన్ గడవునించుకఁదప్పను సాగిపొండనెన్ 189

"రామా ! వీడ్కోలునువాఁడనంచుఁ బలుకన్ భ్రాతన్ ప్రసన్నుండుగా
ప్రేమంగౌఁగిటఁజేర్చి 'తల్లియెడలన్ ప్రీతిన్ ప్రదర్శింపుమా !
ఈమాటల్ వినకున్న సీతపయినొట్టే ! అర్థమయ్యేంగదా
వేమారున్ వచియింపనేమిటికి సంవిన్మార్గమందేఁగుమా ! 190

ఇంకపోయిరమ్మ ! హితవుపాటింపుము
భానువంశమన్న, భరతుఁడన్న
నెమ్మిలోకమెల్ల నీరాజనంబిచ్చు
ననుచుఁబలుక భరతుఁడనియె నిటుల 191

"అచ్చికబుచ్చిక నుందును
మచ్చికయే తోఁచుఁగాదె మనమధ్యను-నీ
వచ్చుట కొఱకుఁబ్రతీక్షల
నచ్చట నిల్చెదను - రావ - అగ్నింజొత్తున్" 192

అంతట బోయగుహుండును
స్వాంతమున విచారపడుచు వచియించెఁ"ప్రవా
సాంతమున వచ్చెదవుగా !
ఇంతకు రాకుండవలవదే హేతువునన్" 193

కదలిన చిత్తము తోడను
నదవదపడి నాసుయజ్ఞుఁడనెనిట్టుల 'నే
నిదెపోవుచుంటి నీకై
యెదురుగఁబరికింతునెంతొ యీప్సితమతినై' 194

తప్పకవచ్చెదన్ గుహుఁడ ! తాలిమితోడఁ ప్రతీక్ష సేయుమీ !
చెప్పినరీతిగా నెపుడు చేయుదు నన్యము సేయనెప్పుడున్
గొప్పలుచెప్పనేమియగుఁగూరిమితో నెఱవేర్తునన్నియున్
చప్పుడు లేక జీవితము సాగునటంచు వచించెరాముఁడున్ 195

అనఘుడు జానకీరమణుడాదృతి వారల తోడఁబల్కుచున్
వినయము మీఱఁదల్లులను వీడ్కొలిపెన్ గనులందు బాష్పముల్
తొనఁకుచు గండముల్ తడుప లోనికి తొయ్యలితోడనేఁగ రో
దనములవించు దృశ్యము విదారణమున్ బొనరింప గుండెలన్ 196

భరతుఁడు పాదుకల్ శిరముపైనిడుకొంచు రథమ్మునెక్కె, భూ
తిరమున కందఱుకున్ వెసఁ ప్రదక్షిణముం బొనరించి భక్తితో
ధరిగి యయోధ్యమార్గమునఁ దేకువబట్టిరి-రాము ధర్మమున్
మఱిమఱి మానసంబులను మన్ననజేసిరి సానుదృష్టిమై 197

భ్రాతృజనమున కాదర్శపాత్రమైన
పరమరమణీయదృశ్యమై పరిఢవిల్లె
నీజగతిఁ బునీతముఁజేయు భ్రాజితమగు
మధురతరసన్నివేశమై మహిని నిలిచె 198

సహృదయ హృదయాబ్జములను జలదరింపఁ
జేయు సరససమాగమశ్రీరహించె
మానవుల దేవతలుగాగ మలచు దివ్య .
శక్తిపాత ముత్కృష్టతాచారిమమ్ము 199

# చ తు ర్థా శ్వా స ము

స్తిమితప్రస్ఫుటమానసాంబురుహుఁడై చేరెన్ భరద్వాజు నా
శ్రమవాటిన్ భరతుండు మౌనిగని సాష్టాంగమ్ముగా మ్రొక్కి సాం
తముగా సర్వవిశేషముల్ తెలుప నాతండంత సచ్ఛీల వృ
త్తము లిక్ష్వాకుల సొత్తటంచుఁ బలికెన్ దార్కాణముల్ చూపుచున్ 1

మఱియు వచియించె నా మౌనివరుఁడు ప్రేమ
మరణ మొందియు దశరథ ధరణిజాని
మరణ మొందనివాఁడె - ధర్మపథమందు
నరుగు సత్పుత్త్రులం గాంచినందువలన 2

బుద్ధిమదగ్రగణ్యులగు పుత్త్రుల నల్వురఁగాంచె భూమిపుం
డిద్ధమనస్కుఁడై సురలకిష్టసఖుండుగ నిల్చె దైత్యులన్
యుద్ధములందునోంచెఁదనయుల్ తలపింతురు తండ్రినట్టులే
బద్ధులు ధర్మమార్గమున భండనభీములు, నీతివిత్తముల్ 3

ధన్యుఁడు దశరథభూపతి
ధన్యులు మీరందఱతని తనయులగుటచే
వన్యాసీమలనుండగ
మాన్యుడు కాంక్షించె జనకుమాట నిలుపగన్ 4

దీవెనలనంది భరతుఁడు పోవఁ దలఁచి
మౌనికిఁ బ్రదక్షిణించి నమస్కరించి
ముందునకు నేఁగె గంగానదిందరించి
శృంగిబేర పురమ్మును జేరె నతఁడు

సరసహృదయుఁడు గుహుఁడు నిషాదరాజు
కైకతనయుని ప్రేమను గౌఁగిలించి
వీడుకోలుపగ భరతుఁడు విహితహృదిని
కదలిపోయె సాకేత మార్గమునుబట్టి

అతివేగమ్మనబోవు స్యందనముపై నారూఢుడై దూరమం
దతఁడీక్షింప నయోధ్యనొక్కపరి వీక్ష్యస్ఫూర్తి దీపించుచున్
ప్రతనంబైన పురమ్ము కాంతితఱుగన్ బ్రాప్తింప నైరాశ్యమున్
శతిఁగాన్పింప సుమంత్రునింగనుచు వక్కాణించె నిర్విణ్ణుఁడై

తాతా ! కాంచితివే ? సా
కేతమ్మున నెంతమార్పు ? కీడ్పడుఁగాదే !
సీతావల్లభుఁ డీపురి
నీతెఱఁగున విడిచి యడవికేఁగుట వలనన్ 8

రాజగును రామచంద్రుఁడు
తేజము హెచ్చించుననుచుఁ దేకువనిలువన్
సాజము విఘ్నము వాటిల
నోజస్వంతుండు వనులనుండగ వగవన్ 9

చేరిరి వారయోధ్యను విశీర్ణమునందిన చిత్తవృత్తితో
నూరను క్షుద్రజంతువులె యూరకనట్టిటుఁబర్వులెత్తుచున్
ఘోరముగా గనంబడగ గ్రుడ్డులనీటిని గ్రుక్కుకొంచు ని
స్సారముగావచించెను విశాలపథమ్ములఁగాంచి వేదనన్ 10

రాముఁడులేఁడు - పోయెను ధరారమణుండును పౌరులందఱున్
క్షేమముఁ గోరుకొంచడవికిన్ మనవెంటనువచ్చిరాదటన్
రామునిపైనిగల్గుననురాగము మిక్కుటమైచెలంగ నిం
కేమియులేక ప్రోలు కనిపించుచునుండె శ్మశానమట్టులన్ 11

రామవియోగము రాయిడిపెట్టంగ
విన్నదనమ్ముతో వికలమగుచు
రాహువుమ్రింగిన రాకాసుధాకరు
నీక్షించి పొగులు రోహిణివిధముగ
ఆతపతప్తకృశాంగియై ఝషపక్షి
విరహితంబైనట్టి గిరినదివలె
దావాగ్నిదగ్ధమై తీవఁగోల్పోయిన
ఫలపుష్పశోభితవనమురీతి

యాజకులు విడిచిపోయిన యజ్ఞవేది
పోలె, మణులుతొలగిన ముత్యాలసరము
భాతి, జలదసంఛన్ననభమ్మువగిది
కానిపించునయోధ్య నాకన్నుఁగవకు 12

విపులాపణమ్ములు వెలవెలఁబోవుచు
సంక్షిప్తములు నేఁడు జనులులేక
నిఖిల సౌధమ్ములు నిశ్శబ్దముగనుండె
నృత్యసంగీతముల్ నిలిచిపోవ
దిక్కుమొగమ్ములై దిగులుతో గోవులు
పరుగులుతీయు గోపకులులేక
శృంగాటకమ్ములఁ జేరి వినోదపుమాఁ
టరికింపరుత్సాహ పరులు కాక

ధూపితాగురువాసనల్ తోఁచవెచట
వారుణీమదగంధముల్ పర్వఁబోవు
సురభిళములైన మాల్యముల్ చూడఁబోరు
వెగటు పుట్టెను ప్రజలకు వగపుమిగుల

రాజమార్గమునంబోవు రథమునందు
భరతుఁడిట్లు వాపోవుచు దరిసె నంతి
పురము - రాజపత్నులఁజేర్చి పొక్కెనన్న,
తండ్రిలేనట్టి శూన్యసౌధములగనుచు

రామచంద్రునితో పాటు రాజ్యలక్ష్మి
తేజము, కాంతియు వెన్నంటి కదలిపోయె
పొడగనంగను గన్నులు పొడుచుకొనిన
కానరానట్టి కటికచీఁకటిని నింపి

మనసు, మనసున నిలువ కామాన్యుఁ డపుడు
భాస్కరుఁడు లేనిదినముగాఁ బరిగణించె
నంతరంగమునందంత నలము కొనియె
చిమ్మచీఁకటి - కన్నీరె కనులనిండ 16

రాముని విరహము నంది
గ్రామము నందనుభవింపగానెంచె నతం
డామాన్యుఁడు లేకుండెను
వ్యామోహము లేదయోధ్యపై భరతునకున్ 17

దినరాజాన్వయభూషణుండపుడు నందిగ్రామమందుండగా
తనసంకల్పమటంచు పెద్దల కయోధ్యన్ నిల్వ సాధ్యంబు కా
దని ధైర్యమ్మొటనున్నఁ జాలదని శూన్యంబైన శుద్ధాంతమం
దున వాసమ్మొనరింపఁ గష్టమని య స్తుంకారమున్ గోరగన్ 18

గురువు, వసిష్ఠుఁడు, మంత్రులు
భరతుని నిశ్చయమువిని, యవారణ మగుటన్
సరగున సమ్మతి నొసఁగిరి
చెరచెర రథమేఁగుదెంచి చెంతను నిలిచెన్ 19

మాతలందఱి కతఁడు నమస్కరించి
యనుజుఁడును, మంత్రివర్యులు ననుసరింపఁ
గులపురోహితులన్ వెంటఁగొనుచు నతఁడు
రథము నధిరోహణముఁ జేసె రథసముగను 20

శిరమున్ దాల్చెను రామపాదుకల రాశీభూతనై భృత్యమై
స్థిరచిత్తమ్మున కైకనందనుఁడు నందిగ్రామముంజేరి. బం
ధుర ప్రేమన్ ప్రకటించుచున్ నిలిపె నందున్ సింహపీఠమ్ముపై
పరమానందముతోడ సర్వజనులాప్యాయమ్ముగాఁ జూడగన్ 21

పరమభాగవతుఁడు భరతుని భక్తికి
నెల్లప్రజలు మెచ్చి రినకులమ్ము
ధర్మతత్పరతకు దగ్గఱి చుట్టమై
సార్వకాలికముగ నుర్వి నిలువ 22

రామచంద్రుని ధర్మానురక్తి, త్యాగ
ప్రాభవంబున కోసల రాజ్యలక్ష్మి
శిరమునుంచెఁ బాదుకలపైఁ - మురిసిపోయె
నతని హృదయానుషంగనిధ్యానమెంచి 23

జలద గంభీరరవముతోఁ బలికె భరతుఁ
డచటఁజేరిన పెద్దల కంజలించి
కనులనీరోడికలు కట్టి గండయుగము
స్విన్నమొనరింప గుండెలు చెదరుచుండ 24

"ఇవ్వి శ్రీరామపాదుక లింకమీద
ప్రతినిధులు రాను నకు - నెంతో ప్రార్థనమ్ము
నలుప వెనుకకురమ్మని సమ్మతించె
కడకు నీపద్ధతికి - సహకారమిందు. 25

నాకేమో మదినిల్వఁబోవదచటన్ మాంగళ్యశూన్యమ్ముగా
కీకారణ్యము వోలెఁగన్పడగ సాకేతమ్ము - చిట్టాడుచున్
ఘూకంబుల్ చెరలాడ నెల్లెడల వాకోజాల కాదుస్థితిన్
వైకల్యమ్మది నిండిపోవనెడఁదన్ పంకించుచున్ వచ్చితిన్ 26

"నేను సచేతనంబైన రఘూద్వహు
పాదుక" నని చేసె పాదుకలకు
పట్టాభిషేకమ్ము - పట్టెను ఛత్రమ్ము
మునివృత్తి జీవితమ్మును గడపగ
"వ్రతదీక్షతో జటావల్కలధారినై
కందమూలమ్ములె గ్రాసములుగ
రామునిరాక పర్యంతము రాజ్యవృ
త్తాంతముల్ పాదుకాద్వయము కెఱుక

పఱచి ప్రతినిధిగా రాజ్యపాలనమ్ము
సలుపుదునటంచుఁ దెల్పగ సంతసమున
ప్రజలు జయపెట్టి భరతుని భ్రాతృభక్తి
వినయవర్తనమున్ మెచ్చి వెడలిరంత 27

చిత్తమున రామచంద్రుని శీలమెపుడు
భరతునకు మార్గదర్శియై వరలుచుండ
నందఱి సమస్యలకుఁగూడ నర్హరీతి
సరసమైన పరిష్కారసరణి వెలసె 28

పాదుకల భద్రపీఠమ్ముపైననుంచి
ప్రతినిధిగ పాలనముసేయు భావమొక్క-
భరతునకుఁదప్ప నొరుల కేకరణిదోఁచు
సాధ్యమయ్యె నిరీహుండు, సరసుఁడగుట

తాను సన్న్యాసవ్రతమును బూని రామ
పాదుకా ప్రభావమ్మునే భరతుఁడాశ్ర
యించె నాయన్నదమ్ముల మంచితనము
ధర్మనిష్ఠను మెచ్చిరి ధరణిజనులు

తనయుపజ్ఞా బలమ్మున ధరణిరామ
పాదుకాప్రభావమ్మును బాదుకొలిపి
నిటుసమారూఢమొనరించెఁ బటుతరముగ
భక్తవరులలో నిల్చె మేల్బంతియగుచు

* * * *

కొన్నిదినమ్ములు జరిగెను
ప్రసన్ననగా చిత్రకూట పర్వతసీమన్
కన్నాకు రామచంద్రుం
డన్నకొనన్ బత్నితోడ ననుజుని తోడన్

ఒత్తుగపెరిగిన పచ్చిక
బిత్తరిచూపులను మేయ వేగిరపడచు
వ్వెత్తుగ పరుగిడు లేళ్లను
చిత్తమ్ములలాగ సంతసింతురు చూడన్

ఆ గిరిరామణీయకము ప్లోదముఁ గూర్పగఁ బుష్పగంధముల్
సాగెడి మందమారుత విసర్పితముల్ పరిగొంచు నాసలన్
లోఁగొని సోఁడుముట్ట వనిలోఁ జరియించుచుఁ దృప్తితో మహా
భాగుఁడు కాలమున్ గడపె భార్యనుగూడి విలక్షణుండుగా 34

గెంటని ప్రేమతోడ కలికిందనియింపగ నుత్సహించుచున్
వెంటనుదోడుకొంచు సరవిన్ గిరిచుట్టు వయాళి పోవుచున్
జంటగ కౌతుకంబెనయ జాహ్నవిలో జలకంబులాడుచున్
పంటవలంతి యల్లుడు కృపాణవు జానకిఁదేర్చె రక్తిమై 35

రామావరజుఁడు వేటల
నామిషముం గొంచువచ్చి సడవికిఁ జనుచున్
భూమిజ వండును మిగిలిన
యామిషమును నెండబెట్టు నాశ్రమసీమన్ 36

ఒకనాఁడు రఘురాముఁ డువిదతో వనవిహా
రముఁజేసి యలసి శిరమ్ము సీత
తొడపైనిఁ జేరిచి బడలిక వాయంగ
నిదురించుచుండంగ నీరజాక్షి
పాలిండ్ల నొకకాకి పలుగాకి ముక్కుతో
పలుమఱు పొడుచుచు బాధపెట్ట
రామచంద్రునకు నిద్రాభంగమౌనంచు
కదలక, మెదలక కనుల నీరు



17

నించుకొంచును బెదరింప నించుకైన
భయమునందక బలిభుక్కు పైనివ్రాలి
గాయమొనరింప రుధిరమ్ము కాఱి చీర
తడిసిపోవగఁబతి త్రుళ్లిపడుచు లేచె 3

హేతువు నెఱుఁగక రాముఁడు
'సీతా ! రక్తము స్రవించు- చీరతడిసె నీ
ఘాతుకమున కొడిగట్టిన
చేతనుఁడెవ్వండో తెలియఁజెప్పు' మటన్నన్ 3

నొగులు తోడ నామెనోటనేమాటయు
రాకసన్నఁజూపె కాకిఁ బతికి
రక్తసిక్తపయోధరమ్ముల నుత్తరీ
యాంచలముల నొత్తె ననఘు డంత 3

అదలింపన్ రఘురాముఁడాకరటమున్ హస్తంబుతో సుంతయున్
బెదరంబోవక, లెక్కసేయక మఱిన్ పీడించు చచ్చోటుఁ బా
యదు- భూపుత్త్రికపాటుఁ గాంచి క్రుధతో నాకాకముంగాంచి, య
య్యది సాధారణవాయసంబొ ? యిఁక మాయాకాకమో తేలకే 4

ఎంత ధైర్యము దీనికి ? చెంతనున్న
పతిని లక్ష్యమ్ము సేయ దీవాయసమ్ము
దీనిసంగతి నిప్పుడే తేల్చివైతు
నిదిగొయని గడ్డిపోఁచ మంత్రించి విడిచె 41

పాకారి సూనుండు బ్రహ్మచే వరములఁ
        బడసి యదిష్టరూపమ్ముఁ దాల్చి
గర్వమ్ము మిక్కిల నుర్విజ నూరక
        వేధింప యత్నించె విభుడుచెంతఁ
గల్గ నలక్ష్యమ్ముగాఁ బ్రవర్తింపగ
        నభిమంత్రితతృణంబె యాశుగమయి
వెనువెంట తఱుమంగ భీతి నాబలిభుక్కు
        శరణువేఁడెను ధాత చరణమంటి

ఎల్లసంగతులాకాక మెఱుకపరుప
నలువ భయమంది రామబాణమ్ము నిలుప
తనకు సాధ్యము కాదని తరలుమనుచు
కసరికొట్టెను ధ్వాంక్షమున్ కమలభవుఁడు 42

మరలమరలను బ్రార్థించు కరటముఁగని
కమలజుఁడుపల్కె కన్నుల కావరమున
నెంత ఘోరమ్ముఁ జేసితి వవనిజకును
నిన్ను క్షమియింపరాదు పొమ్మన్న కాకి 43

క్షీరసాగరశయను దర్శింప నేఁగె
కాని దర్శనమేకాక కాకి భవుని
శరణు వేఁడగ కైలాస శైలమునకు
చని నివేదించె సర్వమ్ము శర్వునకును 44

అంతయు విని శంకరుఁడనె
నెంతపనిం జేసినాఁడ వీసమయము నం
దెంతగఁ బ్రార్థించిన నీ
భ్రాంతియగుంగాని సాయపడరెవరునుమీ ।

రాముండే నీయీ పో
రామిందప్పింపనోపు - రాఘవువేడం
గా మేలగు మఱియెవ్వరు
నీమీఁదం గరుణఁ జూపనేరరుసుమ్మా ।

ఏమని తలఁచితి వాతఁడు
సామాన్యుఁడుకాడు దుష్టసంకల్పముతో
భూమిజ వేధించితి వా
స్వామియె నినురక్షసేయఁ జాలును బొమ్మా।

నీ దర్పమె నిన్నడఁచెను
పాదమ్ములపైని వ్రాలి ప్రార్థించినచో
కాదనడు రాఘవేంద్రుఁడు
సాదరమున నిన్నుగాఁచు చయ్యనఁ జనుమా 4

కరటంబంతటఁ గ్రక్కునన్ గదలె నాకాశంబునన్ - బాణమున్
మరలన్ వెంటనుబోఁదొడంగె నెటకల్ మాడంగ నిస్సత్తువన్
గిరికిన్ గ్రమ్మఱ వచ్చిరామునకు మ్రొక్కెన్ భక్తిపూర్వంబుగా
చరణాబ్జమ్ముల వ్రాలి" నాయెడల దోషంబోర్చి మన్నింపుమా । 4

రామా ! నీప్రతిభా విశేషములె చేరన్ సాగె మున్ముందుగా
నీముల్లోకములందు నీయెడల నెంతే గౌరవంబుండెగా
సామాన్యుండను, దృష్టుడన్ దెలివి లేశంబైన లేకుండఁనో
స్వామీ ! భూమిజ నొవ్వఁజేసితిని కాపాడంగఁ బ్రార్థించెదన్

నీ శక్తినాకు తెలిసెను
నా శక్తియునుడిగె నిపుడు నా స్వాంతమునన్
నీ శంసనమే నిండెను
నాశంబగుచుంటి నింక ననుఁ గావఁగదే !

ననురక్షింపుము నాయెడ
ననుకంపం బూని, యులిపినై కాకుఁదనం
బొనరించి భంగపడితిని
పునీతుఁడవు ప్రాణభయము పోగొట్టుమయా !

ద్యావాపృథువుల మధ్యను
నీవంటి మహానుభావునేఁ జూడఁగదే
పావనచరితా ప్రాణము
గావుము ! సైరించి తప్పుగా నెంచకయే

అన కరుణాసముద్రుఁడగు నా రఘురాముఁడుపల్కెఁ గాకమున్
గని యనుతాపమొందు నినుఁ గాటియఁబెట్టను నీదుప్రాణముల్
కొనదు మదీయమార్గణము కోరును కొండొక యంగ-మూరకే
చనదుసుమీ ! వచింపుమెటు సమ్మతి నిచ్చిన నట్లు చేయుదున్

కాకము హర్షమునందుచు
శోకము విడనాడి రామ ! చూపితివి దయన్
చేకొనుము నా కృతజ్ఞత
లాకూతిని దెల్పువాఁడ ననఘా ! నీకున్

ఈ నా నయనంబులనొక
దానింగొననిచ్చగింతు - ధన్యుఁడనగుదున్
పోనిమ్ము రామబాణము
నా నేత్రమునుండి, కాఁచి నా ప్రాణములన్ 5

రాముని యాజ్ఞమేరకు బాణ మాధ్వాంక్ష
నేత్రముంజొచ్చెను - నీరజాక్షుఁ
డావాయసమ్మున కక్షిమానముగ నేక
దృష్టినొసంగె - నేదెసకుఁజూడ
నా కన్నె కనిపించు నంతియే - యేకాక్షి
యైన ఫలమ్ము సర్వాంగములను
నయనమ్ము ముఖ్యమ్మునైక విధమ్ముల
జీవికకోసమై దేవుకొనగ

పూర్తిగా రెండుఁబోయిన నార్తి కలుగు
నల్పజీవికటంచు నా యనఘుఁడెంచి
కరుణఁజూపెను వాయస గణము లకిది
వరముగా భాసిలంగఁ బ్రపంచమందు 57

తల్లి ! జానకి ! కితవుడ - తప్పుగాంచి
నన్ను మన్నింపుమమ్మ ! నీ వెన్నవంటి
మనసుతో - వందనమ్ములు మాన్యులకని
తెలిపి, స్తుతియించి కరట మెందేనిచనియె 58

జరిగెను కొంతకాలము ప్రశాంతముగా నటనున్న మౌనులం
దరగలితోఁచె భూధరమునందు వసింపగ నిచ్ఛగింపకే
చెరచెర వీడుయత్నములు చేయుచునున్నటు కానిపింపగా
సరసిజనేత్రుఁడాకడఁక సొంతమెఱుంగఁదలంచె నాస్థతో 59

బొమముడిపాటుతో మునులు భూరిభుజున్ గను గొన్న తోడనే
విమలిమ లేక తప్పుకొన వేఱిమిఁజూపుచుఁబ్రక్కకేఁగు చే
సమయమునందు నాశ్రమము చాయలకుంజను దేరబోవరీ
క్రమమును జూచి రాఘవుఁడు కాఱియనంచె హృదంతరమ్మునన్ 60

మునిపత్ను లవనిజంగని
మునుపటివలె పల్కరించిపోవరు - మందా
కినికిన్ జలములఁగొనితేఁ
జనినప్పుడు దూరమునకుఁజనెద రదేమో ! 61

పర్ణశాలకు కూడను వారు రారు
తప్పుఁజేసినరీతిగా తలఁకుచుందు
రేమిహేతువో తెలియక యింతి పొగిలె
నేదొ వెలివేసినట్టుల నేఁగుచుండ 62

ఎందులకు నింతయలజడి పొందువారు ?
దూరదూరమ్ములకుఁబోవుదురు విరుద్ధ
మీ ప్రవర్తన మంచు భావించి రాముఁ
డపుడు కులపతిఁబ్రశ్నించె నంతరమ్ము (

దోసమ్మేదియొ గల్గెనే ? తెలుపరే ? ద్రోగ్ధన్యుడంగాను మీ
కోసమ్మేమియొనర్పు మన్నసది చేకూర్పంగ సిద్ధంబెగా !
నాసాన్నిధ్యము మౌనులందఱికి హైన్యంబౌనె ? నన్గాంచినన్
వాసింజాపుచుఁబ్రక్కప్రక్కలకుఁబోవన్ హేతువుంజెప్పుడీ ! (

తమ్ముఁడెపుడైన చేసెనే తప్పు ? సీత
స్త్రీకులోచిత ధర్మమ్ము సాఁకలేదె ?
ఏవిధమ్మగు దోషమ్ములెవరివలన
గలుగు - సెలవిండు స్వామి ! నా కలఁతబాఁప 6

పరమవృద్ధుఁడు కులపతి బదులుపలికె
నెలుఁగు రాల్పడ రామునికివ్విధముగ
ధరణిపుత్రిక సీతమ్మ పరమసాధ్వి
మునులయెడ నామెసడవడి పొల్పు మీఱు ! 6(

రఘురామ ! నీవును, లక్ష్మణుండెప్పుడు
దొసఁగులఁజేయంగఁబొసఁగదయ్య !
క్షమకు తావలమైన జానకీదర్శనం
బమలంబు, పావనంబగుచు చెలఁగు

చిత్రకూటాద్రిపై చేరిన మీ వార్త
అందినరాక్షసులిందుఁజేరి
యజ్ఞయాగమ్ముల నసురలు రక్తమ్ము
పలలమ్ముఁగురియుచుఁబాడుచేసి
జపతపమ్ములనుండిన జటివరులను
బాధలను పెట్టుచుండిరి; వారి హింస
తప్పుటకు మౌనులాశ్రమాంతరము నకును
తఱలిపోవగనుండిరి ధన్యచరిత ! 67

లంకాధిపతియైనరావణుతమ్ముండు
ఖరుఁడను బురుషాదుఁడరుగుఁదెంచె
పరమసాహసి, గుండెబలముఁ గల్గినవాఁడు
బహుపరాక్రమశాలి, పాపవృత్తి
యేవాని మనసు - నీ కెవ్విధంబుననైన
హాని నేయగనెంచె నాశ్రమమున
నీవు చేరినదాది నీ పట్ల భక్తితో
మెలఁగు మా పాటులు మిక్కిలంగ
విసిగి, వేసారి యీగిరి విడిచి యెచటి
కేని పోయిన బాధలు, హింసలుండ
వనుచుఁ దలపోసి నీతోడననెడి ధైర్య
మింతయునులేక ప్రక్కలకేఁగుచుండ్రి 68

మేమీగిరికూటమ్మున
క్షేమమ్మొక్కింతలేక చీకాకులతో
మామాతపముల మానుచు
నేమాడ్కి వసింతు మిచట ? నేఁగెదమెటకేన్ 69

తృణకాష్ఠజల సమృద్ధిగ
మునిజనముల కాలవాలముగనుండెడి తా
వున కేఁగ నిశ్చయించితి
మనఘా ! మాగణముతోడ నరుగగవలసెన్ 70

అనివచియింపదాశరధి 'యట్టులనా ! యిది మీరు చెప్పరే ?
దనుజులఁబాఱఁద్రోలగను దర్పమడంపగఁ జాలనేనదా
టునని టు పోవన్యాయమె ? పటుత్వము, శౌర్యముఁగల్గు మేము మీ
మునులకు రక్షణమ్మొసఁగి మోదమునందగఁజేయఁజాలమే 71

భయమూనందగ పనిలేదు భండనమున
దైత్యులందెగటార్తు మధైర్యపడక
యిచటనే నిల్వుడంచు బ్రార్థించిరాముఁ
డిచ్చె నభయము - కులపతి మెచ్చ కనియెఁ 72

ఎక్కడ మీరలు ? దానవు
లెక్కడ ? పోల్చియింపనగునె ?, యేర్పడ, మాకీ
యిక్కట్లు తప్పటోపి
ఋక్కుల నిలువంగనౌనె యిఁకపైరామా ! 73

మొక్కలులు వారు పైగా
లెక్కకు మిక్కిలిగనుండ లేదవకాశం
ఒక్కడ వారిని గెల్వగ
మక్కువ నీకున్నగాని మాకెటులొప్పున్ 74

వికృతరూపములతో వేధించుచుండుట
సందుగొందులదాఁగి చంపుటయును
నశుచిద్రవ్యమ్ముల నాశ్రమమ్ములఁజిల్కి
స్రుగ్భాండములను ద్రచ్చుటయు, హోమ
కుండమ్ములార్పుట, కుండలతోరక్త
మాంసముల్ కురియుట, మాతపముల
విఘ్నమ్ము సేయుట, విపినమ్ములకు ఫల
మూలమ్ములకుఁబోవు మునుల బట్టి

యదలుచుట, నిత్యకృత్యమ్ములై చెలంగ
ఖరుఁడు సేయుచునున్న నాగడములిన్ని
యన్నియని చెప్పలేను మహాత్మ ! దూర
మేఁగి జీవింతు మెటనేని - అఁగమిచట 75

బ్రతికిన బలుసాకైనను
గతుకుచుఁ బ్రాణములనిల్పఁగలుగుదు మెటులో
హితమునువిని సీతమ్మని
సతినింగొనిపొమ్ము వేఱు స్థానమ్మునకున్ 76

నీవు కళత్రముతోనిట
నేవిధి నిల్చెదవు - ఖరుఁడు హింసలు పెట్టున్
పోవుచునుంటిమి మీరే
తావునకుంజనిన శాంతి దక్కును మీకున్ 77

ఎంత సమర్థుఁడవయ్యును
కాంతసమీపమున నిల్వఁగల్గుదువే య
శ్రాంతము ? శ్రేయముకాదీ
ప్రాంతము విడువంగఁదగును రఘుకులతిలకా ! 78

తాను కోదండపాణియై దానవులను
చెండనోపు సమర్థుండె ! తాపసులకు
తనపలుకులందు విశ్వాసమును వెలార్చ
పొలకువలు లేక రాముండు నిలిచెనటులె 79

రాగలయనర్థముల, ను
ద్వేగముతోఁదెలియఁజెప్పు వృద్ధతపస్విన్
సాగెడి మహర్షులంగని
సాగిలఁబడి, సాగనంపె సాలోచనుఁడై 80

ఆతపస్విగణము లాతావువీడిన
నాటినుండియుఁగూడ మేటి యాత్ర
మంబుననేనిల్చె నంబుజాక్షికిసాయ
ముగ-కష్టమయ్యెను భూధరమున

సెక్కడ, నేకార్య, మెవరు కావించిరో
        తెలియరాకుండెను-తెలుపరెవరు
ఫలమూలములను సంపాదింపఁనరిగిన
        తమ్ముండు నెట్టి వార్తలనెఱుంగ

కూరకేవచ్చు - చెప్పెడి వారులేక
అంతవఱకును దాను వాహ్యాళివెడల
నప్పుడప్పుడొంటిగఁబోవ నయ్యెగాని
యిప్పుడది సాగఁబోవదీ తప్పువలన 81

వేదఘోషల తోడ వీనుల విందుగా
        కలకలలాడు నాశ్రమధరమ్ము
నిర్జనసీమయై నిశ్శబ్దముగనుండి
        క్షణములు యుగములై గడచుచుండె
భరతుఁడిచ్చోటికే తిరిగి తోడ్కొనిపోవ
        నరుదెంచె నాతని కొఱకుఁదల్లు
లును, బౌరులును, మంత్రులును, సైన్యములు వచ్చి
        రాదృతి-రానన్న నటమటించి

రిచ్చునె తండ్రి మృతివార్త నెఱిఁగెనతఁడు
వదలెనిచ్చటనే నివాపమ్ము తండ్రి
కిచటనే, యిచ్చటనె తన కిన్ని స్మృతులు
తఱుకుమంచును హృదయమ్ముఁగలఁచివైచు 82

హయహస్తి కరీషమ్ముల
నాయారమును గోలుపోయి, యొద్దిక చెడగా
భయపంబై కనుపట్టెను
వియాతమగు ధరాధరము వెక్కసమగుచున్ 83

రామునకు శాంతిలేక నాశ్రమము వీడఁ
దలఁచి పయనమ్ము సాగించె తరుణి, తమ్ముఁ
డనుసరింపగ నత్రిమహర్షి యాశ్ర
మ మును జేరిరి దర్శింప నమలమతులు. 84

అత్రియును ననసూయ పవిత్ర చరిత
లాలుమగలు, తపోధనులాత్మవిదులు
రామచంద్రుని రాకకై ప్రేమమూర్తు
లాశ్రమమున ప్రతీక్షింతు రాత్రముగను 85

నీరేజాక్షుఁడు, తమ్ముఁడున్, సతియు మౌనింగాంచి మ్రొక్కంగ పెం
పారన్ వారల సత్కరించి ' కుశలంబా ! యంచు ప్రశ్నించుచున్
తారాపీడుని తంద్రి నేత్రముల జ్యోత్స్నామాలికల్ తోపగన్
ధీరోదాత్తుఁడు రాఘవేంద్రునకు నాతిథ్యమ్ము నిచ్చెన్ దగన్ 86

ఎన్ని దినమ్ముల నుండియొ
నిన్నుం జూడంగఁ దలఁచి నేనున్ సతియున్
కన్నులు కాయలు కాయగ
నున్నామిట - వచ్చినార లోరిమినిటకున్ 87

సకలమ్ము నెఱుఁగ కల్గితి
వికలమనస్కతను వింటి-వేదన గలిగెన్
ప్రకటించిన నీ నిర్ణయ
మకుతోభయుఁడనుచు చాటె ననఘా! నిన్నున్ 88

నీ కర్తవ్యము నిర్వహించితివి తండ్రీ। చూపి,శాలీనతన్
లోకమ్మెల్ల విధేయతన్ మెలఁగుచెట్లో నేఁటి నీవర్తనన్
సాకల్యంబుగ గుర్తెఱుంగ గలిగెన్ సాదృశ్యమ్ముల్ కల్గునే
శ్రీకల్యాణపథమ్ము మెట్టితివి రాశీభూతసౌజన్యమై 89

అమ్మా! జానకి। చూచియుండ వనసూయన్ మున్ను తానుండె, ధ్యా
నమ్మందున్ - ముదివగ్గు - వచ్చు సమయంబాయెన్ సతీలోకర
త్నమ్మంచున్ వచియించి యామె యెడ పైనత్యమ్ముఁ జూపించుచున్
నెమ్మింగొల్చు తపస్వినీ గణము లున్నిద్రమ్ములై నిత్యమున్ 90

రామా। నీసతి ధర్మచారిణియగున్ శ్రావ్యంబు తద్వర్తనం
బామెన్ నిల్పుము కొంతకాల మనసూయాదేవి శుశ్రూషలో
ప్రామాణ్యమ్ము లవెన్నియో తెలియు ధర్మజ్ఞత్వముం బెంపుగా
లేమన్‌దీరిచి దిద్దునామె తనపేర్మిన్ ప్రాపణీయమ్ముగా। 91

లోకపుజాడ నేయెడ విలోకనముం బొనరించు నుత్తమ
శ్లోకుఁడవీవు - చేరవు ప్రలోభము లేమియు నిన్ను - ధర్మమే
శ్రీకరమంచు చిత్తసరసీరుహమందు సతమ్ము నిల్పి య
శ్లోకముగా చెలంగెదవు దోషము వర్తన మాస్థ ముఖ్యమౌ 92

చూడుము వచ్చుచుండె ననసూయను పుణ్యచరిత్ర!మిమ్ముల౯
చూడగ కొంతకాలముగ చూపులగుమ్మము నందెనిల్చుచు౯
వేడియవేచియుండె - గమనింపుము రాకనెఱింగి తొందర౯
వేడుక పిచ్చలింప సరవి౯ జనుదెంచుచు నుండె రాఘవా ! 93

పెద్దకాలము - దృష్టిలోపించె కొంత
ముగ్గుబుట్టయ్యె తలకట్టు-ముడుతలుపడె
దేహమెల్లయు-నడకలో తీరులేదు
నుదుట కుంకుమబొట్టుతో ముదుకవచ్చె 95

అత్రి పత్నినిగాంచి తా ననియె నిటుల
మనమెదురు చూచు చుట్టముల్ మడఁతివచ్చి
నారు చూడుము దశరథ నందనులను
ధరణిజాతను - జన్మమ్ము ధన్యమగును 95

రామచంద్రుఁడితఁడు లక్ష్మణుఁడాతండు
సీతయీమె జనకనేత దుహిత
పావనమ్ములయ్యె పర్ణశాలలు నేఁటి
వీరి రాకతోడ సౌరు మిగిలి 96

అనసూయకు నా ముగ్గురు
వినయముతో తలలువంచి విశ్వాసమున౯
వినతులొనర్పగ నామెయు
ఘనుతించెను వారి ధర్మవిమలిమ నెంతో 97

మునివరుఁడు రామభద్రుని
కనసూయంజూపి పలికె 'నామెతపశ్శా
లిని, పావని, వృద్ధతప
స్విని యెంతో మాన్యచరిత వినిపింతుకథల్ 98

పదివేలేండ్లు మహాతపస్సనొనరింపంజాలె నాసక్తి నీ
ముదుకంజూడుము కొండకోనలను బాగుల్ పొందుచున్, ధన్యమై
కుదురన్ జీవిత మంతరంగమున పేఁగున్ లోకకల్యాణమున్
బొదలింపన్ దమకమ్ముఁజూపు ఫలితంబుల్ వేలుగానుంచుచా । 99

మున్నొకప్పుడు క్షామమ్ముముంచె ధరణి
నందుపదివత్సరమ్ములు - నిండుకొనియె
కందమూలఫలమ్ములు గ్రాసమునకు
మును లవస్థలఁ బడగ రాము స్ఫురబడి 100

మందాకిని నిర్జలమై
వందురగా మౌనిగణము, ప్రజలును దానీ
చిందఱ వందఱ మాన్పెను
తొందరఁ బూరించెజలముతోజాహ్నవినిన్ 101

ఎండెతటాకముల్ తరుపులెల్లను పచ్చదనమ్ము వీడుచున్
మొండిగనిల్చిపోయె - పశువుల్ తినగడ్డియు. గాదమేమితే
కుండగ నుస్సురంచు పడియుండె జనావళి కుక్షినిండగా
తిండికిలేక బెండుపడె దేశము సర్వము సంగలార్చెదిన్ 102

తనతపశ్శక్తితో సీమె దాటఁజేసె
గడ్డు దినముల దుర్భిక్షకాలమందు
జపతపమ్ములు సాగెను జటివరులకు
లభ్యమయ్యెను కందమూలములుం, పండ్లు

పంటలుంబండె ప్రజలకు భాగ్యమొదవె
తినగతిండియు, త్రాగ నీరునులభింప
శోకమును మాన్పెనీయనసూయయనుచుఁ
ప్రేమఁబిల్చిరి-సార్థకనామధేయ

త్రిదశులు కోర నొకప్పుడు
పదిరాత్రుల నొక్కనిశగ భాసిలఁజేయన్
పదిలముగ నిర్వహించెను
పదింబదిగశక్తిఁ జూపి పత్నిముదమునన్

విశ్వశ్రేయముఁ గోరుచు
శశ్వత్కీర్తిని గడించె సంకల్పమునన్
విశ్వాసమ్మున నొనరిచె
విశ్వజనీనముగ సుకృతి వివిధోపకృతుల్

రాముండంతధరాకుమారి నుపచారంబుల్ పొనర్పంగ, గా
రాముంజూపుచు నత్రిపత్నికడఁజేరంబంచె నాసీతయున్
శ్రీమన్మంగళదాయి, నార్యకను, పెర్మిన్దా ఁబదాంభోజముల్
ప్రేమన్ భక్తిస్పృశించి వందనము గావించెన్ వినమ్రమ్ముగా

చరణములంటిన సీతను
కరములతో లేవనెత్తి కౌఁగిటఁబట్టెన్
పరమ పతివ్రతవగుదువు
తరణికులము ధన్యమయ్యెతరుణీ ! నీచే 108

నాయుటజంబునకేఁగెద
మోయువిదా ! రమ్మటంచు నుగ్మలిఁ గొనుచున్
ప్రోయాలు సీతఁదోడ్కొని
పోయెంబరమాదరమ్ము పొలుపారుహృదిన్ 109

ధరణిజ వచ్చిన విషయము
నెఱిఁగిన మునిపత్ను లచటి కేతెంచిరొగిన్
పరివేష్టించిరి వారల
పరితోషించుచును ప్రేమభావముతనరన్ 110

వినయవతియు, పతివ్రత, విదుషియయిన
[illegible]
[illegible] మునికాంతలందఱికిని
పరిచయము చేయ సన్మానింపఁబడియెనామె 111

గారముతో ననసూయయు
కారుణ్యముఁజూపి సూటిగా పెలయించెన్
నేరిమితో, కూరిమితో
ధారణిపుత్త్రికి పతివ్రతాధర్మమ్ముల్ 112

నీవును ధర్మచారిణివి నిచ్చలు ధర్మము మానవాళికిన్
జీవితమై వెలుంగవలె చెప్పగనేలను స్త్రీకి నాథుడే
సేవధియై రహించు సరసీరుహలోచన! భర్తయే సుమీ
దైవము-ధార్మికుండయిన దర్పముఁజూపినట్టిలోకవృత్తిలో 113

నగరస్థుండో వనస్థుఁడో ధవుఁడు, సన్మార్గుండో, దుర్మార్గుఁడో
వగపుంగూర్చునో, సౌఖ్యమిచ్చునో, కృపావారాశియో, ఘాతుకుం
డగునో చూడక నాతి నిత్య మతనిన్ సానందయై వెంటనం
టగస్వాస్థ్యమ్మను, బుణ్యలోకముల పంటల్ పండుసాధిష్ఠమై 114

భార్యకు భర్తయే పరమ బంధువు-మన్నన సేయ నెంతొ యై
శ్వర్యము లభ్యమౌ మనసు శాంతిని బొంద తపస్సు పండు నీ
చర్యకు తప్పి సాగిన నృశంస్యము -ధర్మము భ్రంశమై చనున్
ధైర్యము స్థైర్యమున్ వలయుఁదాలిమితో చరియింపగావలెన్ 115

ఏతపస్సును బొనరింపకే మృగాక్షి!
భర్తనే యనుసరించిన భార్య కొదవు
స్వర్గసౌఖ్యము లీధర్మపథము నీవు
హృదయపేటిక నిల్పితివే? విరాళి. 116

దరహాసముద్రతో తరళాక్షి వదనమ్ము
వెన్నెలల్ విరియంగ వేడ్కఁ బలికె
వృత్తవర్జితుఁడగు విభుఁడె దైవమ్ముతో
సముఁడైనఁ జెప్పంగ సాహసింతు

ఏయతేంద్రియుఁడు రామునికి వర్తనమునందు
దీటగు సుగుడియెందేనిఁ గలఁడె ?
పరకాంతలను మాతృభావమ్ముతోఁజూచు
రాముండు నయనాభిరాముఁడగును
అగ్నిసాక్షిగ ననుఁ బెండ్లియాడువేళ
మాన్యుఁడొనరించినట్టి ప్రమాణములును
భద్రముగనిల్చె హృదినెడఁ బాయవెపుడు
నేటియుపదేశ బలమున నిత్యములగు 117

వనవాసం బొనరింపవచ్చిన తఱిన్ వాక్రుచ్చెనెన్నెన్నియో
ఘనరత్నమ్ములవంటి ధర్మములు సాకల్యమ్ముగా నత్తగా
రు- నవిష్ఠమ్ములుగా విభాసిలును మీరుంజెప్పగా ధర్మముల్
వినయంబొప్పగ స్వీకరింతు జననీ । వేదోక్తులట్టుల్ మదిన్ 118

మరణించిన తనపతికై
యరతిన్ జము వెంటనరిగి యాతనితోడన్
జరుపగ ధర్మవివాదము
పరువడి సావిత్రి పొందె పతి ప్రాణములన్ 119

ఇదియెట్లు సాధ్యమయ్యెను
సుదతికి సావిత్రి కనిన చోద్యము కలదే ?
హృదయము పతి శుశ్రూషను
మెదలుటతో సాధ్యమయ్యె మెలఁతకు భువిలో 120

ఆమాటలను విని యాయమ జనకజ
శిరము మూర్కొని ప్రేమఁ జెప్పనిటుల
"నియమనిష్ఠలతోడ నే కూడఁబెట్టిన
తపమెంతయో యుండె దానిబలము
తో నొక్కవరము నిత్తును కోరుకొ"మ్మన
నవనిజ "దయచాలునంతె" యనియె
రెండింతలుగఁ బుల్కరించి ముదంపడి
జానకికొసఁగె వస్త్రములు, నగలు,
నంగరాగము, లనులేపనాదులిచ్చె
మాల్యములు కూడ దయచేసె మమతపేర్మి
వానిధరియింపఁజేసి యాపడఁతినడిగి
యామె కల్యాణకథ విని యాత్మపొంగె 121

అనసూయ వరమొసంగెను
జనకజకున్ "వాని దాల్పసంధించును నీ
[illegible]
[illegible]" [illegible] 122

వినయంబుట్టిపడంగను
ననసూయాదేవి కెరఁగ నవనిజ భక్తిన్
నినుపారు వత్సలత, న
క్కునఁజేర్చుచునామె ముద్దుగుమ్మంగనుచున్ 123

వైదేహీ ! నినుఁజూచి మెచ్చుగొలిపెన్ ప్రత్యగ్రమానోజ్ఞ మా
పాదించెన్ సుమి మాల్యభూషణములన్ బాగొప్పఁగైసేయ, నీ
పాదాబ్జమ్ములు కాల్నడన్ దిరుగ నొవ్వంబోవు రాముండు నీ
మీఁదం బ్రేమ వెలార్చు నిప్పుడిగ సుమ్మీ ! ఆర్ద్రచిత్తమ్ముతో 124

అనుచున్ దీవెనలిచ్చి పంపె ననసూయాదేవి శ్రీజానకిన్
ఘనుఁడా రాఘవు పాలికిన్ నినుపు వ్యక్తంబై సనేత్రమ్ములం
గని సంతోషమునందె దుర్లభములౌ గ్రైవేయకాదుల్ ధరిం
చినవెన్కన్ సతియందచందముల మెచ్చింపంగ శ్రీరాముఁడున్ 125

అత్రిని, ననసూయను ఘూ
పుత్రియు రఘురాముఁడును ప్రపూతమనస్కుల్
తత్రత్యుల వీడ్కొని సౌ
మిత్రింగొని పయనమైరి మెలఁగవనులలో 126

'రామ ! యీ దండకారణ్యసీమ పొలుసు
దిండులకు నాలవాలము మెండుకొనుచు
మునులు కనబడఁ దినుటయే పనిగనుందు'
రనుచుఁదెలిపిరి ముని తపోధనులు పెరిమ 127

'వారిదౌష్ట్యము నార్పంగవలెను - కంద
మూలఫలములఁగొనితెచ్చు మునులుపోవు -
త్రోవలివె దండకములకు - నీవుచనుము
మెలఁకువగనుండి పొలకువఁదెలిసి మనిరి

## ఆ శ్ర మ స ం ద ర్శ న ము

జలదపటలముఁ జొచ్చు భాస్కరుని పగిది
దండకములఁ బ్రవేశించెదాశరథి, ని
శాచరులఁ బిల్కుమార్చగ సాహసమున
శిష్టరక్షణ ముఖ్యమై చెలఁగుకతన 129

నానాపక్షిసమన్వితమ్ములును, నానాజంతుసంకీర్ణమ్ముల్
నానావృక్షవిరాజితమ్ములును నానాపుష్పసౌరభ్యముల్
కానల్ తోఁచెమనోహరమ్ములుగ సత్కారమ్ముసేయంగఁదా
మానందమ్మున నున్నరీతి ప్రభువాప్యాయమ్ముతోఁ జూచెడిన్ 130

రాముని. నయనాభిరాముని. నీరద
　　శ్యాముని, నిర్జితకామునిఁ గని
సకలజీవకోటి సంభ్రమమ్మున వింత
　　గా రెప్పలార్పక కాంచి యెంతొ
తన్మయత్వమ్మున తాదాత్మ్యము ననుభవిం
　　చుచు నిల్చియుండెను సుప్తచేత
నను నిద్రపోవు ననంతదివ్యత్వము
　　జాగరితంబయి స్వామిమూర్తి
లోనిదివ్యత్వమును త్రుటిలోం మించి
కనులబాష్పము లురలగఁ గలిగెనొప్పు
డౌ కవిచిత్రానుభూతి యుద్యోతితము గ
నమృతసేచన మందించె నంచగించి 131

రామచంద్రుఁడు సత్యపరాక్రముండు
సత్యమున మోక్షక్రమమును సంతరింపఁ
గలుగుటయు సత్యమునన్టై * పరాక్రమముఁ
తొలగఁజేయుటయును ధర్మములగనుండ 132

ఆశ్రమపదమ్ము లాదండకాటవులను
లెక్కకున్ మిక్కిలిగఁగల్గు పెక్కురమ్యము
లచటనుండిరి వాసయోగ్యముగఁదనర
పరమరమణీయ ప్రకృతి శోభావహముగ 133

ప్రాణములేచివచ్చె రఘురాముని కావిపినమ్ములందుఁగా
లూనినతోడనే హృదయ మూఱట నంది ప్రశాంతి చిక్కగన్
కాననరామణీయకము కన్నుల కింపును సొంపుఁగూర్ప సీ
తానన సీమ వెన్నెలలు హాసముచింద పరిక్రమింపగన్ 134

మార్గమునందుఁదోఁచిన శ్రమం బుశుపంగనుశక్తిఁగల్గునై
సర్గికశోభతో మనసు చల్లదనంబునుబొందె రాముఁడున్
మార్గణముల్ శరాసనము మూటలకచ్చటఁదావుకల్గకే
స్వర్గసమోపపాదక ప్రసాదిత చిత్తసరోరుహుండుగాన్ 135

పరమయోగిజనమ్ములాప్రాంతసీమ
నఖిగతమైరి రాముని కచట జ్ఞాన
పూర్ణులును, వయోవృద్ధులు. మోక్షకాము
లవిరళజపాగ్ని హోత్రసమర్చకులును 136

* సత్యముచే పరుల అక్రమమును తొలగించుట (సత్యపరాక్రమము)

వారలు, నిరపేక్షులు, నా
త్మారాములు, తపమె జీవితముగా గడపం
గోరుమహాత్ములు, దైవం
బారాధ్యంబన్యమెఱుఁగరావంతైనన్ 13

ఇంతకన్నను నానంద మేమి యుండు
రామచంద్రుని హృదయసారసము వికసి
తంబగుచుఁ దుష్టినందెను-తరుణి, తమ్ముఁ
డనుపమప్రహర్షచిత్తులై యనుగమింప 13

ఆత్మవంతుఁడు, దుర్ధర్షుఁడైనరాముఁ
డామహారణ్యముంజొచ్చి నచట తాప
సాశ్రమమ్ములకేఁగి మహాత్ములైన
మునులసేవించు నుత్సాహమునగడింది 13

మహితుఁడట తాపసాశ్రమ మండలమును
దర్శనీయముగా నున్నదానిఁగాంచె
రామునకుఁదోఁచెనది తపోభూమివోలె
బ్రహ్మతేజస్సమావృతప్రాభవమున 140

జపతపమ్ముల, నియమనిష్ఠలను బ్రొద్దు
పుచ్చుసంయమివరులతోఁబొలుపుమీఱు
దండకములు దానవకోటులుండి కూడ
దీపితములుగఁదోఁచును తెరువరులకు 141

నభమునన్ వెల్గు సూర్యమండలము భాతి
బ్రహ్మతేజము మోములఁబ్రస్తరింప
నగ్నికార్యములొనరించుచచటి మునులు
పుడమిభాస్కరమండలమ్ముగను పృజింత్రు 142

పక్షిరుతమ్ముల వృక్షసంతతి పర
స్స్వరము సంభాషించు సరణినుండ
నంగణభూముల నాశ్రమ మృగములు
నిర్విశంకమ్ముగఁబర్వులిడగ,
నళినముల్, కుశములు, నగ్నులు, గ్రుగ్భాండ
ములు, స్వాదుఫలములు, పుష్పనిచయ
మాస్వాదితమ్ములు నానందహేతువు
లై ముక్కుపుటముల కామెతలిడ

జపతపంబులు, వేదనిస్వనము, యజ్ఞ
వాటికల వైశ్వదేవముల్ వరలు సతత
మచటి ప్రతియొక్కముని యొక్క యగ్నిదేవుఁ
డబ్జబంధువు, తేజస్వి, యపరబ్రహ్మ 143

ఆ చిరంతనమునులు మహానుభావు
లమితదాంతులు, కందమూలాశనులు. త
పోధనులు రామచంద్రుని పూతచరితుఁ
గాంచి పరమాదరమ్మున స్వాగతమొసఁగిరి 144

పచ్చనిచెట్టుల పరువులు
విచ్చినపుష్పములు లతం విరియంబడుచున్
ముచ్చటగా రాఘవులకు
వెచ్చనిస్వాగతముఁబలికె విసుమాన- గా 145

చిరకృష్ణాజినాంబరుల్ చెంగలించు
హృదయముల రామచంద్రుని, నింద్రసముని
గౌరవించిరి - వారలఁగాంచి విభుఁడు
తన ధనుస్సున నల్లెత్రాటిని సడల్చె 146

తాపసవేషము సుందర
రూపమునకు మెఱుగుపెట్టి రోచిష్ణువుగా
చూపట్టు రామచంద్రుని
చూపుమరల్పకయె తాపసులునిలువంగా 147

తూరుపుకొండపైతోఁచు చంద్రునివోలె
ప్రియదర్శనుండగు ప్రేమమూర్తి
రామచంద్రునిఁగాంచి రంజిల్లి వాచంయ
ములు తృప్తితో నీలమోహనునకు
విన్నవించిరి పరివేష్టించి 'రామ ! మా
కాననంబులకు రక్షకుఁడవీవు
ప్రభవించితివి లోకపాలురయంశతో
పాలకుడవునీవు పాలితులము

మేము - దైత్యనిబర్హణమే త్వదీయ
రాజధర్మమీభూమి నీ రాజ్యమందుఁ
గల దవశ్యము మముఁగావ వలెను - రాజు
వీవె పురినున్న వనినున్న నింగితజ్ఞ ! 148

మాధనము తపోమాత్రం
బీధారణినేలు ప్రభువు వీవగుట జిత
క్రోధుల రక్షింపుముమము -
సాధింపుము దనుజకోటి సాహసికుఁడవై 149

ప్రభువవైనను కోసలరాజ్యమునకు
దండకమ్ములు భాగమై తనరుకతన
శరణువేఁడుచునుంటిమిస్వామి ! నిన్ను
ధర్మపాలుఁడవీవు - సంత్రాతవీవు 150

పుడమితేఁడు విష్ణ్వంశసంభూతుఁడగుట
దుష్టశిక్షణఁగావింప ధూర్వహుఁడవు
పట్టిపీడించు దితిజుల మట్టుపెట్టి
బ్రోచుభారమునీది మాభూమి మునుల 151

ఈమాభూముల కెల్లనేలికవుకావేనీవు ! నక్తంచరుల్
దోమల్వోలెను మమ్ములన్ నలిపి, బంతుల్ రీతి దొర్లించుచున్
బాముల్వెట్టుచునుండి రెంతగనొ మాపాట్లెరికిన్ జెప్పగా
లేమీదుస్థితిఁబాపి ప్రీతిమెయి పాలింపంగదే రాఘవా ! 152

ఒక్కెడ ముక్కుమూసికొని యుందుము మేము తపస్సమాధిలో
రక్కసిమూకనుండి మము రక్షణసేయుము పుణ్యముండు కై
పెక్కుచు ప్రాణగొడ్డముల నేఁచుచు మాదినచర్య సాగనీ
రక్కుటిలాత్ములంజెనకి యాపదఁ బాపుట నీకుధర్మమౌ 153

నీవార్తల్ మముఁజేరుచుండెనసఖా ! నిర్నిద్రముల్ దండకల్
ప్రావేల్పుల్. పలలాశనుల్ ప్రసృతగర్వప్రాకృతావేగులై
మా వెంటంబడి యజ్ఞకుండములలో మాంసాదులన్ జిమ్ముచున్
త్రోవల్కాచుచు బాధపెట్టెదరు సంరోధించుచున్ నిత్యమున్ 154

ఆతపశ్చారువులగు మహర్షులచటి
దనుజులొనరించు దుశ్చేష్టితముల నెఱిక
పఱచి వారలదండింప వలయు ననుచు
ప్రార్థనముఁజేసి రారఘురామునరతి 155

అంతనారాముఁడెంతో దయార్ద్రహృదయుఁ
డగుచు వారి సమీక్షించి యట్లెప్రోవ
శపథమంజేసి ముందుకు సతియుఁదమ్ము
డనుగమింపగ విపినరథ్యలను సాగె 156

కృతపుంఖుల్ పయనించి దుష్టమృగసంకీర్ణమ్ములౌ త్రోవలన్
లతలున్, గుల్మములల్లిబిల్లిగొన వాల్లభ్యమ్ముతో లక్ష్యమే
స్థితమై మానసవీథులన్ నిలువ రాశీభూతశౌర్యమ్ముగా
నతివర్తించుచు చేరి రాగహనమధ్యప్రాంతమున్ దేఁకువన్ 157

నీరువట్టులఁ దెలియంగనేరరెవరు
పరిచయంబున్న కాని యాప్రాంతమందు
కీఁచుకాలసంగీతముల్ గిఱికొనంగఁ
చెవులుబాధిర్యమును బొందు చేటుకలదు 158

ఒక తరుచ్ఛాయ విశ్రాంతినుండి కొంత
తడవు - పయనము సాగించు తరణికులుఁడు
అవనిజంగాంచి పరిహాసమాడుచుండు
సమయమున ముఁదుకేఁగ కష్టంబుఁగాగ 159

పురుషాదుఁడొకరుండు భూధరశిఖరమ్ముఁ
        బోలు దేహమువాఁడు, పోటుకాఁడు
బండికన్నులవాఁడు వక్త్రంబు గిరిగహ్వ
        రమువలె నున్నవాఁడమిత బలుఁడు
బానకడుపువాఁడు, ప్రామిడిరూపమ్ము
        గొనిన వాఁడఱపుల కుధరశృంగ
ములు దద్దరిల్లగ ముంజేతులంజాపి
        పులితోలు ధరియించి ముందు కుఱుక

సిద్ధమగువాఁడు శూలమ్ముఁ జేతియందుఁ
గలిగి దానికి హారులను, పులుల, జంబు
కముల, నేదులఁ గరిమస్తకముసు గ్రుచ్చి
గదురుతో నిల్చువాఁడటఁ గానిపించె 160

వారలం గాంచి పరుగున వచ్చె ముందు
కతనియదలింపులకు భూమి యదరిపోయె
నవనిపుత్త్రిక వైదేహి నతఁడు పట్టు
కొనుచుఁదనయంకసీమ నిల్పెను విరాన 161

రామలక్ష్మణులం జూచి రక్కసుండు
సంభ్రమముతోడఁ బ్రశ్నించె సంశయమున
'ఎవరు మీరేల వచ్చితిరిటకు వేష
ములనుజూడ కాన్పింతురు మునులవోలె 162

కాని శరచాపముల నమ్ముకొనుచు వచ్చి
నటులఁ దోఁచును మిమ్ముల నవ్వి కావఁ
జాలుననుమాట కల్ల ! మీకాలమపుడె
తీఱిపోయెను నెట్టి సందియములేదు 163

తాపసులామీరు ! తరుణితో మునివృత్తిఁ
గలుషితం బొనరించు కాంక్షకలదె ?
నక్తంచరుఁడనేను - నానామము విరాధుఁ
డనియంద్రు - జీవికయగును మునుల
పలలమ్మె - యీనాతి భార్యయౌ నాకింక
మిమ్ముల వధియించి మీ రుధిరముఁ
గడుపారఁ గ్రోలెద గ్రక్కుననిదె' యంచు
వచియింప జానకి వణకిపోయె

దుఃఖముననెండె రామచంద్రుని వదనము
ఆ విరాధుని యంకంబునందునున్న
సీతఁగనుగొని తమ్ముని౯ జేరఁబిలిచి
హృదయ మారాటమును బొంద నిటులఁబలికె 164

తమ్ముఁడా! చూచితే! ధరణిపుత్రికి శుభా
చార కేగతి వచ్చె - సతిని నేఁడు
పరుఁడంటుకొనెను దుర్భరమౌను నాదుఃఖ
మింతకు మించినదేమికలదు?
నా దురదృష్టమే నన్ను వెంటాడుచు
నిన్నివిధంబుల నీడ్చుచుండె
జనకుండు మరణించె సామ్రాజ్యమా పోయె
నిప్పుడీబెడఁద ప్రాప్తించె 'ననుచు

బిట్టువాపోవు రాముని పట్టుకొనుచు
నిట్టలంబుగ నిట్టూర్చి నెనరుఁజూపి
వాకొనె సుమిత్రసూతి 'నీవంటియనఘుఁ
డిటులఁబొగులంగ న్యాయమౌనే మహాత్మ! 165

దేవేంద్రసముఁడవు నీవగ్రజా! సర్వ
భూతమ్ములకుఁబ్రభుడవై తనర్చు
వాఁడవు - శోకింపఁ బనియేమి? నావంటి
సేవకుండుండంగ చింతయేల?

వీనిని వధియింతు - వీని రక్తమ్ముతో
ధారణి దాహమ్ము తీరుగాక !
భరతునిపై మున్ను వచ్చెను కోపమ్ము
దానిని విఘటింపఁదలఁకి నావు

తీర్చికొందునాకోపము దితిజుపైని
ఇంద్రుపవివోలె నాశరం బితని నాశ
సంటొనర్చునుగాక ప్రణామ మనుచు
దైత్యు నవహేళనము చేసి తమ్ముఁడనియె ।

'ఎవ్వఁడవు నీ' వటంచు గర్జించె నూర్మి
ళాధవుఁడు - దాని కాతఁడు లక్ష్యపెట్ట
కతనికిన్ బదులుచెప్పక యదరిపడుచు
తిరిగిప్రశ్నించె లక్ష్మణుఁదెంపరియయి ।

ఎంతధైర్యము నన్నె ప్రశ్నింతు వౌర !
ఎవ్వఁడనొ తెల్పినాడ - 'మీరెవ్వ' రనిన
బదులుపలికితె యెంత గర్వమ్ము నీకుఁ
"మీదువైనమ్ములందెల్పుమీ" యటన్న

వానిముఖమునుండి వహ్నిచ్చటల్ దిక్కు-
దిక్కులకునుఁ బ్రాఁక దితిజుని గని
రామచంద్రుఁడనె విరాధునితో తమ
ప్రవరనెఱుఁగఁజెప్ప భావ్యమనుచు

మే మైక్ష్వాకుల మర్త్యమాన్వయుల మోర్మిన్ దండకారణ్యమున్
మేమైచేరితి మొక్కహేతువున - నెమ్మిన్ దెల్పు మీవేల సి
సీమంగ్రుమ్మరనేమి కారణము గాసింబెట్టుచున్ బాంధులన్
జీమూతమ్ము వలెన్ వనిన్ నిలిచి పుంజీభూతదౌష్ట్యమ్ముతో 170

ఈమె నాసతి - మఱితమ్ముఁడీతఁడగును
జనకువచనమ్ముఁ బాలింప వనములందు
సంచరించుచునుంటిమి - క్షత్రియులము
కాన బాణశరాసముల్ పూనినాము 171

నావుడు రాక్షసుండనియె ' నా జనకుండు జయుండు తొల్లి నే
సీవన మందునన్ తపము నెంతయొ కాలమొనర్చి బ్రహ్మచే
చావునుఁ బొందకుండఁ బలుశస్త్రములన్ వరమొందినాఁడ మీ
రేవిధి గెల్వలేరు నను - నీయమ భార్యగ స్వీకరించెదన్ 172

ఆశవలదీమెపైనింక ప్రాణములను
నెచటికైనను బోయి రక్షించుకొనుడు
వదలితిని మిమ్ము వ్రేల్మిడి కదల మేలు !
లేద భక్షింతు ననుకంపలేదు నాకు 173

కోపసంరక్తలోచనుఁడై పలికెను
రామచంద్రుఁడీరీతి, 'విరాధ ! చావు
దాపురించెను నీ కేరు ప్రాపునీరు
తప్పిపోలేవు మా బాణతతికి నేఁడు 17

ఏడుబాణంబుల నేయంగ రాముండు
నవి వానిదేహమ్మునందు జొచ్చి
తెగుబడి శోణితదిగ్ధములై బుసల్
కొట్టుచు ధరణిపై కూలెనంత
శూలముతోవచ్చె సోఁకు సీతను వీడి
మరల వర్షించిరి మార్గణముల
నన్నదమ్ములు - వాటి నన్నిటి మ్రింగి వా
డావులింపగను బయల్పడెనవి
రెండుబాణంబుల తుండించె శూలమున్
రాముఁ - డతఁడు వచ్చి రామలక్ష్మ
ణులను భుజములపై మెలఁకువ నెక్కించు
కొనుచుఁ బోవదొడఁగె కుటిలబుద్ధి 175

పరుగుతీయు విరాధునివంకఁ జూచి
ధరణిపుత్రిక శోకించె తనకు నింక
దిక్కు లేదని రాఘవుల్ తెగుట నిక్క
మనుచు పలవించె నిటువలె నసురతోడ 176

'ఓయి రాక్షస ! వారిఁగొంపోయెదేల?
విడిచిపెట్టుము కరుణతో - వెక్కసముగ
బ్రతుకఁజాలుదునే నేను పతినివీడి
తరణికులజు లాత్మజ్ఞులు దాశరథులు 177

ధరణిజ దుఃఖమున్ గనుచుఁ దాలిమిపీడి విరాధుబాహువుల్
నఱకిరి రామలక్ష్మణులు - నారికడం బిల వ్రాలినట్టు లా
గొఱకుసుఁగుప్పగూలె - నటుకూలిన రక్కసుఁగాళ్లఁ ద్రొక్కుచున్
కరముల మోదుచున్, పొడువగాఁ బిడికిళ్లను లేవలేదిఁకన్ 178

నలువవరాన శస్త్రము లనర్హము లీతనిఁజంపఁగాన నా
పలువను బాతిపెట్టుటకు వారలు యత్నము సేయుచుండగా
ఖలుఁడువచించె 'రామ ! పలుగాకిని - నిన్ గనుగొంటి - లక్ష్మణున్
బొలతినిసీత గుర్తెఱిఁగి మోదమునంది తనుగ్రహింపవే 179

నేనొక గంధర్వుండను
నా నామము తుంబురుండు నాకిడె శాపం
బోనాయక ! వైశ్రవణుఁడు
పూనితి నీసోఁకు రూపు పురుషశ్రేష్ఠా ! 180

పరిపరి ప్రార్థించిన నా
కరుణామయుఁడనియె 'దండకములకు రాముం
డరుదెంచి శాపమోచన
మరితిం గావించు చంపి యద్భుతలీలన్ 181

నా శాపమునకుఁ గారణ
మాశపడుటె రంభపొందుకై - దయతోడన్
నా శాపము తొలగించితి
వీశిక్షయె వరముపగిది హితమొనరించెన్ 182

మీకు శుభమగు ! గంధర్వలోకములకు
పోవుచుంటిని - శరభంగముని మహాత్ముఁ
డతని యాశ్రమమిచ్చటి కనతిదూర
మందు గలదు దర్శింపఁగ నగును మేలు 183

పరమపావన ! నా కళేబరము నొక్క-
గుంటఁ ద్రవ్వి పూడ్చిన యెడనెంతో తృప్తి-
పొందఁగల్గుదు దానసే పుణ్యలోక
ములకు - కరుణించి ననుఁ బూడ్చుమో వరిష్ఠ ! 184

తన మరణోపాయంబును
దనుజుఁడె తెల్పంగ నన్నదమ్ములు దేహం
బును ద్రోసిరి యొకగర్తం
బున ద్రవ్వుచు శిలల, మట్టిఁబూడ్చిరి వానిన్ 185

కన్నులఁదృప్తితోడఁ గృతకార్యులు రాఘవులా విరాధునిన్
చెన్నటిఁబిల్కుమార్చి వనసీమ భయమ్మును వాపి వృత్తసం
పన్నులు సూర్యచంద్రులటు భాసిలఁ గార్ముకఖడ్గరోచులే
భిన్నము కాని మంజుపరివేషములై పురుడించి శోభిలన్ 186

నిలువుగ్రుడ్లతోడ నిలిచెను మైథిలి
దూరమేఁగె ఖలుఁడు దోర్బలుండు
పతిని, మఱది కెట్టి బాధలు కల్గునో
తెలియు తెరువులేక తలఁకెనామె 187

ఆవిరాధుని దేహంబు నటులఁబూడ్చి
వైవ మరల గంధర్వరూపంబు నంది
మహితులకు భక్తితోడ నమస్కరించి
కదలిపోయె గంధర్వలోకమున కతఁడు 188

కలఁగిన చిత్తముతో కళ
వళపడుజానకికి భయము వాపగ వారల్
జలదావరణము వెలువడు
జలజాప్తసుధాకరులటుఁ జనుదేరి రొగిన్ 189

ఒకచో సందడి మువ్వురు
పకపకలన్ గడపి రసురవ్యక్తిత్వమ్మున్
తికమకగొని తామెట్టులొ
వికటాకృతి కూల్చివెరవు, విధముఁదలచుచున్ 190



# పంచమాశ్వాసము

తరమిడిపోవగా నతవిదారులు(గొత్తలు, దుర్గమమ్ములై
తరలికసాగ కష్టమయి తందరనందుచు విశ్రమించుచున్
తరుణియు రామలక్ష్మణు లతఃపరబాధలనెల్ల విస్మరిం
చిరి; శరభంగు నాశ్రమము(జేరిరి దైత్యుని మాట చొప్పునన్ 1

ఆశ్రమంబగుపించె నతిదాహపీడితు
లకు వారిపూర్ణసరస్సుపోలె
దేవప్రభావుండు భావితాత్ము(డు తప
మ్మున శరభంగ సన్మునివరుండు
వారేగువేళకు పరమర్షి నికటమం
దేదొ మహాతేజ మింపు(గొలిపె
వపురాకరంబౌచు భాస్కరవైశ్వాన
రోపమంబై తోచె నూర్జితముగ

సరిగ గమనింప నాతేజ మరిదినొక్క
దివ్యపురుషునిపోలె సందీప్తి(బొలిచె
నతనిపాదము లవనికి నంటకుండె
నాభరణకాంతితో దిశలావరించె 2

అతనివెంటను గలరట్టితేజస్వులే
కొందఱు మిరిమిట్లుగొలుపు భూష
ణాంబరంబుల(దాల్చి, యాకాశగతతరు
ణాదిత్యసన్నిభంబైన రథము -

పూన్చిన హయములు పొలుపారు హరితవ
  ర్ణమున, ఛత్రముకల్గు రథమునకును
శశిధరమండలసంకాశమది మాల్య
  పరిశోభితంబయి ప్రక్కలందు

చామరగ్రాహులిర్వురు సంభ్రమమున
బర్వసురసిద్ధసాధ్య గంధర్వపరమ
ఋషిగణము లభ్రవీథిస్తుతించుచుండ
వచ్చెశక్రుండు మునిఁజూడభక్తిమీఱ 3

పాకశాసనుఁడట శరభంగమునిని
గాంచి భాషించుచుండ లక్ష్మణుని కంత
రిక్షగతమగు సరదంబు ప్రేలితోడఁ
జూపి రఘురాముఁడనియె విశుద్ధహృదినిఁ 4

మున్నెప్పుడో దేవేంద్రుని
కున్నది తాదృశరథమ్ము, వ్యోమమునందున్
మిన్నక చరింపనుచును
విన్నారము దీనిఁజూడ వేడుకఁగల్గెన్ 5

పురుహూతుండరుదెంచఁబోలు నిటకుంబూజ్యుంగనన్ - రథ్యముల్
హరితంబై కనుపట్టు స్యందనముఁగాయన్ ఖడ్గపాణుల్ మనో
హరవేషమ్ములఁ నిల్చియుండిరదె వీక్ష్యస్ఫూర్తిఁగల్గించుచున్
బరికింపన్ గడుముచ్చటయ్యె త్రిదశుల్ వాల్లభ్యసంశోభితుల్ 6

అనుజా ! నిల్వెదు నీవు, జానకియు నేరామౌని దర్శించి వ
త్తునటంచున్ రఘురాముడాశ్రమమునందుంజొచ్చె - పాకారియున్
మునితో రాముడు వచ్చుచుండె దశకంఠుండీల్గునందాక నా
తని జూడందమకింప నంచరిగెనంతన్ వీడుకొంచున్ ద్వరన్

రాముడంతట నగ్నిశరణమునటను
సిద్ధమగు శరభంగఋషిం గనుగొని
వందనముజేసి భక్తిప్రపత్తి మెఱయ
'అచనినపురుషుడెవడం' ఐడిగె నరితి

సంయమీంద్రుడు రాఘవు సత్కరించి
వివరములనేర్చి లక్ష్మణు నవనిజాత
ఛాత్రులంబంపి రప్పించి స్వాగతింప
వారలెరగిరి సద్భక్తి పరిఢవిల్ల

రామచంద్రుని ప్రశ్నకు ప్రేమమీఱ
బదులుపలికె మహర్షి ఓ సదమలాత్మ !
బ్రహ్మపనుపున వచ్చిన పాకవైరి
యతడు - ననుగొనిపోవగ నరుగుదెంచె I

ని దర్శనముంజేయగ
రాదోయన వృత్తవైరి రయమున జనియెన్
కాదిది సమయమటంచును
నేదో వచియించి రామ ! హేతువదేమో ! I

బ్రహ్మలోకములఁదపస్సుతో సాధింపఁ
గలిగితి నిదియెంతో కష్టసాధ్య
మగు లాతిజనులకు నరుగుచుంటిని నేను
నలువ నుండియె నాకు పిలుపు వచ్చె
దండకాటవులందు నుండిన నీ రాక
యోగశక్తినెఱింగి యోగ్య నిన్నుఁ
జూచి పోవగనుంటి - వేచియుంటిని రామ !
తేజస్వి ! నాప్రియాతిథివి నీవు

కన్నులారగ నిను గాంచఁగలిగినాఁడ
బడసెదను రామచంద్ర త్రిపాద్విభూతి
నా తపఃఫలమందున ప్రీతిఁగొంత
నీ కొసంగెదఁగొనుమయ్య ప్రాకటముగ 12

"తెలియునాకు మోక్షమును సాధించినట్టి
విధము - మఱి దివ్యమంగళ విగ్రహుండు
రాముఁడరుదెంచె సేవించి బ్రహ్మలోక
మునకు వచ్చెద" నని పంపితిని బలారి 13

నగవైరి ధర్మమ్మునకును. వీరమునకుఁ
బ్రతినిధియగు వేల్పు - స్వామి దండ
కాటవి నసురసంహారము సేయఁ బ్ర
స్థానమ్ము సాగించు తరుణమందు

## ఆశ్రమ సందర్శనము

శరభంగమౌని యాశ్రమవాటి దేవేంద్రు
దర్శనమ్మగుటచే దాశరథికి
సత్యపరాక్రమ సఫలత కలుగంగ
శుభశకునమ్మిది సుగుణీ - కింద్రుఁ

డతని దశకంఠుఁడీలుగు నంతదనుక
చూచుటకు నిచ్చగింపక, చూచుచుండ
వ్యోమపథమున రథముపై బోయె శీఘ్ర
గతిని మునిచంద్రు వీడ్కొని కుదియఁబడుచు 1

ఇమ్ముగ రామచంద్రుఁడు మహేచ్ఛుఁడు, శక్తుఁడు తాఁబ్రవాసకా
లమ్ముననెన్నొ కార్యముల లాగుముతో నెరవేర్పఁగల్గు వాఁ
డిమ్మునిలోకమాన్యుఁడు మఱెవ్వరుఁ జేయగరానిరీతి లో
కమ్మును నుద్ధరించునని గాఢముగా మది నెంచె నింద్రుఁడున్ 1

తానిటకేఁగుదెంచిన ప్రధానమహత్తర కార్యసాధనం
బైననుగాని దాశరథి నచ్చటఁ జూడగ, మాటలాడగాఁ
బూన నిరర్థకం బనుచుఁ బూజ్యుఁడు రాముని గాంచ నిల్వకే
దానవవైరి వాసవుడు దాఁటుకొనెన్ త్వరమాణబుద్ధితో 1

కారణమేమియో తెలుపగా ననకాశములేమి నా సునా
సీరుఁడు పొందరన్ రథముఁ జేకొని యంబరవీధి సాగగా
ధారణిపుత్త్రి, రాఘవులు తథ్యమెఱుంగక విస్మయంబునన్
దేరునుఁగాంచుచున్ నిలిచి దేవవిభున్ గమనించి రావడిన్ 17

శరభంగుని నుడువులువిని
దరహాసముఁజేసి పలికె దాశరథి "ముని
శ్వర ! మీదయచాలును - మా
కిరవున్ వనియందుఁ జూపవే ! కరుణాబ్ధీ ! 18

ఎన్నియొ పుణ్యలోకముల మీరు జయించిరి లక్ష్యశుద్ధితో
కొన్ని సహస్రవర్షములు ఘోరతపంబొనరించి - నేను చే
కొన్న విరుద్ధమౌనుగద ! కూరుచుకొంటిరి కాదె ! మీరలే
మన్నను దేరగా ఫలము నందుట కిష్టముఁజూప నెమ్మెయిన్ 19

మీరు సాధించు ఫలముల మీరె యనుభ
వింప న్యాయము - నాకేలఁబంపకమ్ము
నా ఫలము నేనుసాధింతు - నానకాదె ?
పరులకష్టముఁ దోఁచుట భావ్యమగునె ? 20

అంత శరభంగఋషి యిట్టులనియె 'స్వాంత
మెంతో నిస్తులమగును - నేనింతవఱకు
నెన్నొ యక్షయ లోకమ్ములందుకొంటి
శాశ్వతంబుగ నా తపశ్శక్తివలన 21

బ్రహ్మదేవలోకమ్ములఁ బడయుకతన
హరిహయుఁడు నా తపస్సున కరితిమెచ్చి
నాకొఱకువచ్చెఁ గొంపోవ నలిననేత్ర !
నేనెటులఁబోవఁ గల్గుదు నిన్నుఁగనక? 22

సత్యము, ధర్మమున్ హృదయ సారసమందున నిల్పుకొంచు, నీ
సత్యవ్రతుండుగా మెలఁగు చందమునన్ దలలోననాల్కగా
సత్యపరాక్రముండగుదు - స్వామివి ! స్వార్థము నుంతలేకయే
ప్రత్యహమున్ విపన్నులకు బాసటగా నిలువంగ మెచ్చెదన్ 23

నీవు విరాధునిఁజంపుచు
పావనచరితా ! వనంబు భయరహితముగా
గావించితి వద్భుతముగ
జీవులకున్ భీతితొలఁగె - చింతయుఁబాసెన్ 24

కన్నుల పండువఁ గానీ
చెన్నుంగాంచికయె పోవఁ జెల్లునె రామా !
పున్నెము పంటగ వచ్చితి
విన్నాళ్ళకు బ్రహ్మలోకమేఁగుదు నెటులన్ 25

లోకశ్రేయముఁ గోరుచుఁ
గాఁకలతో సంచరించు కరుణామయ ! నా
ప్రాకటతపఃఫలమ్మును
స్వీకార మొనర్చి సంతసించెడి వాఁడన్ 26

నీకన్న బ్రహ్మలోకము
నాకెక్కువకాదు - నిలిచినాఁడను శరభం
గాకాంక్షించిన రమ్మని
నీకై పరమాత్మ ! హర్షనిర్భరమతితో 27

కారణ జన్ముఁడవీవని
శ్రీరామా ! నాకుఁదెలియు - శ్రీకాంతుఁడ వం
బారాధించుచుఁ జూడఁగ
వేసాసు వేఁచియుంటిఁ బేరడవి నిటుల్ 28

నా చిరవాంఛితమ్ము రఘునాయక ! తీర్చితివిట్లు ధన్యుఁడన్
చూచితినయ్య ! నీ విమలసుందరరూపముఁ గన్నులారగన్
వేఁచినదానికిన్ ఫలము వెంటనెదక్కెను - వేదనాదు సం
కోచము - బ్రహ్మలోకములకన్ బరితుష్టినిఁ బొంగెనెంచెదన్ 29

మునివరుఁడు రామచంద్రుని ముద్దుమోముఁ
దనివితీరగ మఱిమఱి తన్మయత్వ
మును భజించుచు దర్శించి ముదమునంది
ధన్యమయ్యె జీవితమంచుఁ దలఁచె నాత్మ 3

శరభంగుఁడతని దీక్షనుగాంచి'' ''రఘురామ !
అనతి దూరమ్ములో ముని సుతీక్ష్ణు
నాశ్రమంబున్నది - అరుగుము మందాకి
నీకూలముంబట్టి - నీకతండు
వాసయోగ్యంబగు ప్రాంతమ్ముఁ జూపును
నిలువ మాతఁడు తెల్పు నెలవునందు
దాహము కొంచెము - తనువుచాలించెద
నేత్రపర్వమ్ముగ నిన్నుజూచి

కొనుచు నే నిష్క్రమించెద" ననుచు నగ్ని
ప్రజ్వలింపగఁ జేసి తపస్వివరుఁడు
వహ్నిలోదూకె - నాతని ఁడుగుదేహ
మపుడు జ్వాలలలో దగ్ధమయ్యె త్రుటిని

అగ్నిగుండముసుండి యగ్నిహోత్రమువలె
నా శరభంగ మహర్షి వెల్గి
పోవుచు యువరూపమును బొంది వెలువడి
ఆహితాగ్నులును, మహాత్ములైన
వాచంయములును, దేవతలు వాసముఁజేయు
లోకములన్ దాఁటి ప్రాకటమగు
బ్రహ్మలోకముఁజేరె - పరమేష్ఠి నిండుకొ
లువుఁదీరి యుండంగ రుచిరపీఠి

అనుచరుల వేదపఠనము నవధరించి
స్వాగతముఁబల్కె నా శరభంగమునికి
నలువ సంతోషమును బొంది నయముఁజూపి
సాదరమ్ముగ నీక్షించి మేదురముగ

కలరాశ్రమమున వైఖానసుల్, వాలఖి
ల్యులును, సంప్రక్షాలులును, మరీచి
పులు, నశ్మకుట్టకుల్, సలిలపర్ణాహారు
లును, వాయుభక్షులు, కనులనిద్ర

నెఱుఁగనివారు; శయ్యలుగ గాత్రమ్ములే
కలవారు, నెండవానలకు జడియ
కారుబైటను దపమాచరించెడివారు
స్థండిలశాయులు, జలములందు

శీతవాతాతపమ్ముల చింతలేక
నిలిచి తపముల దీక్షతో సలుపువారు
మునులు దశరథభూపనందనుని రాకఁ
దెలిసి వచ్చిరి రాము సందీప్తిఁగాంచ * 33

శరభంగాశ్రమ సంయముల్ దరిసి హర్షస్వాంతులై పల్కిరీ
కరణిన్ 'రాఘవ ! ధన్యులైతిమిటనిన్గాంచంగ నీ భూములం
దరతిన్ సృష్టియొనర్చుదానవుల సంహారమ్ముఁగావింపుమా !
కరుణాసాగర ! శాంతినిల్పి మునులన్ గాపాడుమా ! ప్రీతితో 34

---

* వైఖానసులు :- విఖనసుఁడను మహాముని నిర్వచించిన సూత్రముల ననుసరించుచున్నవారు.

వాలఖిల్యులు :- భగవంతుని నఖములనుండి రోమములనుండిపుట్టినవారు

సంప్రక్షాళకులు :- స్నానాదులచే పరిశుద్ధులు

మరీచిపులు :- సూర్యచంద్రకిరణములను మాత్రమే అస్వాదించువారు

అశ్మకుట్టకులు :- ఏపూటధాన్యముల నాపూట సంపాదించుకొని, వానిని శిలతోనే దంచికొని భుజించువారు

సలిలపర్ణాహారులు :- జలములు, పత్రములాహారముగా కలవారు

వాయుభక్షులు :- గాలిపీల్చి బ్రదుకువారు

స్థండిలశాయులు :- వ్రతము పూనినవారు పండుకొనుటకు దర్భాదులచే సంస్కరింపబడిన భూమిపై శయనించువారు

బలిషడ్భాగములాహరించి ప్రజలన్ బాలించి రక్షింపగా
వలయున్ ధార్మికులైన భూపతులు - నిర్వర్తింప కాధర్మమే
యలసుల్ పొందరు బ్రహ్మలోకముల రామా ! దండివీరుండవై
నిలుపంగావలె రాజధర్మమును నిర్భీతిన్ బ్రదర్శించుచున్ 35

పవనపర్ణాంబుభక్షులై నవసి మునులు
సలుపు తపముల ఫలములో షష్ఠభాగ
మవనిపాలునిఁజెందుకదా ! మహర్షి
సత్తముల రక్షసేయ దుస్తరముకాదు 36

అవిగో ! గుట్టలు, గుట్టలై మునుల దేహంబుల్ - విదారించు - వా
చవికై రక్కసులామహాత్ముల బుభుక్షాపూర్తికై చంపగా
మిపులన్ గుండెలు తల్లడిల్లగను స్వామీ ! నిల్చినామిచ్చటన్
సవరింపందగు నీ పరిస్థితిని నీ సామర్థ్యముంజూపుచున్ 37

రామ ! యీహననకాండ సర్వత్ర కలదు
భయము రాజ్యముసేయు నీ ప్రాంతమందు
నెందఱు మునీంద్రులీరీతి మ్రందినారొ ?
కాలగర్భమునందెట్లు కలిసినారొ ? 38

మందాకినీ తీరమందున, చిత్రకూ
టమ్మున, దండకాటవుల యందు
పంపానదీకూల ప్రాంతమ్ములందున
నస్థిపంజరములు నగపడు సుమి !

ఆ ప్రాంత మీప్రాంతమని చెప్పగానేల ?
నసురుల కివ్వి విహారభూము
లంతలో వచ్చెద, రంతలో పోయెద
దెద్ది నివాసమో యెఱుఁగరాదు

చెట్టుపైనుండియో లేక గుట్టచాఁటు
నుండియో వచ్చిపడెదరు దండధరుల
వోలె కడుభీతిఁగొలుపుచుఁదూలు మునులఁ
జంపుటయొ, హింసపెట్టుటొ జరుగుచుండు 39

మునిపల్లెలపై పడుటయు
కనికరమొక్కింతలేక కనిపించిన వా
రిని భక్షించుట వృత్తిగ
ననఘా ! వర్తింతురిచట నసురులు స్వేచ్ఛన్ 40

మొ ! విచిత్రమౌను బొలియింతురు మౌనుల బక్కమేనులం
ామిష మెంతయుండును - కృశాంగులు - నెత్తురులేమియుండుఁదా
ూముకొనంగఁబూనెద రయారె ! యమానుషులై నిశాచరుల్
ాములు పెట్టి హింసలకుఁబాల్పడుచుందురు — వారి నాపుమా ! 41

విసిగితి మీ బాధలతో
మిసిమింతులమైతి మింకమీఁదను ధృతితో
నుసిఁజేసి యాతుధానుల
నసిగావింపంగ వలయు - సౌహార్దమునన్ 4-

దినదినగండంబయ్యెను
మనికికి - దండకములన్న మరణభయములో
మునుఁగుచుఁదేలుచు ధైర్యముఁ
జనగా నదపీన్గులటులఁజరియింతుమిటన్ 43

నీరాకకెదురు చూచుచు
భారముగా జీవితములు పలుచనయ్యె ని
స్సారముగ గడపుచుంటిమి
శ్రీరామా ! చిత్తగించి చేయుము మేలున్ 44

సాధనము తపోమాత్రం
బాధర్షముతో మెలఁగు నసురుల వనిలో
సాధించి మాకుఁగూర్చుము
వేధన్ స్మరియించుకొనగ విశ్రాంతినిటన్ 45

నెవ్వగమాన్పగ మేమిఁక
నెవ్వరితో మనవిఁజేతు మీవు దితిజులన్
చివ్వను బొలియించినచో
దవ్వులకుంబోవు భయము - దార్ఢ్యము దక్కున్ 46

ధ్యానములో నుండెదమో !
ధ్యానములోనున్నమమ్ము దైత్యులు తినగాఁ
బూనెదరో తెలియంగను
జానకిరమణా ! వచింపఁజాలము మేమై 47

నీవు విరాధునిఁజంపగ
నీవే శరభంగమునికి నినుపొరు దయన్
బ్రోవడి మోక్షమొసంగగ
నీవే విష్ణుండవనుచు నిలిచె మనములన్ 48

ఆపదఁగడవంబెట్టగఁ
బ్రాపై బ్రోచెదవటంచు బంధురభక్తిన్
నీపై భారంబుంచితి
మీపై కృపఁబూని కావుమీ ! రఘురామా ! 49

మునుల సంప్రార్థనమును విన్నరాముఁడు
ప్రత్యుత్తరంబిడె 'ప్రాజ్ఞులార !
నన్నుశాసింపక విన్నవించెదరేల ?
జనకుని యాజ్ఞపై వనములకును
జేరితి - నెపమిది - ఘోరకాననములఁ
దిరుగుట మీబాధఁదీర్చుకొఱకె
తప్పను మాట - ప్రధానకర్తవ్యము
పొలుసుదిండుల పుటిముంచుటొకటె

ఇష్టుగా దీనిమించు ధర్మమ్ము కలదె ?
మేలుచేసెద వనవాసకాలమందు
నొడిమఱుకులేమిరావు - మీబెడఁద వాపి
శాంతి నెలకొనఁజేతుఁబ్రసన్నులగుడు! 50

పాపమ్ము సేయుచే పని కొందఱికి సజ్జ
సుల మిమ్ముఁగాఁచెద - నొప్పిపడక
ఓపికపట్టుడీ! ఒక కొంతకాలము
తీరును కష్టముల్ - తేఱుకొనెద
రనతికాలమ్మున నసురనిబర్హణ
మును సేయ వాగ్దానమును బొనర్చి
నాడ! విశ్వాసమునన్ మెలంగుడు మీరు
దండకమ్ముల శాంతి తనరునింక
నను(గుఁ)దోడుగ నిల్చి మిమ్మాదుకొందు
లోకహితదీక్షితుండనై ప్రాకటముగ
నారుసూరైనగాని యీ క్రూరులంత
మొందుచుంద చూతుఁ దేను విల్లందుకొంటి 51

పాపంబంటిన నంటనీ మునుల కాపత్తిన్ నివారించెదన్
లోపంబేమియు సేయ, దానవుల నాలోడించి శిక్షించెదన్
రాపాడించెదఁ బ్రాణగొడ్డములనార్పన్ గ్రూరులంగూల్చెదన్
శాపంబున్ దొలఁగింతు నీ శపథమున్ బ్రాణమ్ముగానెంచుడీ! 52

మీతపములు కొనసాగుట
కై తిరిగెద దండకముల - కన్నొమఱుగుచు నీ
ప్రీతిఁ జరించెడి దైత్యుల
కాతంకముఁగల్గఁజేసి యంత మొనర్తున్ 53

నాయుద్యోగము నేటినుండి దనుజన్యక్కారమేయాను - నే
మీయాజ్ఞన్ దలఁదాల్చి సాగెదను - సంప్రీతిన్ విలోకించెదన్
మీయజ్ఞమ్ములకెట్టి విఘ్నములఁ గ్రమ్మింపంగ నే దుర్మతుల్
చేయంబోవరు యత్నముల్ వనుల రక్షింతున్ బ్రతిస్పర్థతో 54

కలనైన నొరులకు గాసియొనర్పక
ఆత్మాభివృద్ధినే యభిలషించి
పరులతో నెట్టి సంబంధముల్ లేకయె
జపతపమ్ములతోడ సాగుచుండు
సంయమీంద్రులకు రక్షణనీయఁ జాలని
ప్రభుజీవితము దైన్యభాజనమ్మె ?
పరమప్రయోజనంబౌ పరమర్షుల
శాంతికాముకుల రక్షణమె - కంక
ణము ధరించితి నిదియెనిర్ణయము - జన్మ
సఫలతా కారణంబగు సాధుజనులు
నిత్యనైమిత్తికంబుల నెరపుకొనగ
సాయమొనరింతు మునులార ! శరణమిచ్చి 55

జీవితమార్గవిశిష్టత
వేవిధముల వలతు నదియె విహితము - మునులన్
సేవించుచు, రక్షించుచు
వైవశ్యముతో మెలంగువాఁడను తృప్తిన్ 56

## ఆశ్రమ సందర్శనము

ఆ రామచంద్రు నుడువుల
చేరిన తాపసులు తనివిఁజెందుచు హృదులన్
నారాయణు నవతారము
గా రామునిఁదలఁచి స్తుతులఁ గదలిరి వారల్

అచ్చటినుండి ముష్వరు ప్రయాణమొనర్చుచు మార్గమధ్యమం
దచ్చటనచ్చటన్ మునుల యాశ్రమవాటుల విశ్రమించుచున్
ముచ్చటఁగొల్పు దృశ్యము లపూర్వముగాఁ బరితుష్టినీయగా
నచ్చెరువందుచున్ గడచి రద్రులు, వాఁగు, లరణ్యసీమలన్

దూరమునందు వారలకుఁదోఁచె మనోహర శైలమొండు నా
చేరికనుండె సానువునుజేర్చి సుతీక్ష్ణుని యాశ్రమంబు నా
ఘోరిభుజుల్, విదేహనృపపుత్త్రి ప్రకల్పితహృష్టచిత్తులై
చేరుచు మౌని పాదసరసీరుహముల్ వెసనంటి మ్రొక్కఁగన్

రాముండంత సుతీక్ష్ణమౌనికి సపర్యండేసి వాచించె శ్రీ
రాముండందురు నన్ను పంక్తిరథపుత్రజ్యేష్ఠుఁడన్ - సీత నా
భామారత్నము - లక్ష్మణుండనుజుఁడౌ - ప్రస్థానముంజేయుచున్
మేమిచ్చోటికి మిమ్ముఁజూడగను నెమ్మిన్వచ్చి నామీహతో

శరభంగుని పంపున మే
మరుదెంచితి మిటకు మునిజనాశ్రయబుద్ధిన్
దిరుగాడుచు దండకముల
నెఱుఁగగ సప్రశ్రయముగ నెల్లవిషయముల్

తిగియు దేహమున సుతీక్ష్ణుఁడు దీర్ఘదీ
ర్ఘజటాధరుండును, గాంతిచక్ర
పరివేషవదనుండు - పరమవృద్ధు, తపస్సె
జీవితంబుగఁ గల్గు పావనుండు
నాజానుబాహుండు - తేజస్వి, సర్వభూ
తముల హితమ్ముకై తనరువాఁడు
బాహువులం జాచి పరమర్షి రాముని
గౌఁగిటంజేర్చి స్వాగతము నెరపె

రామ ! పావనమయ్యె నాశ్రమము నీదు
రాకతోడ సనాథమై రమణమీఱె
నీవు వచ్చెదవంచు ముందే యెఱుఁగుదు
నెదురు చూచుచునుంటి నేనింతవఱకు 62

వార్తల్ చేరెను చిత్రకూటగిరి నిర్బాధమ్ముగా* నుండుటన్
వర్తిల్లంగను గష్టమంచెడమగా వాంఛించుటల్, వచ్చుటల్
కర్తవ్యమ్మను నిర్వహింప మునిలోకంబెల్లఁ బ్రార్థింపగా
నార్తింబాపగ వాసనిచ్చితివికాదా ! వింటి నే నన్నియున్ 63

శరభంగుఁడు నా మిత్రము
చిరకాలముగా ప్రతీక్షసేయుచు నిన్నున్
దరిసింపఁగోరి చెప్పితి
నిరతింబంపించు మనుచు నే సంయమితో 64

* నిర్బాధము :- జనసమ్మర్దములేనిది

నాతపశ్శక్తితో గెల్చినాఁడ నన్ని
పుణ్యలోకమ్ములను నేను - పూజ్య ! నీవు
దేవఋషుల కిష్టములైన తావులందుఁ
గ్రీడి విహరింపఁగోరెద విమలహృదయ ! 65

దేవేంద్రుండిరుగెంచె నా కొఱకునై తేరిన్ వెసంగొంచు సం
భావింపంగ విశాలపక్షమయిఁదావచ్చెన్ సుమీ పిల్వగా
నీ సేవింపెదనంచు నే నెఱుఁగుదున్ నీ రాకకై చూచుచున్
పోవంజాలక బ్రహ్మలోకములకున్ బోరామికై నిల్చితిన్ 66

నా చిరాభవపుణ్యమ్మిన నలిన నేత్ర !
వాంఛలేదేలనో నాకు బ్రహ్మలోక
మునకుఁబోవగ నిటఁదపముం బొనర్చు
కొనుచు నిల్వఁబ్రశాంతిమై కోర్కె కలదు 67

ఆ సుతీక్ష్ణ మహాముని కంజలించి
తెలియఁజేసెఁ దిట్టులని యెను 'తపసి ! తాను
నాయెదుట నన్నుఁజొచ్చి యనంత దివ్య
బ్రహ్మలోకమ్మునకు శరభంగుఁడరిగ 68

[illegible] ! యిటు మౌనికులావతంస ! నా
[illegible] పోవదే [illegible] యన్యుల కష్టసంచితం
[illegible] ! [illegible]రమున నాఁగెద సాంప్రతమిద్ది కాదు నా
[illegible] వచియింపకుఁడట్టిమాటలన్ 69

మిమ్ములగూర్చి చెప్పె ననుమేయముగా శరభంగమౌని, తా
నిమ్మెయి నాకొసంగఁదమకించెఁదపః ఫలమందు కొంత, నే
నమ్మతిఁజూపలేదు - హరుసంబునఁజేకొనలేదు - కాన మీ
సమ్ముఖమందు నా హృదయసర్గగుణంబెఱిఁగింతు సంయమీ ! 70

ఎంతోకాలముగా ప్రయాసపడి మౌనీ ! మీరలార్జించిరీ
కాంతారమ్మున సర్వలోకముల, నే కష్టంబు లేకుండ నే
కొంతో భాగము స్వీకరింప మది సంకోచమ్ముకల్గున్ దయా
స్వాంతుల్ నన్ను క్షమింపవేఁడెద - నమోవాకమ్ములీకూర్మికిన్ 71

గౌతముఁడగు శరభంగుఁడు
ప్రీతినెఱింగించె మీదుప్రేమాతిశయం
బోతప్రోతముగా తమ
భూతహితరతింగుఱించి పొంపెసలారన్ 72

కావున మీదయచాలును
సేవలఁదనియింతు మిమ్ము-క్షేమంకరులౌ
పావనచరితులు మీరలు
దీవించిన ధన్యుఁడగుదు - తేజముఁగల్గున్ 73

అనిన సుతీక్ష్ణుఁడో రఘువరా ! ఋటులాడగ నీకె చెల్లు - నీ
వినయము శ్లాఘ్యమైచను - వివేకివి, ధర్మపథానువర్తివై
మునిజనసేవలో సతము మోదమునందుచు దుష్టశిక్షణం
బును బొనరించి శిష్టజనమున్ బరిరక్షణసేతువర్మిలిన్ 74

నీకీతావు నివాసయోగ్యమగు హానింగూర్పరేదైత్యులిం
దేకాలమ్మున గందమూలఫలముల్ హృష్టంబుగా లభ్యమౌ
సౌకర్యమ్ములు పెక్కు కల్గునిది శ్రేష్ఠ్యమ్మౌను వాచంయముల్
నీకున్ సాయముఁజేయుచుందురిట సాన్నిధ్యమ్మునన్ నిల్చుచున్ 7

క్రముకాదిమృగమ్ములాశ్రమమ్మునకు రావు
కాని యొకబాధ మాత్రముకలదు రామ!
అడవిదున్నలు, పందులు నరుగుదెంచి
యపుడపుడు పాడుచేయు సస్యములొకింత 7(

అకుతోభయములు మృగములు
వికలముఁగావించుఁదపము విఘ్నమొనర్చున్
శకలితమొనర్పఁగష్టం
బకలంక చరిత్ర! వానినాశ్రమపరిధిన్ 77

రామమూర్తి వచించె 'నోస్వామి! యాశ్ర
మమున మృగములఁజంప మీ మనసు బాధ
పడును - వెలుపల వధియింపవలయు నిట్టు
లెంతకాలము నే నుండు నిచట చెపుడి! 78

శరభంగుండు సుతీక్ష్ణుఁడు
పరములు జ్ఞానమున, ధ్యానపథముల యందున్
పరమాత్మ దర్శనంబగు
వఱకును దేవేంద్రు వెంటఁబడిపోవరాగిన్ 79

జానకీజాని లేచెను - సంధ్యవార్చె
సవితృఁడంతట పశ్చిమాచలముఁ జేఁరి
చిలికెఁగుంకుమపూఁత - హెచ్చెను తమస్సు
గడపెనారాత్రి రాముఁడు - పొడిచెఁబ్రొద్దు 80

స్నానసంధ్యాద్యనుష్ఠాన సరణిఁబూర్తి
చేసికొని యాసుతీక్ష్ణ దర్శించిపలికె
రాముఁడీయాశ్రమంబున మేము రేయి
హాయిగా వెళ్లఁబుచ్చితి మమలచరిత ! 81

తొలుతన్ నే నిటనిల్వనెంచితిని - నాతోమౌనిరాట్సంఘముల్
ఖలులున్ గ్రూరులునైన రక్కసులయంకాపొంకముల్ తెల్పి, వా
రల దుర్మానము, హింస నాపుమనికోరన్ నేను వాగ్దానమున్
లలిఁగావించితి దైత్యులంజెనక - వీలా ! నిల్వనిచోటనే 82

దండకములలోననుండు తపస్వుల
సేవఁజేయమనసు - శీఘ్రగతిని
బోవఁగోరునాకుపూజ్య ! మహర్షి ! న
న్ననుమతింపవేఁడుకొనుచునుంటి 83

అవిషహ్యంబగుఁగాదె యెవ్వరికి మధ్యాహ్నాతపంబెప్పుడున్
దివురున్ చిత్తము యాతుధానవధకై తీక్ష్ణంబుగా దండకా
టవులన్ వారలకోసమై వెదకి పట్టంబోదునిప్పట్టునన్
ప్రవణుండన్ నెలవైనఁబోయెదను విశ్వాసమ్మునన్ సంయమీ ! 84

అన్వయవర్జితులై దుష్టమార్గమం
దున నేకరించిన ధనమువోలె
నడిప్రొద్దు సూర్యుని కడుబెట్టిదంబగు
నెండదుర్భరముగా నుండుఁగాదె!
పయనమ్ముఁగావింపవలెనని తలఁచితి
నిందుల కిప్పుడే యియ్యకొనుచు
పనుపుమటంచునుఁ బ్రార్థన మొనరించి
వందనమ్మును జేసి ప్రక్కనిలువ

రామచంద్రు నక్కునఁజేర్చి ప్రేమఁబలికె
'శుభములొనగూడుగాత! విశుద్ధచరిత!
దారిపొడుగున ప్రకృతిసౌందర్యమెంతో
నేత్రపర్వమ్ముగాఁదోఁచు నిట్టలముగ 85

దండకాటవులలో నుండెఁదాపసవాటి
కలుపెక్కు - దర్శింపవలయుఁబత్ని
తో సుమిత్రాసూతితో మౌనులెంతయో
ధార్మికులును, దపోదాంతు లచటఁ
గొంతకాలంబుండ స్వాంతమ్ము పరమ ప్ర
శాంతిమై హాయిని సంతరింప
నవకాశమేర్పడు నవనిజకానంద
మునుగల్గు మునికాంతలను గలియగ

వేదపఠన, మధ్యయనమ్ము, వివిధ ధర్మ
సూక్ష్మములు, పారికాంక్షుల సూక్తులు వినఁ
గాలగమనమ్ము తెలియదు - పాలసులట
సంచరింపరు వారియాశ్రమ పదముల 86

ఈ మార్గమ్ములరిష్టము
లై మంజులశోభతోడ లాలిత్యముతో
భామారత్నము సీతను
రామా ! మీ సోదరులను రంజించు సుమీ ! 87

ఇక్కడి వనములు పువ్వుల
మొక్కలతో, కందమూలములతో, ఫలముల్
మిక్కుటమగు తరువులతో
సొక్కించును త్రోవలెల్లసొగసుగ మిమ్మున్ 88

కొలఁకులు, సారస పక్షులు
జలజము, లిందీవరములు, శఫరులు, బకముల్
కలహంసలు, కారండవ
ములు గలిగి మనోజ్ఞమై ప్రమోద మొసఁగెడిన్ 89

గిరిసానువుల నుండి క్రిందికి నురవడి
పరవడిగా జాఱు ఝరుల రవళి
శాద్వలస్థలుల విచ్చలవిడి క్రేళ్లుదాఁ
టుచుఁదోఁచు సారంగనిచయదీప్తి

అంబరమ్మున జలదంబుల వీక్షించి
నృత్యమ్ములం జేయు నెమ్ములపస
దానధారలతోడ తడిసిన గండగం
ధములతోఁ దిరుగు వేదండ సరణి

శీతలచ్ఛాయ పఱచుచు నేపఁదేఱ
పాదపములెన్నొ కలవు త్రోవలను మీకు
నడవ నలపు సొలపును గన్పడదు-మంద
మారుతము వీచు నెంతొసమ్మదము కలుగు 9(

"మఱల నిచ్చటి కరుదెంచుమా" యటన్న
యట్లై కానిందటంచని యమలమతులు
మునికి మఱలఁ బ్రదక్షిణమును బొనర్చి
మ్రొక్కి వీడ్కొని పయనమై పోవఁగోర 9

ఆశుగములు, ఖడ్గములు, శరాసనములు
రాఘవుల కప్పుడందించె రమణిసీత,
వారు వానినిఁజేకొని వనితఁగూడి
తాపసాశ్రమ వాటికి తరలిరంత 9

హృదయాహ్లాదము గూర్చు దృశ్యములనెన్నేఁ గాంచి రథ్యమ్మునన్
గుహపస్వారల - పుష్పముల్, ఫలములున్, కుప్పించు సారంగముల్
మదభృంగమ్ములు, వాఁగులున్, గిరులు, పద్మమ్ముల్, మయూరంబులున్
బొదలన్ దన్మయతన్ భజించి రెలమిన్ పొంగింపగామేనులన్ 9

పతివెంట నరుగు జానకి
కుతుకముతో నేదొ చెప్పఁగోరిన రీతిన్
మతిమంతున కనిపించిన
నతిప్రేమముతోడ నడిగెనది యేమనుచున్ 94

అంతకుమున్ను రామ హృదయంబున వెల్గిన వెన్నొసంగతుల్
చింతలు దూరమయ్యెను - ఋషి ప్రకరమ్ములఁగాంచ, వారి కొ
వంతయు స్వార్థమెయ్యెడల నాతనికిన్ గనిపింపకే మన
స్సంతయు సర్వభూతహిత మందున లగ్నముకాగఁ ప్రేమడిన్ 95

పౌరుల గుండెలందుఁ దనపట్ల నొకానొక ప్రేమయుండె నా
ధోరణివేఱు - సంయముల ధూపితచిత్తములందుఁ గల్గు సం
ప్రేరణలో చెలంగు దయ, ప్రీతియు వేఱుగఁ దోఁచఁదన్మయుం
డై రఘురాముఁ డావిలువ నాత్మగతంబుగనెంచె నార్ద్రితన్ 96

పులకిత బ్రహ్మపథములఁ బోవునతఁడు
సీతచూపుల నర్థమ్ముఁ జేసికొనుచు
'జానకీ! చెప్పుమనగ నా సారసాక్షి
హృదయ మెఱిఁగించె నాథుని కివ్విధముగ 97

అనఘా! నాహృదయమ్మును
బెనఁగొని యొక సందియమ్ము పీడించు ననున్
మునిధర్మము నెరపుటయన
ఘనమగు - నిగ్రహముఁ జింత కావలెఁగాదే! 98

మీకుం దెలియని ధర్మము
వాకొననేనెంత! జ్ఞప్తిపఱచెదనంతే!
మీ కాగ్రహమ్ము సుంతయు
రాకుండగ మనవిఁజేతు రఘువంశమణీ! 99

ధరణిజ మాటల రాముఁడు
దరహాసము వదనసీమఁ దార్కొన సీతా!
పరిహాసముఁ జేసెదె? యిది
వఱకెన్నఁడు విగ్రహించు వైనము లున్నె? 100

ఎన్నఁడు ధర్మమ్మునకున్
భిన్నముగా నడచినట్టి విధము కలుగునే?
అన్నా! తెలుపుమదేమో
మన్నింపగలేద నీదు మాటల నెపుడేన్? 101

ప్రతి సౌమ్యముగాఁ బలుకగ
నతివ వెఱపు నుజ్జగించి యాత్మజ్ఞునితో
నతిమృదువుగఁ దన మదిగల
సుతిమెత్తని సంశయమ్ము సూటిగఁ దెలిపెన్ 102

రూపిత ధర్ముండవై పృథ్విజనియించి
వెలుఁగొందు మీకన్న వేత్త యెవరు?
మహనీయులగుదురు మాన్య! ధర్మమ్ముల
వింగడింపగఁ జాలువెలఁది నగుదె?

కొని చాపల్యము కలదు మీతోఁజెప్ప
        వలెనంచు క్షమియింపవలెను నన్ను
కామజదోషముల్ కలవు మూఁడని పెద్ద
        లందురు - వానిలో ననృతభాష

ణమ్ము, జారత్వమును, కారణమ్ములేని
వైరమును దొసఁగులంచును వక్కాణింప
నెఱుఁగుదురు జగతిలో నివి యెల్లవారు
తలఁపునకుఁదెత్తు వాని నీ తరుణమందు 103

సూనృత వచనమ్ము లేనాఁడుఁ బల్కెద
        రనృతదోషమ్ము మిమ్మంట దెపుడు
పరదార సంగమం బెఱుగరు కలనైన
        విజితేంద్రియులు మీరు - వికృతిలేదు
ప్రతినఁ బూనితిరి నిరాబాధముం జేయ
        రాక్షస సంహార దీక్షతోడ
కలుగదు కుశల మకారణవైరము
        నూనిన - కావున మానుఁడమ్మ

చరిత! బాణశరాసముల్ సాహసికుల
కగ్నికిన్ సమిధ లట్టుల నగును గాన
నొక్కతార్కాణమున్నది వక్కాణింతు
ననుమతి నొసంగితేని నే మనవిచేతు 104

కలఁడు తపస్వి యొక్కరుఁడు కోసల నుగ్రతపమ్ముఁ జేయువాఁ
డలజడి హెచ్చె స్వర్గమున కాతఁడు రాజగునేమొ యంచు వే
ల్పులదొర, యూసుతాఁడు భటరూపముతోఁ జనుదెంచి ఖడ్గమున్
దలకొని తెచ్చి మౌనికడ దాఁచెను - వచ్చెదనంచుఁ జెప్పుచున్ ॥

అమ్మునీంద్రుని తపము భంగమ్ముసేయ
నాకలోకాధిపతి ప్రయత్నమ్ము సలిపె
పాపమాసంయమికి నంతుపట్టదేమి
సాత్త్వికుఁడు, సత్యరతుఁడు, వంచన నెఱుఁగఁడు ॥

ఎంతకును రాక పోయె నాగంతుకుండు
మౌని తటతటలాడె నెమ్మదినిఁ బెలుచ
పరులు ముచ్చిలించెదరన్న భయముతోడఁ
గనుకనుచు దృష్టినిల్పె ఖడ్గమ్ముపైని ॥

ఫలమూలమ్ములకై వనమ్మునకుఁ బోవంబూను ఖడ్గమ్ముతోఁ
దలపై బాధ్యత వచ్చి పడ్డటులఁ ద్రస్తస్వాంతుఁడై పోను పో
సు-లలిన్ గూర్చుకొనెన్ బ్రయత్నమున నెంతో-కత్తితోఁ ద్రుంచుఁ ద్రో
వల కష్టంబగు కంపలన్ లతల స్వాభావ్యమ్ము మాఱన్ స్థితిన్ ॥

శస్త్రధారణ మొనరింప సహజముగను
మార్పు వచ్చును - మునిలోకమాన్యుఁడైన-
సత్త్వగుణమేఁగె నెటకో - ఆశ్చర్యముగను
స్థిరపడె రజోగుణమ్ము మూర్తీకరించి ॥

తపము లుడిగెను నేకాగ్రతయు నశించె
జాతె సహన ముక్కివమెంతొ మీజె మునికి
పతన మయ్యెను సంయమి - పాకవైరి
వాంఛనెఱవేతె శస్త్రమ్ముఁ బట్టుకతన 11

ప్రాణిహింసకు నలవాటుపడె నతండు
దాని ఫలమున నరకమ్ము తప్పలేదు
ఈధనుర్బాణముల పనియేమి మీకు
నిరపరాధుల నెటుల దండింపగలరు ? 11

ఆయుధమ్ములఁ గలిగిన నాత్మవిదులుఁ
గూడను బ్రలోభబుద్ధితోఁ గుతిలపఱుప
నత్సహింతు రశక్తుల నురక దానఁ
బాపమొడిఁగట్టు కొందు రాపదలఁ దెచ్చి 1

జ్వలన సన్నిభమైన నీశస్త్రధార
ఱమున నిర్దోషులను నొంప న్యాయమగునె?
మీయెడల గల్గునభిమానమే యిటువలె
తెలియపఱచెను - ధర్మమ్ముఁ దెలుప గాదు 1

వనవాసుల్ కద మీరు తాపసుల తేవంగాలముం బుచ్చగా
ననుపౌకాని యిటుల్ శరాసనము లాయత్తంబులై యుండ మా
ర్గణముల్ సిద్ధముఁ జేసికొంచు దిరుగన్ రారాపిడుల్ వచ్చుఁగా
వునఁ బ్రార్థింతును మిమ్ము నస్త్రముల తీవుల్ వీడ సంవిత్తిమై 1

మీరు పురుషులు - నేనేమొ మెల త నగుదు
నేదియో చెప్పుచుంటినం చే విధముగ
నెంచకుండు - నాయెడంద పేధించు విషయ
మిదియె - యోచింపు( దొకపరి సదమలాత్మ ! 115

వైరమేమిలేదు వారికి మీతోడ
నింతవఱకు నసుర లింకపైని
మిగుల కోపమూని, పగ(బట్టి వత్తురు
కారణమ్ములేవి కలహమేల? 116

అడవులను ముని వృత్తితో నమరి, పురిని
జేరి మీక్షాత్రధర్మము, చిక్కదనము(
జూపసాంప్రతమౌ కాని కోపమేల?
దండనార్హులె దానవుల్ తప్పులేక ? 117

వనముల( దపస్వి వృత్తియె
యనువగు - నది పెద్దలందఱభినందింపం
గను ముదము(గల్గు - ధర్మా
ర్జనముం గావింప సుఖము, శాంతియు దక్కున్ 118

నా మాటల మన్నింపుడు
క్షేమమ్మగు నరణి( బోవకే దైత్యులతో
నీమార్కి వైరమూనుట
ప్రామాద్యముకాదె! మంచి పనియే చేపుడీ! 119

దండకారణ్య మునులకు దానవులను
జంపి రక్షింతునని ప్రతిజ్ఞంబొనర్చి
నేలఁ బోయెడి దానిని నెత్తిపైకిఁ
దెచ్చికొనవమేలె? మీపైకి వచ్చినారె? 120

ఆర్తరక్షణముం జేయునపుడు క్షత్రి
యుండు శస్త్రములన్ పూనుట యుండుఁ గాని
ఊరకే కారణములేని వైరమేల?
నిరపరాధుల శిక్షఁ ప నీతియగునె? 121

జానకి మాటలన్ వినిన సారసనేత్రుఁడు నవ్వి తిన్నగన్
మానితమైన బోధనము మాటఁదలంచుచు సంతసించుచున్
మానినిఁగాంచి పల్కె 'ఋజుమార్గముఁ జెప్పితి వర్మిలిన్ హితం
బేనుగణింతు మిన్నగ నిదే కరణీయము నాకునున్సుమీ! 122

జనకనృపాలు పుత్త్రివలె చక్కఁగఁ జెప్పితి విట్లు సీత! నీ
మనసు నెఱింగితిన్ - హితము మామక మానసమందు నెంచెదన్
మునిజనరక్షణమ్మనఁ బ్రభుత్వపు బాధ్యత సుంతలేదె? కా
దన నిఁక నేమిపల్కెదఁ బ్రయత్న మొనర్చుట దోషమే ప్రియా! 123

గాదిలి! అనుకూల్యమును గల్గను దావక భాషణమ్ములన్
కాదన బోవ-క్షత్రియుఁడు ఖడ్గము, విల్లు ధరించు నార్తులం
దాదరబుద్ధిఁగాఁచుసమయంబుల - నా కెలసంబదే ; మఱే
చీఁదఁబరాదు దీనిఁబరిశీలన నేయఁబ్రవర్తనంబునన్ 124

ఊరక దుఃఖపెట్టుటకు నుక్కివ మేమియులేదు - మౌనులన్
గ్రూరనిశాటు లెన్నొయవరోధములన్ సమకట్టి హింసలన్
ఘోరముగా నొనర్పఁదమకున్ సుఖశాంతులు మృగ్యమై వ్యథా
భీరువులౌచు నాశరణువేఁడగ మిన్నక నిల్వ భావ్యమే ? 125

శాపానుగ్రహశక్తు లామునుల కిష్టాపూర్తముం జేయ నా
క్షేపం బుండునె ? వారి యజ్ఞముల భంగింపంగ యత్నించు దు
ర్వ్యాపారుల్ మఱి ఘాతుల్ భువికి భారం బౌదు రాదుష్టులన్
నైపన్ క్షేమము కాదు - సర్వులకు దేశవ్యాప్తమౌ కష్టముల్ 126

తమ తపశ్శక్తితో మునుల్ దానవులను
భస్మమొనరింప నోపియు పరమ శాంతు
లగుచు శాపమ్ము నీయరు - వ్యర్థ మగును
హితముఁ గూర్చు తపఃఫల మేదుననుచు 127

నన్నుద్ధర్తగ నెంచి మౌని జన మానందించె నన్గాంచి, యా
పన్నమ్ముల్ కద దండకమ్ము లట సంప్రాప్తించు కష్టమ్ము నీ
సాన్నిధ్యమ్మున వచ్చి చెప్పగ నపేక్షన్ నేను వాగ్దానమున్
బన్నన్ ధర్మము కాదటంచుఁ బలుకన్ వైదేహి ! విక్షోభమే ! 128

నన్నర్థింపక పోయినన్ మునులు నేనై వారిఁ గాపాడగా
నన్నద్ధుండుగ నుంటి - క్షత్రియుఁడు విశ్వాసమ్ము ధర్మమ్ము నం
దున్నన్ శత్రునిబర్హణమ్మునకు నుద్యుక్తుండుగా నుండు, వం
శౌన్నత్యమ్ము గణించి నేఁ బ్రతిన సేయన్ నన్ను వారించెదే ? 129

తరణి కులమున జన్మించి ధర్మమునకుఁ
గట్టువడి మునుల కిడిన వాగ్దాన భంగ
మెటులఁ జేయుదు ? రక్షింతు రెవరు వారి ?
లోకధర్మము గతి యేది ? లోఁగుఁ గాదె ? 130

జ్ఞానోపాసనఁ జేసి యోగివలె మోక్షప్రాప్తికై జీవితం
బేనో దూరునిగా గమింపఁ గలనే యేవైరముల్ లేకయే ?
నేనో క్షత్రియజన్మమెత్తితిని మౌనిత్రాతసంరక్షణం
బీనాపైఁగల దింక దానవుల శిక్షింపంగ నన్యాయమే ? 131

నాగమ్యము నీవెఱుఁగవె ?
ఆగమ్మును జూచి దూరమందున నిలువన్
బాగుగనుండునె ? సాగవు
యాగమ్ములు దనుజకోటి యాగడములతో 132

జ్ఞానమునకు, యజ్ఞములకు
మౌనులకున్ రక్షసేయ మానిన యెడలన్
దానవులు విజృంభింపరె ?
మానప్రాణములు పోవె ? మాతొడ్డవరెన్ 133

అసుర ప్రవృత్తులను నే
పీసము కరుణింపరాదు - పీరుఁడనగుచున్
మోసముల సాగనిచ్చిన
దోసమ్మది నాది యరులఁ ద్రుంచక యున్నన్ 134

శరణము వేఁడిన మునులను
దరిఁ జేర్చుచు నభయ మీయఁదగు - విప్రులకున్
నిరతము రక్షణ నిచ్చిన
విరివిగ క్షేమములు కలుగవే పరికింపన్ 135

నా సహధర్మచారిణివి - నమ్రతతో పతిమార్గ మందునన్
శాసనమట్లు పోవలయు సందియముల్ విడనాడి యెంతొ వి
శ్వాసముతోచరింపవలె జ్ఞానము, ప్రాణము రక్షసేయుటల్
దోసములౌనె ? నాహృది ప్రతున్నమె యయ్యెను నీ ప్రసక్తితో 136

అయిన నీ మాట మేరకు నవనిపుత్రి !
ధర్మము, నధర్మమును జూచి ధనువుపైని
చేయిపైచి ప్రయోగమ్ము సేయు వాఁడ
నిరపరాధుల నెపుడు దండింప నేను 137

అది తప్పట నాయెడఁ గూడ దెపుడు
ప్రాణములనైన విడిచెద - పడతి ! కడకు
నెరప శపథము లక్ష్మణు, నిన్నుఁగూడ
సంశయింపక వీడెద సత్యమునకు 138

అని వచించుచు శ్రీరాముఁడరుగుచుండె
నతని వెనుక సుమధ్యమ యైన సీత
ఆమె వెంట ధనుష్పాణి యగుచు లక్ష్మ
ణుండు వరుసగఁబోవుచు నుండ సరణి 139

కనువిందు సేయు చక్కని శైలప్రస్థముల్
ఎదురుగాఁ బ్రవహించు నదులు - కప్పు
రపురాసులట్లున్న రమణీయసైకత
స్థలులు, చక్రమ్ములు, సారసములు
మధువులు చిందు పద్మములు, కల్హారముల్
సరసులు, జలపక్షిసముదయమ్ము
మందలఁ జరియించు మహిషముల్, వనవరా
హములు, ప్రాకెడి లేలిహానచయము

కొండకొమ్ములఁ గోరాడు కుంజరములు
దారి కిరువైపులన్ ఫలభారతరులు
నయనపర్వమ్ముగా నుండ నడచి చేరి
రొక కొలఁకు దాశరథులు - సూర్యుండుఁ గ్రుంకె 1

ఆ తటాకము యోజనాయతము, నుత్ప
లములు, పద్మముల్ స్వాదుజలమ్ములుండి
హంస సారస కాదంబ హారి పక్షి
సంకులము - గజములతో నలంకృతమ్ము 1

సత్కవి కవిత్వమట్లు ప్రసన్నమధుర
ములు సరస్సునగల్గు నంబువులు - వింత
గీత వాదిత్ర ఘోషముల్ శ్రోతలకు న
మేయహర్షమ్ము సమకూర్చి హాయినిచ్చు 1

అవి సరస్సున వెలువడినట్టి ధ్వనులు
కాని మనుజులు కనరారు - కారణమ్ము
నెఱుఁగ ధర్మభృతుండను ఋషిని గాంచి
వివర మడుగ రామునితోడ స్థవిరుఁడనియె 143

పంచాప్సర స్తీర్థమంచు నీ సరసిని
బిలుతురు రఘురామ! సలిలమిందు
సార్వకాలికముగా శ్వ్రేయసమ్ముగా
హవణిల్లుఁబాంథుల కామెతలిడు
మాండకర్ణిమహర్షి మహిమాన్వితుఁడు సృష్టిఁ
గావించె నీ తటాకమ్ము నిచటఁ
దనతపోబలము పేర్మిని - పెక్కు వేలేండ్లు
వాయుభక్షణఁజేసి, వారినిల్చి

వేధకై తపము సేయగ వెఱచి దేవ
తలు పరువులెత్తి మఘవునిఁ దరిసి మౌని
యింద్రపదవిఁ బొందగఁ బ్రయత్నించుచుండె
నని నివేదన మొనరింప నతఁడు జడిసి 144

అచ్చర లైదుగురను ముని
మచ్చిక పడఁ దపముఁ జెఱుప మాత్సర్యముతో
నచ్చటికిఁ బంపె సురపతి
ముచ్చటపడె మాండకర్ణి ముదితలఁ గాంచన్ 145

మవ్వపు తీవలు, మారుని
పువ్వుల బాణములు, మెఱపు పొలుపులు కాంతుల్
జవ్వనము పొంగు కాంతలు
కవ్వింపగ మాండకర్ణి కరఁగె వలపులో 146

అప్సరలు భార్యలైరి సంయమికి - వారి
కతఁడు నిర్మించె నైదు గృహమ్ములే జ
లాశయమ్మున యువకుఁడై యలరుఁబోఁడు
లును, మహర్షియుఁ గ్రీడింతు రనవరతము 147

వేల్పునాగవాసమ్మున వేడ్క సతము
నిత్య సంగీత నృత్య సాహిత్య సరణి
మాండకర్ణి విలాస కామ్య ప్రసక్తి
మునిఁగి తేలుచునుండు నామ్రోత యదియె 148

మధుర సంగీత శబ్దముల్ మాండకర్ణి
భవనములనుండి నిశలందు వచ్చు ననిన
వదనమున నలఁతి నవ్వు కన్పట్ట రామ
భద్రుఁ డంతట తబిసితో పలికె నిటుల 149

మాండకర్ణి మునీంద్రుఁడు మహిమఁ గలిగి
తపము నొనరించె ఘనముగ తరుణులకయి
కప్పురంబును బెట్టి తా నుప్పు గొనియె
రత్నముల నిచ్చి రాగిపాత్రల గ్రహించె 150

ప్రారబ్ధమ్మది పాశరూపమున చిత్రంబైన మార్గంబులో
నారాటమ్మునుఁగూర్చి త్రిప్పు భవితవ్యంబున్ బ్రతారించుచున్
చేరెన్ పాపము! మాండకర్ణి వనులన్ సిద్ధింప నింద్రత్వమున్
మాదెన్ జూడగ నప్సరోగణము సమ్మానమ్ముతోఁ జుట్టగన్ 151

ఇది యంత తపోవ్యయమునఁ
గుదిరెన్ సురకార్యసిద్ధిఁ గూడ నమరగన్
బదపడి తీర్థము, స్వార్థము
ముఖమున సమకూడెఁ గాదె ముని, కింద్రునకున్ 152

కుశచీరపరిక్షిప్తము,
నశంకితము, నందమైన యాశ్రమ సీమన్
నిశ నాతిథ్య మొసంగెను
వశి ధర్మభృతుండు భక్తి వారి ముగురకున్ 153

అటనుండె మఱికొన్ని యాశ్రమ పదములు
నామునుల్ ప్రేమతో రామచంద్రు
ముందునకేఁగ నామోదమ్ముఁ జూపక
నిలిపిరి తమ తమ స్థలములందు
వారి మహత్త్వముల్, వారి చారిత్రము
లాశ్చర్యమున నాతఁ డాలకించు
వారితో వసియించు వైనమ్ము రెఱుఁగుచు
సంచార మొనరింప సాగ దినము

లును, నెలలు, వత్సరమ్ములు వెనుక పడెను
నిండు పది వర్షములు రాము డుండె నచట
మునుల కడ సెలవుఁ గైకొని మువ్వురరిగి
రా సుతీక్ష్ణుని దర్శింప నాశ్రమమున 154

క్షేత్రాటనమ్ము వలనను
క్షేత్రావాసమ్ము కతన జీవితసరణిన్
ధాత్రీకుమారి రాము ప
విత్రంబగు యభయదానఫలము నెఱింగెన్ 155

పేరులోఁగల తీక్ష్ణత తీరులోన
లేదు - ధృష్టత్వమునుఁ గూడ లేదు మునికి
అతనిలోనున్న తీక్ష్ణతయతని వ్యగ్ర
నియమముల, చేయు తపములనే కనఁబడు 156

నామము సుతీక్ష్ణుఁడయ్యును నయచరిత్రుఁ
డతఁడు - రాముని త్యాగమ్ము నరసి మనసు
నందు నార్ద్రత లఱలఱలాడె ఘోర
వనములన్ సంచరింపఁ దాపసుఁడువోలె 157

రామాలింగన సౌఖ్యము
నోమె సుతీక్ష్ణుండు దర్శనోత్సుకుఁడగుచున్
తామరసనేత్రు దర్శన
మే మిక్కుటమౌచు నిలిపె మేదినిఁ దబిసిన్ 158

తనప్రవాస కాలమ్మున ననఘు డొసఁగె
నక్కునంజేర్చు భాగ్యము నామహర్షి
కొక్కనికె - ఆతపశ్శాలి యుద్భటుఁడని
అతని యెడ రామచంద్రుని కమితభక్తి 159

కనుల వత్తుల నిడుకొని మునివరుండు
మహితు దర్శింప మరల - నీమహిని నిలిచె
బ్రహ్మలోకము కన్నను రామదర్శ
నందె ఘనమంచు భావించు సంబరమున 160

కొన్ని దినమ్ములుండె మునికోరికపై రఘురాముఁడచ్చటన్
మన్ననఁ జూపుచున్ బలికె మాన్యునిఁ గాంచుచు నొక్కనాడు నా
విన్నపమొక్కటుండె - కడువేడుకయయ్యె నగస్త్యుఁజూడ వ్యు
త్పన్నుని దర్శనమ్ము బహుధా శుభదంబగు - దారిఁజూపుఁడీ ! 161

విన్నాము దండకమ్ముల
నున్నారని వార లెచట నున్నారొ దయన్
నన్నుఁ గృతార్థునిఁ జేయగఁ
దెన్ను నెఱింగింపవలె సుతీక్ష్ణమహర్షీ ! 162

జలజనేత్రుని వాంఛకు సంయమీంద్రుఁ
డనియె నీరీతి తరణికులాబ్ధిసోమ !
నీవవశ్య మగస్త్యుని సేవఁదృప్తి
పఱుపవలె - దాననెంతొ ప్రాభవము కలుగు 163

ఆయుష్మంతుఁడ ! నీ కగస్త్యముని పాదాంభోజసంపూజనం
బే - యిష్టాపరిపూర్తిసేయు - కడుదాపే యాశ్రమం - బాఁపగన్
గాయీయాశ్రమమందుఁగొంతవడిసేనై తెల్ప శంకించితిన్
బేయున్ సాయము పోయి చూచినయెడన్ సిద్ధుండు పూజ్యుండు తాన్ 164

చక్కని యభిలాషము నీ
విక్కరణి వచింప - నతిథి వీవిట - నేనై
వక్కాణించుచు నవలకు
నెక్కరణింబంపువాడ సిద్ధచరిత్రా ! 165

నాల్గుయోజనముల్ పోవ నలిననేత్ర !
అగపడు నగస్త్యసోదరు నాశ్రమమ్ము
పిప్పలీతరుశోభితవిపినమధ్య
మందు ఫలపుష్పసురభిళంబై రహించి 166

ఆ మహర్షి యుతథ్యనామాంకితుండు
కడు తపశ్శాలి - వేడుకపడును మిమ్ముఁ
జూడ నొకరాత్రి నిలుపుడు చూడఁదగిన
సంయమీంద్రుడు - మఱునాడు సాగి పొండు ! 167

అచటి కామడ దూరమునందు కుంభ
సంభవు ప్రశాంతమైన యాశ్రమము కలదు
వివిధతరుసంవృతంబుగ, వివిధపక్షి
మృగగణమ్ములతో మీకు వేడ్కసేయు 168

సీతాదేవికి నచ్చుటి
వాతావరణమ్ము నలఁత వాపుచు నెంతో
ప్రీతింగూర్చు - శుభంబగుఁ
గాక ! పదేండ్లయ్యెనపుడె కాననములలో 16

అంతేవాసిని మున్నుఁ బంపి మునిలోకారాధ్యు దర్శింప శ్రీ
మంతంబయ్యెడి సభ్యనుజ్ఞఁ గొని, యా మాన్యుండు ధ్యానమ్ములో
నెంతోకాలము నిల్చుఁగావున నిరీక్షింపంగ శ్రేయస్కరం
బాంతర్యమ్ము గ్రహింప మేలగునుఁగాదా ! పెద్దలం జూచుచో 17

ఆతఁడు దుర్నిరీక్షుఁ డసురాంతకుఁ డాఁకిడు వింధ్యశైల గ
ర్వాతిశయమ్ము మాపె - పరమార్థమునందె మనస్సు లగ్నమౌ
ద్రాఁతిగ - నిత్యలోకహితభావ్యునిగా మసలున్ సముద్రమున్
బ్రీతినిఁ దృప్తితో పుడిసిలించె నగస్త్యమహర్షి శక్తిమై 17

అగము నడఁచి యగస్త్యుఁడు జగములందు
వార్తకెక్కెనుఁ బేర్మి నన్వర్థనామ
ధేయునిగ - భూతహితమునే ధ్యేయమనుచు
మహితుఁడెంచును నిరతమ్ము మమత తోడ 17

ఆ మహాత్ముని యాశ్రమ మందు సతము
రమణ మసలును జాతివైరముల మఱచి
సకలజీవులు నిర్భయోత్సాహగరిమ
సంచరించునుఁ గ్రౌర్యమ్ము సమసిపోవ 173

దశరథుఁడా ప్తమిత్రుడు కదా ! మునిపుంగవుఁడీవు పోయినన్
భృశము ప్రహృష్టచిత్తుఁడయి పెంపు వహించు నపేక్షతో, నటన్
బిశసుల బాధలేదు - ఋషి పీఁచ మడంచు నటన్న భీతితో
మశకములట్లు ద్రిమ్మరెడి ప్రమాదముఁ దప్పఁ జరింప రయ్యెడన్ 174

ఏ కైలాటము సాఁగ బోవ దసురుల్ హింసింపగా లేరు - ని
ర్భీకుండా మునిమౌళి నామమె ప్రవర్తిల్లున్ భయోత్పాతమై
ఆకర్ణించిన యంత మాత్రమున సింహ స్వప్నమై గుండెలన్
పోకిళ్లన్ విడినాడి చాయలకు 'నబ్బో' యంచు రారెవ్వరున్ 175

పావన చరితా ! సన్నిధి
లోవివశత నుంటి నేను - లోపాముద్రా
దేవీసహితు నగస్త్యుని
సేవించి కృతార్థుఁడగుము - చెలఁగు శుభమ్ముల్ 176

పరమునకు రామచంద్రుఁడు, ధరణిజాత
పరమభక్తిని పాదాభివందనములఁ
జేయ, సౌమిత్రియుంగూడఁజేసెనటుల
పోయి వచ్చెద మనిచెప్పి పూజ్యునకును 177

మంచిది - పోయి రండనుచు మాన్యుఁడు వారల సాగనంపుచున్
నించెను బాష్పముల్ విడువనేరకకన్నుల - రాఘవేంద్రుఁడా
మంచితనమ్ము, నార్ద్రితను మన్ననఁజేయుచునే కృతజ్ఞతో
దంచితవాక్యముల్ పలికి తాపసి వీడ్కొనియేఁగె పైనమై 178

ప్రకృతి దృశ్యముల్ రమ్యమై పరిఢవిల్ల
పథము లందున పయనించు వారలకును
నడచినటులేదు - మార్గమ్ము గడచె - నొక్క
యోజన మ్మేఁగ నాశ్రమ మొండు తోఁచె 17

అందుండున్ మునిస త్తముండగు నగ స్త్యభ్రాత - తత్ప్రాంతమా
నందంబున్ గలిగించు నందములతో నాకంబునే మించుచున్
బొందమ్ముల్, ఫలవృక్షముల్, హరిణముల్, పుష్పమ్ము, లాశీరముల్
కందోతమ్ములు పెక్కుచందముల నొక్కంజేయు స్పందించుచున్ 18

మాదకమ్ములు కుసుమంబు లెన్నడుఁగావు
నెగడుప్రసన్నములగుచు నెపుడు
మారుతమ్ములు కూడ మందసంచారముల్
వేగమ్ముగా గాలి వీవ దెపుడు
పలభారసన్నతమ్ములు వృక్షములు కాని
ఫలశూన్యతరువులు వఱల వెపుడు
పిప్పలమ్ములు పండె విరివిగాఁగటుకోద
యములైన గంధము లమరు నెపుడు

అనుఁగుఁదన మెల్లయెడలఁబ్రత్యక్షమగును
మునులు తీర్థమ్ములంగ్రుంకి పుష్పచయము
స్వయముగా సేకరించి దైవముల కర్చ
నముల సేయగ నచట శాంతత భజించు 18

కనిపించె నటనట కాష్ఠసంచయములు
సంచితంబైన వాశ్రమము నందు
గుట్టలుగుట్టలై - కుశలువై దూర్వవ
ర్చసములై తోఁచెను - సాగ ముందు
నకు చెట్లగుంపులో నల్లని మేఘమ్ము
లటుల ధూమాగ్రము లగపడెనట
చల్లగానుండె ప్రసన్నమనోహరం
బై యుతథ్యని యాశ్రమంబు - రాముఁ

డనుజానింగని పల్కె 'లక్ష్మణ ! సుతీక్ష్ణ
మునివచించిన పోలికల్ సుదము నిచ్చు
కనులపండువుఁగాగ నగ స్త్యసోద
రుండు నిలిచిన తావుగా నుండె నిద్ది ! 182

మన కగస్త్యుని చరితంబు మహితుఁడైన
నాసుతీక్ష్ణమహర్షి కొంతవగతమ్ముఁ
జేసె - మఱికొంత కలదేను చెప్పువాఁడ
వినుము దానవసంహారవిపులగాథ ! 183

ాతాపీల్వల రాక్షసద్వయము పూర్వంబుండి క్రూరమ్ముగా
హింపంగను బ్రాహ్మణమ్ములయి వక్కాణింప నాసంగతుల్
తింగొందఱు కుంభసంభవునకున్ విక్షోభముం బాపగా
తిథ్యమ్మును స్వీకరింప జనెఁదానై వారి స్థానంబునన్ 184

బ్రాహ్మణులను వారు భక్షించు పద్ధతి
　　విపరించెదను నేను వినుము - విప్ర
వేషమ్ముతో యడవిం జేరి యిల్వలుఁ
　　డామార్గమునఁబోవు నవనిసురుల
పితరుల శ్రాద్ధమీవేళ భో క్తలు మీర
　　లంచు నాహ్వానింప నతని నమ్మి
వారలు వచ్చిన వాతాపి మేషమై
　　వధియింపఁబడు - వానివండిపెట్టి

భూసురులు తృప్తి భుజియింపఁబోలుసుదిండి
పిలుచుఁదమ్ముని - వాతాపి వెడలివచ్చు
దేహములఁ జీల్చికొని పైకి దితిజులంత
వారిఁదినెదరు సాగె కాపట్యమిటుల 18

బ్రాహ్మణకుటుంబములు పెక్కురాక్షసులకుఁ
జిక్కి కూలెను లెక్కకు మిక్కిలగుచు
వారిదుష్కృత్యముల నాపు వారులేక
సాగె నీ కుటిలవృత్తి దుస్సాధమగుచు 18[illegible]

ఇల్వలుఁడు కుంభసంభవుఁ బిల్వ మునియు
నరిగె భోక్తగ వాతాపి ననుజుఁ జంపి
వండి వడ్డింప నెప్పటి వలెను జటికి
తిని మునీంద్రుఁడు గజ్జునఁ ద్రేఁచె నంత 18[illegible]

జీర్ణమగు గాత ! వాతాపి జీర్ణమగును
గాత ! యని యుదరంబుపై కరము తోడ
నవరచేయ మి మ్మోఱు రాక్షసుఁడు జీర్ణ
మయ్యె - నిల్వలుఁడెలుఁగెత్తి యనుజుఁబిలిచె 188

తమ్ముఁడెక్కడ నుండెను ? తబిసి కడుపు
నందు జీర్ణమై పోయె - సంయమి వచించె
దరహసిత వదనుఁడగుచు "తమ్ముఁడింక
రా"డనగ నిల్వలుండు నిరాశనందె 189

పడె మునిపై కోపమ్మున
నుడుకుచు నిల్వలుఁడు వైరమూనుచు - మౌనిం
ద్రుఁడు నాగ్రహమునఁ జూడగ
పిడికెడు బూడిదగ నయ్యె వీక్షణ వహ్నిన్ 190

...టులారక్కసులిద్దఱిన్ జిదిమె మౌనీంద్రుండు నాదెబ్బతో
...టు పై పెవ్వరు రారు దానవులు హింసింపంగఁబూతాత్మనిన్
...టువుంజూచిన జన్మలున్ బడగుసాఫల్యమ్ములై - మున్నికొ
...టినిన్ చెప్పి సుతీక్ష్ణుఁడెంతొ వివరించెన్ మౌని కార్యమ్ములన్ 191

మృత్యువునుఁగూడ నతఁడు జయించె నసుజ !
ఔర్వశేయుఁడు మునుపె మహాతపస్సుఁ
జేసి దక్షిణ దిక్కున చింత దక్క
మునులు నివసింప నవకాశమును సృజించె 192

భూవానుకంపచే నిటు
లా తాపసి నిర్వహించె నాపని - దరికిన్
భీతిం జేరరు దనుజులు
భ్రాతయగు నితం డగస్త్య భగవానునకున్ 193

భాస్కరుఁడు పశ్చిమాంబుధి వ్రాలె - నన్న
దమ్ములును సంధ్యవార్చిరి - తదిసిఁ జూచి
ప్రణతు లర్పింప సంతోషపడుచు మౌని
దీవెన లొసంగి వారి కాతిథ్య మిచ్చె 194

రాత్రి కచ్చటనే నిల్చి రామచంద్రుఁ
డా ఋషికి మ్రొక్కి పల్కె మీ యన్న కుంభ
సంభవుల దర్శనంబును సలుప వలెను
ధన్యులము వారి యాశ్రమాధ్వమ్ముఁ దెలుప 195

పరమ సంతోషభరితుఁడై వారి కతఁడు
త్రోవలను వింగడించి వాక్రుచ్చెఁ బ్రీతి
దారిఁ బట్టిరి వారి కధ్వమునఁ దోఁచు
నంద మింతంతఁ గాక యానంద మిచ్చె 196

తరణికులులకు రెండు నేత్రములు చాల
కాప్రకృతి సౌందర్యము నభినుతింప
నడుగు ముందునకుం బడ దచ్టై నిలిచి
దర్శనీయమ్ముగా నుండఁ దరలి రెటులొ 197

ఆటఁ బరిశ్రాంతశ్రమాపనయనమైన
ఆశ్రమమ్మగపడె నద్భుతముగ
అది యొక ప్రాజ్యధూమాకులవనమగు
చీరమాలాపరిష్కృతము సరవి
నానాపతంగ నినాదితమునుఁ బ్రశాం
తమృగయూథసహిత సమదికమ్ము
దక్షిణ దిక్కున తపసియౌ కుంభసం
భవుఁడు చేరిన దాది భయము తొలఁగె

దానవుల వల్లఁ గలుగు బాధలు సడంగె
సర్వభూతహితంకరుఁ డౌర్వశేయుఁ
డవని మునిలోకవంద్యుఁడై యవిరతముగ
లోకకల్యాణ మెంచు సుశ్లోకుఁ డగును 19

గర్వించి సూర్యమార్గము నధిరోహింపఁ
బెరిగెను వింధ్యభూధరము మున్ను
అతని దుర్మాన మణప నెవ్వరికి సా
ధ్యము కాకపోయె నా తరుణ మందుఁ
జటులాంధకారసంఛన్నమై జగతి క
కాలప్రళయ మట్లు కానిపించె
ప్రార్థింప కుంభసంభవుఁడు జాలిఁ దలంచి
తా నుదీచి నుండి దక్షిణమున

కేఁగుదెంచెను - వింధ్యమ్ము సాగి మ్రొక్క
నా యగస్త్యమునీశ్వరుఁ డతని తిరిగి
తాను వచ్చెడి వఱకల్లె తగ్గి యుండ
నానవెట్టెను - మౌని పోఁడయ్యె మరల 199

తెగువతో మౌని మాట నతిక్రమింప
ధైర్య మూనక యటు లుండె ధరణిధరము
లోకసంక్షోభమును మాన్పి లోకపూజ్యుఁ
డరితి భగవానుఁ డార్తుల కాప్తుఁ డగుచు 200

సానుక్రోశుఁడు లక్ష్మణాగ్రజుఁడు వాత్సల్యమ్మునన్ సోదరుం
డానందమ్మునఁ బారవశ్యమున భావ్యం బెంచుచున్ నిల్వ నా
స్థానమ్మెంతొ మనోహరమ్ముగను నందంబెల్లయున్ రాశిగా
కానన్ దోఁచి యగస్త్యు నాశ్రమమునన్ గాన్పింప పల్కెన్ వెసన్ 201

పరముఁ డీముని పాదసేవనము మనకు
శాశ్వతాభ్యుదయమ్ముల సంతరించు
కొంతకాల మిచ్చటనుండఁ గోర్కెపొడమె
నిది వినీత జనమ్ముల కిక్క యగుట 202

ఇట మృషావాదుల కేస్థాన ముండదు
క్రూరు లాశ్రమ సీమఁ జేర రారు
శఠులు, నృశంసులు, సదసద్వివేకశూ
న్యులు ప్రవేశింపగ వలను పడదు

సిద్ధు లెందఱొ ముక్తిఁ జెందిరీ యాశ్రమ
మందుఁ దపశ్శక్తి నధికు లగుచు
నెందఱో దేవతలీ యగస్త్యులను నా
రాధించు చుందురు రక్షణకయి

తాపసికి పాదదాసులై తనుకుదు రిట
ప్రాంచదాశ్రమమదె సమీపించినాము
అనుజ ! నారాకఁదెలిపి మహర్షి యభ్య
నుజ్ఞఁగొనితెమ్ము - వేచియుందును - త్వరపడు 203

ఆమాటశ్రీరాముఁడనుటయే తడవుగా
సౌమిత్రి పరువెత్తె - సంయమీంద్రు
కీవార్తఁ దెలుపంగ సిద్ధచరిత్రుండు
నాశ్రమమ్మునుఁజేరి, యచటనున్న

శిష్యునిఁజేసన్నఁజీటి సందేశము
శ్రీయగస్త్యులకిట్లు చెప్పఁబలికె
'దశరథరాజపుత్రజ్యేష్ఠుఁడగు రామ
చంద్రుండు సతితోడ స్వామిదర్శ

నమ్మునకు వచ్చె, నతనికిఁదమ్ముఁడగుదు
నేను - మునికి నివేదింపఁబూని వచ్చి
నాఁడతనిపంపునను మాన్య ! చూడ వారి
యభ్యనుజ్ఞ నపేక్షింతు నతులభక్తి 204

లక్ష్మణుండం(ద్రు నన్ను - శ్రీరాముఁగూర్చి
మీరు వినియుండలేద ? భూమిపతి శాస
నమున నీ దండకములకు నర్ములమయి
మాకు రానయ్యె - తెల్పుఁడీ రాక మునికి 205

అందులకు సమ్మతించుచు నగ్నిశరణ
మునుఁ బ్రవేశించె శిష్యుఁడు - మునియగస్త్యు
లచటనుండగ నతఁడుఁ గృతాంజలియయి
తెల్పె రామాగమనవార్తఁ దెలపి గనుచు 206

ఆమాటల్ విన కుంభసంభవుని మోమానంద సంఫుల్లమై
"రాముండిచ్చటికేఁగుదెంచె నటె - యీరాకన్ మదీయాశ్రమం
బేమాన్యంబయె నింతకాలమునకున్ - బేరాసతోనుంటి నీ
శ్రీమంతమ్మగువేళవచ్చు, శుభముల్ సిద్ధించునంచెంచుచున్ 207

ఎచటనుండెను శ్రీరాముఁడెచటనుండె ?
నెవనిగా నెంచితిరి మీర లెవరొకాదు
మునులరక్షించి జగతికి ముదమునిచ్చు
దనుజసంహర్త - క్షేమసంధాన కర్త 208

ఇంతకు ముందే వారీ
ప్రాంతమునకు వత్తురనుచు భావించితి - నేఁ
డెంతటి సుదినము సీతా
కాంతుని దర్శింప నయ్యె ! కదలుము తోడ్తో 209

వారు నాకుఁ బ్రియాతిథుల్ గౌరవముగ
శీఘ్రముగఁ దోడితెమ్మని శిష్యుతోడఁ
బలికి 'జాగేలఁ జేసి లోపలికిఁదీసి
కొనుచు రారె' దటంచని గొణఁగు కొనియె 210

నియతాంజలియై ఛాత్రుఁడు
భయమునఁ బరువెత్తి యతిథి పరమేశ్వరునిన్
దయచేయుఁడనుచు, గురువులు
ప్రియపడిరని స్వాగతించెఁ బ్రేషితుఁడంతన్ 211



# షష్ఠాశ్వాసము

సహాలక్ష్మణుండయి జానకీరమణుఁ డా
శ్రమమునందడుగిడి సాగుచుండె
సువిద మైథిలి వెంటనుండెఁ బ్రశాంతమ్ము
గాకీర్ణ మాశ్రమ మచట నన్ని
స్థలముల బహుదేవతల నుపాసింపగ
వేర్వేఱు స్థానముల్ వెలయు - విష్ణు
నకు, మహేంద్రునకు, గణపతికి, గాయత్రి
కిని, కార్తికేయున, కినున, కగ్ని

కిని, వరుణున కుపాసింప ననువుఁ గలుగు
నాయతనములఁ గాంచుచు నవనిపుత్రి
దాశరథు లేఁగుచుండగ దారి మధ్య
నెదురు వచ్చె నగస్త్యమునీంద్రుఁ డాస్థ

చ్ఛాత్రులు దీప్తతేజస్కులు - కుంభోద్భ
వుఁడు భాస్కరుని రీతిఁ బొదలుచుండె
రాముఁ డగస్త్యు దూరము నుండి తేజోవి
శేషమ్ముచే పోల్చి చెప్పె ననుజుఁ
గాంచి సోదర! వారగస్త్యులు చూచితే!
వారి ప్రశాంతగంభీరమూర్తి
జంగమవిజ్ఞానసర్వస్వ మాతండు
సర్వసమర్థుఁ డీ యౌర్వశేయు (

దనుచుఁ బలుకుచు శ్రీరాముఁ డనుజుఁ గూడి
మహితులకు భక్తిమీఱ నమస్కరింప
ధరణిపుత్త్రిక వారి పాదముల కెరఁగ
నతిథులను సత్కరించె మహర్షి ప్రీతి 2

కుశలప్రశ్నాదికములయ్యె - కుంభసంభ
వుఁడును నగ్నిని హోమించి నడపె సర్ఘ్య
పాద్యవిధుల - వానప్రస్థ పరమ ధర్మ
మునను భోజనమిడె వారి కనఘుఁ డపుడు 3

భోజనానంతరము రామమూర్తి మౌని
కెదుటఁ గూర్చుండె నమ్రుఁడై - ఋషి వచించె
వత్స ! వహ్నిని హోమించి వచ్చు నతిథి
కర్ఘ్య మిడవలె నిది ధర్మమగును సుమ్ము ! 4

దీనికిం దప్పిన తపస్వి తిను స్వమాంస
మటుల దుస్సాక్ష్య మిచ్చు నరాధముండు
నరక మందు స్వమాంసము నరిది భక్ష
ణమ్ముఁ గావించు నని పురాణములు చెప్పు 5

మా ప్రియాతిథి వయ్య ! మా కెప్పటికి నీవు
ప్రాప్తించితివి ధర్మపరుఁడ వెంతొ
నీమూలమున శాంతి నిల్చు జగమ్మున
నార్తుల రక్షింప ననవరతము

కంకణమ్మును దాల్చి కానల విహరించి
క్రవ్యాదులనుఁ జంప గలిగినావు
మునిజనసేవయే ముఖ్యమ్ముగా నెంచి
శరణమ్ము నొసఁగుచుఁ దిరుగుచుంటి

వడవులం బడి కాల్నడ నతివ తోడ
ననుజాతో తండ్రి వాక్యమ్ము ననుసరించి
దశరథుఁడు ధన్యుఁ డయ్యె నీ త్రాణ వలన
ధర్మరక్షణ వలన, సత్యమ్ము వలన

నీ వృత్తాంతము లెల్ల నేను కనుగొంటిన్ యోగదృష్టిన్ - చిరం
జీవీ ! పంక్తిరథుండు నా యెడల సుస్నిగ్ధుండుగా నుండె నాఁ
డావైనమ్ముల నేమి నీ వెఱుఁగవయ్యా ! విశ్వసంరక్షణా
భావంబున్ వెలయించి దేవతల తాపం బార్చె శౌర్యమ్మునన్

ఆరాజన్యుని బిడ్డగా జగతి బాధావిగ్నమై యుండగా
ప్రారూఢిన్ ద్యజియించి రాజ్యరమ విశ్వక్షేమకాంక్షామతిన్
రారాపుల్ పడుచున్ వనమ్ములనుఁ జేరన్ బూనితే ! రామ ! భూ
భారంబున్ దొలఁగింప రాక్షసగణవ్యాపాదనప్రేప్సతో

ఇది రవివంశపాలకులకే సమకూడిన పేశలాస్థ - సౌ
హృదమునుఁ ద్యాగశీలత, సహిష్ణుత, దీనజనావనమ్ము, దు
ర్మదపరిహారబుద్ధియు, క్షమాగుణ, మాంతరప్రజ్ఞయున్ బ్రతి
ష్ఠ, దమము, ధార్మికత్వముఁ బ్రశస్తి, వివేచన భూషలై తగన్

ఇదిగో ! నాకడ నుంచె నీచాపముంజూడు
మీ ! మయనిర్మిత హేమరత్న
భూషితమ్మిది - దీని మున్ను విష్ణువు ధరిం
చెను లోకకంటకులను వధింప
నిది వైష్ణవ ధనుస్సు కుదురు నీచేతికి
దానఁ గూర్పగ శరోత్తమము నొందు
బ్రహ్మ నాకొసఁగెను బాణముల్ పావకో
పమము, లక్షయ సాయకములు కల్గు

తూణములనిచ్చె నింద్రుఁడు- త్రుంప ఖడ్గ
మునుఁ బరీక్షింపుమిది హేమభూషితమ్ము
కోశమా రజతమయ - మకుంఠితములె
అన్నియును స్వీకరింప నే నభిలషింతు 10

ఇవి నీ కోసము దాఁచిపెట్టితిని తండ్రీ ! వీనిఁగైకొమ్ము - దా
నవసంహారమొనర్చువేళల లసన్నాళీకఖడ్గచ్ఛటల్
వివరించున్ భవదీయసాహసకళావిష్కారవృత్తాంతముల్
భువనంబుల్ వెలయించు నద్భుతకథామోదప్రసన్నమ్ములై 11

అనుచుఁ బులకిత సాగరుం డినకులాబ్ధి
సోమునకు, రామున కొసంగె క్షేమకరుఁడ
టంచు నెంచుచు బాణశరాసనముల
ఖడ్గమునుఁ బ్రీతి దీవించి కరుణతోడ 12

## ఆశ్రమ సందర్శనము

అనఘుఁడంతట వాని "మహాప్రసాద"
మనుచుఁదా స్వీకరించెను వినయశీలుఁ
డగుచు మునిలోకమాన్యుని యభిమతమ్ము
నెంతొ మన్నించె - మౌనియు నెంతొ మురిసె 1

మరల వచించె నిట్టు లభిమానముతో మునిమౌళి రాముతో
'కరఁగె మనస్సు మిమ్ములను గాంచిన తోడనె దూరమెంతయో
తరుణిని వెంటఁబెట్టుకొని తాలిమి వచ్చితి వెవ్వరీవిధిన్
తిరుగరు - ధర్మచింతనము దీప్తి నొసంగగ వచ్చినావిటుల్ 1

జనకు వచన మెంత ఘనమైన, ఋజువైన
విపినసీమఁదిరుగు వెట్టి యెవఁడు ?
భర్తనడత యెంత పరమైన, గుదురైన
తెగువ వెంట నరుగు మగువ యున్నె ? 1

ఎక్కడ సాకేతపురం
బెక్కడ యీదండకమ్ము లీమార్గములన్
చిక్కులు పడుచును వచ్చితి
విక్కడకున్ జాలిఁగొలుపు నెవ్వరికైనన్ 16

మీరందఱును నెంతదూరమ్ము నడచిరో
అలసట కనిపించు నాస్యములను
ఎండకన్నెఱుఁగని యింతి శ్రీ జానకి
ఆమె క్షత్రియులింటియాడుబిడ్డ

ఏ దుఃఖ మెప్పుడు లేదుగా - నీ యందు
        స్నేహమ్ముతో వనుల్ చేరెఁగాదె!
ఆమె మనస్సు నిత్యము హర్షదాయకం
        బగురీతి వర్తింప న్యాయమగును

బహుళదోషభూయిష్ఠముల్ పాలసులకు
నాలవాలమ్ములై యుండు నడవులెల్ల
నామె కోరిక చెల్లను రామచంద్ర!
తీర్పవలె జాగుసేయక దీమసమున 17

సృష్ట్యాదినుండియు స్త్రీలలో నొకగుణ
        ముంచెఁ బ్రసిద్ధమై యూర్జితముగ
పురుషుండు శక్తుఁడై పొంపెసలారిన
        ననుసరించును భార్య యతని నెపుడు
విషమస్థుఁడైనచో వెలఁదికి లోకువై
        త్యజియింపఁబడువాఁడు విజితుఁడగుచు
గహనమ్ము లెంత భీకరమైన సీతోడ
        సంతోషమున వచ్చె జనకదుహిత

స్త్రీలలో చంచలత్వము, తీక్ష్ణతయును
వాయుగరుడుల వేగాన ప్రబలియుండు
నట్టి దౌర్బల్యములు సీత కంటలేద -
ఆ యరుంధతికిన్ సాటి యవనిజాత 18

నీవే దేవుఁడవంచు వచ్చినది సాన్నిధ్యమ్మునే కోరుచున్
తావుల్ ముఖ్యములంచునెంచకయె సౌధవ్రాతమో ? పర్ణశా
లావాసమ్ములో యెన్నడైనఁ దలపోయంగాంచితే ? మన్ననన్
దేవిన్ సానునయమ్ముగా కనుము ప్రీతింజూపి లాలించుచున్

క్షమకుఁ దావలమైనదీ కమలనయన
కష్టసుఖము లొకేరీతిఁ గాంచు - నీకు
సేవలొనరింప నోర్మితోచేరె - రాజ
పుత్త్రియయ్యునుఁ దా వనభూముల కిటు

ఈ రాత్రించరవాసభూములను నీయిల్లాలి, యిల్లాలితా
కారన్ గంటికి ఱెప్పవోలె నెపుడున్ గన్గొవలెన్ - ధర్మమౌ
క్రూరుల్ కన్మొఱఁగన్ బ్రయత్నముల వైరూప్యమ్మునన్ వత్తు రే
వైరమ్మేమియు లేకయే మనసు నొవ్వంజేతు రీర్ష్యాళువుల్

పరమ సాధ్వీమతల్లిక ధరణిజాత
పాదముద్రల దండకవనము లన్ని
పావనములయ్యె - నలసట వాయనేఁటి
కిచట విశ్రాంతిఁగై కొనుఁ డిచ్చగించి

రవియస్తంగతుఁడయ్యెఁ బక్షులును గూండ్లంజేరెఁ దామిస్రమున్
దవిలెన్ లోకము నంత రాఘవులు సంధ్యన్వార్చి, నిద్రించి వే
కువనే లేచి కృతావగాహులయి యగ్నుల్ వేల్చి హృష్టాత్ములై
మివులన్ - జూడగఁబోయి యాయనఘు సామీప్యమ్మునన్ నిల్వగన్

అంతట నామహర్షి దరహాసము సేయుచు రామచంద్రునిన్
జెంతకుఁబిల్చి స్వాగతముఁజెప్పెను 'రాతిరి నిద్ర పట్టెనా ?
శాంతతఁ గల్గునే యిచట? చక్కఁగ నున్నదె ? క్రొత్తయైనదా?
సంతసమౌను నచ్చిన హసన్ముఖముల్ పరికింపఁ దెల్లమౌ ! 24

అనవిని రామచంద్రుడు ప్రియంపడి పల్కెను స్వామితో' చిరం
తనముని సేవితాశ్రమపదమ్ము ప్రహర్షముఁగూర్చు శాంతితో
మనములఁ దోఁచు చక్కని ప్రమాణములన్ వెలయించి - విద్యలన్
ఘనులగు శిష్యులుండిరి వికస్వర, భాస్వర చిత్తవృత్తులై 25

మీ యాశ్రమ పదమున మా
యాయాసం బుపశమించె నాహ్లాదముతో
హాయిగ గడపితి మియ్యెడ
రేయిన్ - మీ శిష్యగణము ప్రేముడి తఱచై 26

మా తండ్రి యఁతిపురమటు
సీతయు, సౌమిత్రి, నేను చేతః ప్రీతిన్
కౌతుకమున భావించితి
మాతిథ్యము స్వీకరించు నవసరమందున్ 27

తమ యాశ్రమ వాసముచే
నమరెను బుణ్యంబు, సుఖము - నంతేవాసుల్
క్రమశిక్షణతో మెలఁగుచు
సమకూర్చిరి మాకు వలయు సౌకర్యములన్ 28

మేము పవిత్రులమైతిమి
స్వామీ ! మమతానుభావసంకల్పముతో
సామీప్యము దయచేసిరి
క్షేమంకర మిద్ది జగతికిన్ మునిమౌళీ !

ననుఁబుత్రనిర్విశేషము
గనుఁదలఁచి యనుగ్రహింపగా బాణములన్
ధనువునుఁగరవాలమ్మును
వినీతునిగ మ్రొక్కువాఁడ విజ్ఞానఖనీ !

ముని కోరంగ నివిష్టుఁడయ్యె రఘురాముండంత నాతండనెన్
'జనకాజ్ఞన్ నెరవేర్పఁగల్గితివి ప్రజ్ఞాప్రాభవస్ఫూర్తితో
దినరాజాన్వయకీర్తికేతనము లెత్తింపంగ దిగ్వీథులన్
గొనసాగున్ సుమి నీ ప్రయత్నముల కెగ్గుల్ రావు - సత్యంబిదే ! 3

నీ ప్రవాసకాలమ్మున నీరజాక్ష !
చాల భాగమ్ముగడచెను - మేలుఁగలుగు
నీ ప్రతిజ్ఞలు నెఱవేఱు - నియతి రాజ
భోగముల నందఁగలవు నీ స్ఫూర్తితోడ 3

ధన్యుండయ్యె యయాతి మున్ను తన పుత్రజ్యేష్ఠు మూలమ్ముగా
ధన్యుం డయ్యెను నీదు తండ్రి తన పుత్ర జ్యేష్ఠుచే నట్టులే
మాన్యా ! తారితుఁడయ్యెఁ బంక్తిరథుఁ డమ్లానాచ్ఛసత్కీర్తితో
వన్యాసీమల సత్యసంధతకునై వాసింప నీ విట్టులన్ 3

అని వచింపగ మౌని భాషణము లందు
తనకు తెలియని విషయము తనరు ననుచు
దాని నెఱుఁగఁ బ్రయత్నమ్ము దాశరథి యొ
నర్చి ప్రశ్నించె నిట్లంగి నానఁ గొనుచు 34

స్వామి! మీ యాదరమునకు స్వాంత మెంతొ
పొంగె - నిదె నాకృతజ్ఞత - భూమిపాలుఁ
డెటు తరించును నా వల్ల నెంత సుకృతి?
జనకుఁడు తరించె తన పుణ్యధనముచేత! 35

మా జన్మల కొక పండుగ
తేజస్వీ! దండకముల తీరు పవిత్రం
బై జటిలుర కావాసం
బై జాతికి వెలుఁగు నిచ్చి భద్ర మొసంగున్ 36

అన విని యా యగస్త్య మహామునీంద్రుఁడు
ప్రత్యుత్తరం బిడె రాముని కిటు
దండకుం డిక్ష్వాకు తనయుఁ, డీ భూములు
నతనిచేఁ ద్యక్తమ్ము లయ్యె - మున్ను
భార్గవుం డీ నేలఁ బ్రాణి కోటి వసింప
దనుచు శాపం బిడె నందు మీఁద
మానవుల్ నివసింప మానిరి - మృగములు
జీవించుటలు లేక నేగి వచ్చె

బలిసె ఘోర వనమ్ము లీ ప్రాంత మంత
యోజనసహస్రవిస్తీర్ణభాజనముగ
నొక్కచే దండకమ్ముగ నుండె - తేటి
పాఱఁ జూడ రెవ్వరు భయభ్రాంతు లగుచు

ఎల్లెడఁ దరులును, గిరులునుఁ
దల్లడ పెట్టంగఁ బెరిగె దానవు లచటన్
మల్లి చఱచి యొండొరుతో
నుల్లాసించెదరు మల్లయుద్ధమ్ములతో

పవనములు వీవ వెయ్యెడ - వాన రెపుడు
కురియ వాగతి గడచెను, కొన్ని వేల
సమలు - దేవజాతులు కూడ సంచరింప
వెపుడు సర్వశూన్యమ్ముగా నెడరు మిగుల

హిమవత్పర్వతప్రాంత సీమ గల నే నేతెంచితిన్ దైవయో
గమునన్ దండకకాననమ్ములకు - వెన్కన్ వచ్చెఁ దోద్తోడ వ
ర్షములన్ గొన్ని దినమ్ము లాగకయె నీ ప్రాంతమ్ము ముంచెత్త, రో
గములన్ మాపితి నా తపోబలముతో - గాడ్పున్ ప్రసారమ్ముఁగాన్

అంతరంగమ్మునఁ జింతింప హిమశైల
పాదపవ్రాతమ్ము ప్రబలెఁ బుటిని
కల్హార, సారస కలిత సరస్సులు
నిండుగాఁ బ్రవహించు నిమ్నగలును
ఘ్రాణతర్పణమైన కరువలుల్, ఫలములు
సస్యముల్, వనములు, జంతువితతు

గిరిసానువులయందు కురవక కింశుక
కోవిదారమ్ములఁ గొండగోఁగు
లంచితంబుగ సాక్షాత్కరించె - మునులు
కోరివచ్చిరి నావెంటఁ గుదురుకొనగ
నాశ్రమమ్ముల నెలకొల్పు నాస్థతోడ
నిచట ననువైన తావుల నెంచుకొనుచు 41

వృక్షగుల్మలతాదులు విస్తరిల్ల
పక్షిగణములు, మృగములుఁ బరిఢవిల్ల
రాక్షసావాసములుగ మాఱగ మునులకు
దుఃఖహేతువే యయ్యెను దురితదూర ! 42

మునిగణమ్ములు నినుఁ గాంచి దనుజకోటి
చేయు దుష్కృత్యముల నీకుఁ జెప్ప వారి
కభయమును నీవొసంగితి వనుచుఁ దెలిసె
భానువంశసమజ్ఞ నీ వలనఁ బెరిగె 43

చిత్రకూటమ్మునఁ జేరిన మిముఁ గని
పగఁగొని దానవుల్ పగలె మునుల
వేధించి, వధియించి, వివిధమార్గమ్ముల
దుష్కార్యములఁ జేయుదురు - తపస్వు
లను నీవ రక్షించు ఘనుఁడవు - ముల్లోక
ములఁగాచు విక్రమము గద నీది
అలఁతియౌ నీకిది - తలఁచిన లెక్కయే
దండకమ్ములఁ ద్రొక్కి దాఁటి వచ్చి

ఇవి కనుక భార్గవ రాము తీవ్ర శాప
మప్పుడే నిరస్తం బయ్యె ననఘ! మున్ను
దండకత్యక్తవనములు దండకమ్ము
లయ్యె - నధిపతి వీ భూము లన్ని నీవి

ఒక యిక్ష్వాకుఁడు వదలగ
నొక యిక్ష్వాకుండు మరల నుద్ధర్తయగున్
ప్రకటించుము నీ సాహస
మకలంక చరిత్ర! జగము లానందింపన్

ఆమాటల విని రాముం
డోముని! దండక చరిత్ర నూహింప విచిత్రం
బౌ - మరల నేను వీనిని
క్షేమమ్ముగ నుంచువాఁడ చిదిమి యసురులన్

మౌనికులావతంస! మునిమాన్యులఁ గాంచెద వాసయోగ్యమౌ
స్థానము నాకుఁ జూపినఁ గృతజ్ఞత! నయ్యెడ నానుపానులన్
బూనికతో నెఱుంగుటకుఁ బోఁడిమి గల్గును - వీలు వెంబడిన్
నేనటనుండఁ దాపసుల నిర్మల బోధల విన్కి సాధ్యమౌ

ధ్యానమున నేత్రములు మూసె తవిసి కొంత
తడవు - కనుదోయికిన్ భవితవ్య మంత
తెల్ల మయ్యెను - రఘురామ! తిగుచు తావు
పంచవటి - యోగ్యమౌను నివాసమునకు

వటికి రెండు యోజనములే। బహుమూలఫలోదకమ్ము - నా
చనము లాలకించి యట వాసముఁ జేయుము - సర్వసంగతుల్
పచురముగా నెఱింగితిని రామ। నిరంతర యోగశక్తితో
చలకుమారి తృప్తిపడు నాయమ కోరిక లెల్లఁ దీర్పుమా। 49

నీతండ్రి నాకు మిత్రుఁడు
ప్రీతిం జూపెదను ధర్మవిదుఁడని, పుత్త్రిం
డాతనికిఁ దగినవాఁడని
చేతము పొంగంగ నిది విచిత్రము కాదే। 50

సర్వమెఱిఁగితి నా తపశ్శక్తి వలన
దశరథుం డాప్తమిత్రుఁడై తనరు కతన
నీదు దృఢ నిశ్చయమ్మున నెనరు కలిగె
తండ్రి మాటలఁ బాలింప ప్రథిమ కలుగు 51

కానుగఁ జెప్పఁబోవఁడు కదా। వనికేఁగు మటంచుఁ దండ్రి- నీ
మానసవీథి నే తలఁపు మానితమై పొడసూపెనో పరి
మ్లాన హృదిన్ నృపాలకుఁడు మాటనుఁ జెప్పడు - కైక చెప్పగా
సూనుని ధర్మమున్ నెఱపఁ జూచితి వంతియె సత్యసంధతన్ 52

ఎందులకుఁ గైక నిన్నంపె నీ వనులకు
నేమి కోరితి వామెను - క్షేమ మగును
జగతి కని దేవతలు కోర స్వార్థ రహిత
చిత్తమున నీ ప్రవాసముఁ జేయు టరిది 53

నీహృదయ గత భావముల్ నేను చూచు
చుంటి ముకురమునం బలె సుకరముగను
అందులకె పంచవటిఁ జేరు మయ్య రామ!
అద్ది గోదావరీ తీరమందుఁ గలదు

కనిపించు నెల్లెడఁ గమనీయ దృశ్యముల్
తనివితీరదు చూడ తన్మయతను
నటులనే నిల్పును హర్షమ్ముఁ గూర్చుచు
సాధుమృగమ్ములు సంచరించు
వాసంత మానోజ్ఞ వైచిత్రి సర్వము
వశీగతంబుగా నామతించు
గిరిప్రస్థముల మనోహర వృక్షసంపద
కాలోలమై హృదులందగించు

అలరు విల్తుఁడు నిత్యమా స్థలములందు
సజ్య కార్ముకుఁడై నిల్చి సరభసమున
పుష్పవనముల సౌరభ్యములనుఁ దెచ్చి
మందపవనమ్ము లెప్పుడానందమిచ్చు

తెలతెలవాఱకముందే
కలకలరావములఁ బక్షిగణములు మీకున్
మేలఁకువఁ దెప్పించును - దరఁ
గలతో స్వాగతముఁ జెప్పఁగల దాపగయున్

ఆ గోదావరి కన్నతల్లివలె మీ కానందసంధాయియై
రాగచ్ఛాయఁ దరంగిణీ నినద మారాటమ్ముఁ బోనాడెడిన్
సొగున్ నిర్మలవారి పూరమునఁ బ్రస్థానమ్ముఁ గావించుచున్
లోఁగొంచున్ హృదయంబులన్ దివిచి యాలోక్యమ్ము, నాలోచ్యమై 57

చిలుకలు, గోర్వంకలు రొద
సలుపుచు తరుశాఖలందు చక్కఁగతిరుగున్
కులుకుచు, నందము లొలుకగ
విలాసముగ చూపఱకు నివిచ్ఛిన్నముగా 58

సీతాదేవికి పంచవ
టీతతవాయువుల నావటిల్లు సుఖమ్ముల్
ఆతల్లి యేమికోరిన
చేతః ప్రీతిగనుఁ దీర్ప శ్రేష్ఠంబగుగా ! 59

దూరమునందుఁ దోఁచును మధూకవనం బొకడుత్తరంబుగా
చేరిన మఱ్ఱి చెట్టొకటి చెంతఁ గనంబడు - దాని దాఁటినన్
వారక భూధరమ్ము కనుపండువ సేయును - పోవఁబోవన
వ్వారిగఁ జూడఁ గల్గుదురు పంచవటిన్ తటినీతటమ్మునన్ 60

చల్లని వాతావరణం
బెల్లెడలఁ బ్రశాంతి, సొగసు హెచ్చితమగు - సం
ఫుల్లములగు జలజంబులు
కొల్లలుగాఁ గానిపించుఁ గొలఁకులలోనన్ 61

అని వాచించు నగస్త్యమౌనిఁగని యజ్ఞాక్షుండు కైమోడ్పుతో
మునిలేఖర్షభ ! ప్రీతిమై పరశురాముండిచ్చె కోదండమున్
మును పే - మీరిసు నస్త్రశస్త్రముల నే మోదంబునన్ స్వీకరిం
తును - ఏమ్యంతను - నానమస్కృతులివే ! తూలించెదన్ వైరులన్ 62

మీ యాంతర్యము నేనెఱింగితిని నెమ్మిన్ నిర్వాంఛించెదన్
సూయాణమ్ముల దైత్యవీరుల శిరస్సుల్ బంతులాడించెదన్
ఏ యజ్ఞమ్ములకుం దపస్సులకు స్వామీ ! రావు సంరోధముల్
చేయం బూనుదు సర్వశౌర్యములు నిస్సీమాభిమానంబునన్ 63

ఆశ్రమ సందర్శనమై
ప్రశ్రయమున మునులఁ జూచి పలుతావులతోఁ
బ్రశిక్షుఁడనైతి మునివర ।
ఆశ్రమమున నింత పుణ్యమబ్బె వనములన్ 64

వారు మువ్వు రగస్త్యుని పదములంటి
మ్రొక్కి వీడ్కొని యాశ్రమమునుల కేరఁగి
పంచవటి మార్గమునుఁ బట్టి పయనమైరి
సంయమి సశిష్యుఁడై వారి సాగనంపె 65

శ్రీ వింధ్యాచల దర్పహారి పరమున్ సేవింపఁ దన్మౌని సం
భావింపన్ రఘురాము నక్షయశరస్ఫారాసిబాణాసన
శ్రీవైశత్యముతో సుమిత్రకొడుకున్ శ్రీజానకిం గూడుచున్
సౌవీర్యమ్మది మూర్తిమంతముగఁ బ్రస్థానించె రాముండొగిన్ 66

కనువిందై రమణీయదృశ్యములు వేడ్కంగొల్పుచుండంగ ద్రో
వను - సీతావనజాక్షి కుంభభవు నిర్వ్యాజానుకంపాపరా
యణతన్ సారెకు లోఁదలంచుచుఁ బ్రహర్షాయోగ చిత్తమ్ముతోఁ
జనుచుండెన్ మధురోక్తులన్ ధవుఁడు ప్రస్తావింపఁదత్సంగతుల్ 67

నీ పట్లన్ నెనరూని యెంతగనొ మన్నింపంగ నీ వాంఛలన్
జూపంగోరెను శ్రద్ధ - మౌనివరుఁడిచ్చోనెచ్చెలుల్ లేమిచే
పాపంబెట్టులఁగాలమున్ గడపెదో ప్రాల్మాలికన్ నీ వటం
చాపుణ్యాత్ముఁడు హెచ్చరించె నను కొమ్మా ! తీర్ప నీ కోర్కెలన్ 68

జనకక్ష్మావరుపుత్త్రివై తరణి వంశస్వామిఁబెండ్లాడి, యీ
వనముల్ నీవు విహారభూములుగ సంభావించుచున్, సౌఖ్యజీ
వనమున్ గోరక పర్ణశాలలనె నిల్వన్ సందియంబందకే
తినుచున్ దృప్తిగ కందమూలఫలులఁ బ్రీతిన్ - గుండె భేదించెడిన్ 69

ఈ సాదృశ్యము మౌనిపత్నికిరవయ్యెన్ గాదె ! వైదేహి ! యా
వాసం బాశ్రమసీమయై నెగడె - లోపాముద్ర తానెంతగా
భాసించెన్ నరపాలనందనగ ఆపం బామెకుందప్పలే
దీ సామిన్ పరిణయింపఁగష్టముల నెన్నో పొందుచుండెన్ సుమీ ! 70

ఆ సాధ్వీమణిమోముఁగాంచిననె పుణ్యంబబ్బు, దీనావనా
ధ్యాసిన్ గుంభభవున్ నిరంతరము సేవన్ దృప్తిఁగావించుచున్
గాసిల్లున్ సహనమ్ము మూర్తిఁగొనెనా కాంతామణీ రూపమై
వాసింగాంచుఁబతివ్రతాతిలకమై భద్రమ్ములంగూర్చుచున్ 71

నాకాయాశ్రమవాటిఁగల్గెను మహానందమ్ము నా స్వాంత మం
దోకల్యాణి ! యగస్త్యు మానసమునందున్ దండ్రినెయ్యుండు, సు
శ్లోకుండంచును సానుదృష్టిఁబరికించెన్ నిన్ను, నన్నింతగా
ప్రాకామ్యమ్ముగనంచు వాకొనుచు భార్యంగాంచె సంప్రీతిమై 72

ఆయమృతోపమానములు. నా ప్రియభాషణముల్ ప్రమోద సం
ధాయకముల్ ధరాతనయఁదన్మయతన్ భజియింపఁజేయగా
నాయమపొంగిపోయెనపుడద్దివలెన్ - రఘువీరుఁడర్మిలిన్
తీయని యూహతో కనులఁదెక్కువహింపగఁజూచె మైథిలిన్ 73

హృదయావర్జనమెల్ల నొక్కత్రుటి నిట్టే మాయమయ్యెన్ బదిం
బదిగన్ సీతనుగూర్చి సానునయమొప్పన్ మాటికిన్ జెప్పగా
నెదియో సంశయ మూహలో మెదలె నేవేన్ గష్టముల్ కల్గఁబో
లు; దిగుల్ పుట్టె నెడంద రామునకు నాలూనంబుగాఁజయ్యనన్ 74

పైకింజెప్పక నంతరంగమున నిల్పంబూనె - లేకున్నచో
వాకొన్నన్ భయమొందుసీత భవితవ్యంబెంత యాపత్కరం
బై కల్లోలమురేఁపునో యనుచు దుష్ప్రాపప్రతున్నక్రియల్
లేకుండన్ దశవర్షముల్ గడచెహాళిన్ - స్రుక్కగామంచిదే 75

సచ్చరితుండు వారియెడ జాలినిఁబూని హితమ్ముఁజెప్పగా
వచ్చునుఁగాదె : ముందుగ విపత్తులు వచ్చునరణ్యవాసమం
దిచ్చటి క్రూరదానవులు హింసలఁబెట్టెదరేమొ యంచు నీ
హెచ్చరికన్ బొనర్చెనని యించుక ధైర్యము నూనె మేవడిన్ 76

తఱితఱలాడు రామునెడఁదన్ బదియూహలు పుట్టి మాయమౌ
గిఱికొను - దూరదృష్టిఁబరికించెను మౌనివరుండు భావినే
కఱకటితోఁచునో తెలియగా నొకయింతయు వీలుచాల, దే
మఱెనపుడౌర్వశేయుఁడు విమర్షమదేమొ యెఱుంగఁజెప్పడున్ 77

కడకెట్లో మది తెంపుఁజేసికొని యా కాకుత్థ్సవంశోద్భవుం
డడుగుల్ మెల్లగవైచుచున్ రమణితోనత్యంత ప్రేమార్ద్రితన్
గడముట్టున్ మునిమౌళి దీవనల విక్రాంతిన్ విడంబింతు నె
న్నడు వైతథ్యము రాదటంచుఁబలికెన్ నందింప భూపుత్త్రియున్ 78

ముని నిర్దేశిత మార్గమందుఁజనగా ముందొక్కన్యగ్రోధమున్
గనిరాముర్వురు నాయతంబులగు శాఖల్ గల్గుదానిన్ శకుం
తనికాయోర్జిత భిన్నకూజితప్రయుక్తింబైన దానిన్ బురా
తన భూమీజము నధ్వనీన హృదయాస్థాస్వాస్థ్యసంధాయినిన్ 79

తరువుపైనుండె గృధ్రంబొండు - నది మహా
కాయము - దానినిఁగాంచి రామ
చంద్రుండు భావించె ఛద్మరూపమ్ముతో
నున్నరక్కసునిగా - 'నోయి ! యెవ్వ
డ' వని ప్రశ్నింపంగ నాశ్యేనమిటు వచిం
చెను - దశరథుని నెచ్చెలిని నుమ్మ
పేరు జటాయువు - ఆరంభమగును మా
వంశమ్ము నా ప్రజాపతుల నుండి

చాల తరములు గడచెను - సవితృవంశ
తారకేశ్వర! వినత పితామహియగు
గరుడియు, ననూరుడును నామె కన్నబిడ్డ
లమిత బలులు - పరాక్రమమందు ఘనులు

అరుణుండు మా తండ్రి - గరుడుండు పినతండ్రి
మా తల్లి శ్యేని - సంపాతి అన్న
రక్కసిమూకఁ స్వర్గము ముట్టడించిన
తరుణమ్మునందున దశరథావ
నీశ్వరుతో స్నేహమేర్పడె - నప్పటి
నుండియు మైత్రితో నుంటిమయ్య!
మీ తండ్రిఁ నేనును - మివుల సంతోషించి
నాఁడను మిమ్ములఁ జూడ నిచట

బహు మృగాకీర్ణరాక్షస బహుళములగు
నీ ప్రదేశమునందు మీ కెపుడు వలయు
సాయమొనరించి మిమ్ముల జనకదుహిత
ననఘ! రక్షింతు నా యోపినంతవఱకు

చుక్క తెగినటుల దానపుఁ
దొక్కండేపూలనుండియో వచ్చును మీ
చక్కటికి మీ ప్రమత్తత
నుక్కివునెదిరింప సమయముండునె మీకున్

సీతా తరలాక్షియు గల
దీ తరుణము నందు - ఖరునకిది యావాసం
బాతఁడు క్రూరుఁడు - చేయని
ఘాతుకములు లేవు - రక్షగా నిల్తు నిటన్ 83

నేనాబాధ్యత స్వీకరింతు నెపు డున్మేషమ్ముగానుండి నీ
ప్రాణప్రాణము జానకీరమణి సంరక్షింతు మీపట్ల నెం
తేనిన్ ప్రేమయు, మైత్రియున్ గలిగివర్తింతుఁగా రఘూత్తంస! నా
మేనన్ జీవములుండు దన్క మనచెల్మిన్ మిన్నగా నెంచుచున్ 84

మాయోపాయులు రక్కసుల్ నిబిడ గుల్మచ్ఛాయలందాగుచున్
జేయంబూనెద రెట్టిహానినయినన్ శ్రీరామ! నైసర్గికం
బాయత్నమ్ములఁ జూతు నేదొయొక వృక్షాగ్రమ్మునన్ నిల్చి. నే
సాయంబున్ బొనరించువాఁడ నను విశ్వాసమ్మునం జూడుమా! 85

నాయనా! రామచంద్ర! దాసవుఁడఁగాను
హితుఁడ - దశరథ భూపు స్నేహితుఁడఁగాని
మేలుఁగోరి మీపై యీగ్రవాలకుండఁ
దిరుగుచుందుఁ బంచవటీ ప్రదేశమంత 86

ఆ జటాయువు వచనంబు లాలకించి
మృదు మధుర భాషణమ్ములఁ గదలిపోయి
సౌమ్యునిగ నెంచి దశరథసార్వభౌము
మదిఁ దలంచుచు మన్నించె మాన్యుఁడతని 87

రాముఁడు భక్తితోడ ద్విజరాజున కర్ఘ్యము, పాద్యమిచ్చి నీ
ప్రేమకు మా కృతజ్ఞతలు వెంటను రమ్ము వియత్పథమ్మునన్
క్షేమముకాదె పంచవటికిన్ జను మార్గము నీవుచూప, మా
కామనఁదీర్పఁ దండ్రిచెలికాఁడవు నీవు - గతించె భూపుఁడున్ 88

నిను గుర్తింపక యజ్ఞతన్ బలికి ప్రశ్నింపంగ యత్నించితిన్
దనుజుండెవ్వఁడొ పక్షిరూపమున నుండంబోలు నంచున్ మనం
బున సందేహముతో విహంగమపతీ! పుణ్యాత్మ, సుశ్లోకునిన్
ఘనునిన్ నిన్నిటు నొవ్వనాడితి నహంకారంబు లేదింతయున్ 89

అనుమాన పడితి - దోసము
నసఘా! మన్నింపవలయు - నవినయ మనుచున్
మనమున నెంచక మాకిట
ననువగు సాయము నొనర్పుమా! ఖగరాజా! 90

అని పలుకు రామచంద్రుని
గని వికిర మహాశయుండు "కాననసీమల్
దనుజ నివాసము లగుటను
దినరాజ కులాబ్ధిచంద్ర! చెప్పర మెటులో 91

మీరా దశరథు బిడ్డలు
కారా? నా బిడ్డలటులఁ గాంచెద మిమ్మున్
కూరిమితో జనకునియెడ
పేరిమితో దొసఁగు లేదు - విన్ననయేలా? 92

అనుచున్ రాఘవు న్యూనతన్నుడిపి రామా ! రండు - మీతోడ నే
వినువీథిన్ జనుదెంతు పంచవటి పెంపే వేఱుగా నుండి మీ
కనువౌ నిల్వగ నందచందముల సాక్షాత్కారముంజేయుఁ జ
ల్లని వాతావరణంబు మీ హృదుల కుల్లాసంబు గల్పించెడిన్ 93

కొంతదూరము పోవగఁ గుధరమొకటి
కనఁ బడఁదోఁచును - దానిని గడచిపోవ
నెదుట పంచవటీసీమ యొసకమొసఁగు
సర్వఋతుసుఖంకరమగు సవిధభూమి 94

కదలుఁడీఁకఁ బోదమంచు నాకాశవీథి
కాజటాయువు పక్షమ్ము లంటవిప్పి
యెగయ నెంతొ చప్పుడు పుట్టె - ఖగము వెంటఁ
బోవసాగిరి రాఘవుల్ పుడమి పుత్త్రి 95

ఔక్కలసీడతో ననుసరించెను వారి జటాయు వాదృతిన్
మక్కువతోడ మార్గమున మంజుల దృశ్యములెన్నొ చూపుచున్
చక్కనితావు పంచవటి సంతసమందగఁ జేర్ప వారలా
పక్కికి ధన్యవాదములఁ బల్క- జటాయువు తెల్పె నివ్విధిన్ 96

అవిగో! చూడుడు మఱ్ఱి లైదుగల వాశావ్యాప్తమౌ శాఖలన్
రవితాపమ్ము నడంచి యధ్వగపరిశ్రాంతిన్ నిమేషమ్ములో
పవమానాశ్వసితప్రహృష్టమతులం బాయంగఁ దచ్ఛాయలన్
సవరింపున్ దనువుల్ సుశీతలమృదుస్పర్శప్రసన్నంబుగా 97

అనువగు నొక చక్కటిసిన్
గనుగొని యాశ్రమమునొండు కట్టుకొనుఁడటన్
మునిగణముల సేవించిన
నొనగూడును శాంతి - సీతయును నందించున్ 98

ఆక్రొత్త ప్రాంతమందలి
ప్రక్రియలున్, మౌనివరుల బాధలు, నెన్నో
వాక్రుచ్చెఁ బక్షిరాజపు
డాక్రందుండుగను రాముఁడభినందింపన్ 99

జరిగిన సంగతుల్ వినిచె సర్వము నందజముఖ్యతోడ నా
తరుణమునన్ జటాయువు నితాంతముగా వినుతించె - ధర్మమే
ధరణికి శ్రేయమై చెలఁగు - దానవకోటులఁ జక్కడంప మీ
తరణికులప్రదీపకుల దార్ఢ్యము లోకప్రసిద్ధమేకదా । 100

కొట్టినపిండి నాకిచటి కోనను గల్గు సమస్త సంగతుల్
గుట్టలు, చట్టులున్ దెలియు - గుల్మలతాదులు దట్టమైన యి
ప్పట్టుల జాగరూకత నపాయనివారణమాచరింప, నే
చెట్టునొ కూరుచుండి దరిసింపగఁ జాలుదు కొననంతటిన్ 101

కిట్టమిలేదు - నేనెవరికిన్ దలవంచను - నాబలమ్ముపై
గట్టిగ నమ్మకమ్మునిచి, కట్టడతోఁ జరియింపఁ బూన, నే
కట్టఁడి రాఁడు నాయెడకు - కాదనివచ్చిన నట్టివాని నే
మట్టము చేసెదన్ బొడిచి మంపెడలించుచు గోళ్లముక్కునన్ 102

నాతో నెవ్వడు మందె మేలమునకై నంగాని కయ్యంబుకై
ప్రీతిం జూపఁడు దూరదూరములనే భీతిల్లుచున్ నిల్చు, వ్యా
ఘాతిం జేయగ నుత్సహింపడు పరాకుంగూడ నా కాళ్లతో
ఘాతంబేల నటంచు జంకుచు పరీక్షంజేసి నా సత్త్వమున్ 103

వేల్పుల్ పోరుల నుండు కాలమునఁ దప్పింపంగ నాబాధఁ బ్రా
వేల్పుల్ దిక్కు మొగమ్ము లై చనగఁ బిల్పింపంగ సాహాయ్యమున్
సల్పన్ నేనును. నన్నయున్ విమతధ్వంసస్ఫూర్తికై పోయి, సం
కల్పంబున్ నెఱవేర్చి వచ్చెదము స్వోత్కర్షమ్ము లేదిందులో 104

రామా ! సద్గుణధామా !
శ్యామాంబుదదేహా ! విమలచాంద్రీకీర్తీ !
ప్రేమామృతరసమూర్తీ
వ్యామోహవిదూర ! పోయివచ్చెద - సెలవే ? 105

సెలవివారనవ్వి శ్రీరామచంద్రుఁడు
పక్షిరాజుఁగాంచి ప్రవిమలాత్మ !
పరిసరములనెల్లఁబరికించి మాక్షేమ
మరయుమయ్య ! కూర్మి ననవరతము 106

జనకునితో సమానుఁడవు - సఖ్యముకల్గును తండ్రిగారితో
మునిజనమెంతొ ఖేదపడ ముష్కరులెన్నియొ ముప్పతిప్పలన్
మునుచుచునుండఁగాంచి వితమున్ గనుఁగొంచు వధించునూహతో
వనములకేఁగుదెంచితిఁ బ్రవాసము నేయుచు నిర్వహింపగన్ 107

దశరథుని మృతికి వగచి పతంగరాజు
పంచవటినుండు వారి కాపాడు భార
మతఁడుకై కొని, వీడ్కొని యంబరమున
కెగసె 'భద్ర' మటంచును హెచ్చరించి 108

అది గోదావరియొడ్డునన్ గలుగు పుణ్యక్షేత్రమచ్చోట ని
ల్వఁదలంపన్ రఘునాయకుండనుజుతో బాగొప్పయోగ్యస్థలం
బెదియో చూడుము పర్ణశాల కొఱకై యీ వాహినీ తీరమం
దొదవున్ సర్వము నిర్మితిన్ సలుప నుద్యోగింపు మా సోదరా! 109

నానావ్యాళమృగాయుత
మీ నేల నిశాచరులకు విరవౌనటగా
సానువుల నప్రమత్తత
తో నిల్వగ మేలు - ద్రఢిమతో నిత్యంబున్ 110

కావున క్షేమంకరమగు
తావున మనయాశ్రమమ్ము తమ్ముఁడ! కట్టం
గావలె - పొదలును, వృక్షము
లేవియు దట్టముగలేని యిక్కఁగనుచున్ 111

అనుజ! యియ్యదియె మహర్షి నిర్దిష్టసుం
దర పంచవటి - యెల్లప్రాంతభూమి
నలువలంకులఁజూచి, నయనపర్వంబైన
స్థానమ్మునందు నాశ్రమము నొందు

నిర్మింపవలెను - సన్నిధిని జలాశయ
మ్ముండిన మంచిది - మెండుకొలుపు
వనరామణీయకమ్మును, గుహాదికములు
దగ్గరలోనుండఁదగును - పుష్ప

సౌరభాన్వితపవన సంచయము, స్నాన
ఘట్టములును, గోదావరీ కమ్రరవము
పులినతలములు, వాహ్యాళి సలుప ననువుఁ
గాఁగ నుండిన నెన్నొ సౌఖ్యమ్ము లబ్బు । 112

నా తాత్పర్య మగస్త్యు నాశ్రమములో నందించుచున్ శాంతిమై
మీతోనిల్వఁదలంచినాఁడ మునితోమెల్లంగనేఁదెల్పఁగా
వాతాపీదమనుండు కాదనుచు నా భావమ్ముఁదామెచ్చకే
యీ తావున్ మనకేర్పరించి పలికెన్ హేతుత్వమేమున్నదో 113

దీనంగల్గిన కీలకంబెదియొ ప్రీతింజెప్పఁడా మౌనియున్
ధ్యానంబందున నుండెఁగొంతవడి చింతాక్రాంతుఁడై - ఆపయిన్
మౌనంబున్ విడి దూరదృష్టిఁగనిపింపన్ నా భవిష్యంబు - నీ
స్థానంబాతఁడు చూపి నిల్వుమని యాజ్ఞాపించె - మర్మంబెదో 114

నాకుం దెల్పిన భావిసంగతుల మాన్యంబౌను - నేఁగూడ సు
శ్లోకున్ ధైర్యముఁజేసి, ప్రశ్నలిడి లోచూపున్ విలోకించు ప్ర
త్యేకంబైన విశేషముల్ తెలుపఁబ్రార్థింపంగ లేదెమ్మెయిన్
బ్రాకామ్యమ్ముగ సంశయమ్మున వ్యథాభారమ్ము ప్రాప్తింపగా 115

దేవీ ! లక్ష్మణ ! కుంభసంభవుని యుద్దేశంబు గుర్తింపగా
ప్రావీణ్యమ్మొక యింతలేక సొరిదిన్ బ్రాల్మాలి వర్తించితిన్
సౌవీర్యమ్మును గల్గియున్ హృదయ సంస్కారమ్ము నా కుండియున్
వైవర్ణ్యమ్మునఁ బొందినాఁడ నిపు డాభావంబెవో తెల్పెదన్ 116

క్షణకాలము రఘురాముం
డణువీక్షణుఁడగుచు మౌనియాంతర్యమెదో
గణితవ్యమనుచు మౌనముఁ
గణఁకం బాటించె దానఁగల కిటుకెమో 11'

మెఱుపువలె తోఁచె హేతువు
నెఱతనమునఁ జింతసేయ, నెఱిపడె నంతన్
బురపురలాడుచు తమ్ముని,
తరుణింగని పలికె నిటుల దాశరథి వెసన్ 11

అసురుల్ దండకసీమ దృప్తులయి మున్యావాసముల్ చొచ్చుచున్
కసితో వారల హింసఁబెట్టెదరు - పొక్కంజేతు రార్భాటమున్
ప్రసభ మెల్లెడఁ దాండవింప - దనుజవ్యాపాదసంకల్పముల్
వసివాడున్ మన మౌర్వశేయుకడ నిల్వన్ రిత్తకున్ రిత్తలై 11

పితృకల్పుండు జటాయువుం దెలియ సాధ్వీ ! పీలుకల్గెన్ బరా
జితులంజేయగ, దైత్యులం జెనక నాజిన్ జెప్పు మార్గమ్ములన్
హేతుఁడై సర్వవిధమ్ములన్ - మునుల సాహిత్యమ్ముఁ దోడైనచో
హితముల్ పెక్కులెఱుంగవచ్చు నిటులన్ విస్ఫూర్తి వచ్చెన్ మదిన్ 12

కుంభభవు నాశ్రమమ్మునఁ గూరుచున్నఁ
బాలసుల చేఁతలకు హద్దు పద్దులుండ
వచటి కరుదెంచ రెప్పుడు నసురులింక
మునుల పాటులు మున్ముపొద్దు ముమ్మరించు 121

అందులకే కాఁబోలును
నందుండగ నిచ్చగింప కా మహితుఁడు న
న్నిందుండు మనుచుఁ బంపెను
పొందువడున్ పంచవటికిఁ బోవ నియుక్తిన్ 122

వాక్యమ్ములు భావగర్భితములై పొల్పారుకాదే! మహో
ంభాషణ లర్థగౌరవధురాసంపన్నముల్, భావికా
మిత్తమ్ముల నాకళింపుఁగొనఁ బర్యాలోచనం జేయగా
యుక్తంబుగ హెచ్చరించె నను స్నిగ్ధ స్ఫూర్తితో సంస్పృహన్ 123

మాటల నన్యథా తలఁచి, సందేహించి, చింతించితిన్
అందలి యంతరార్థమెదియో గ్రాహ్యంబు గామింగడున్
ంబైన యెదందతో నిలిచి యాలోచ్యమ్ముగా నుండుటన్
ి దత్తఅపాటు వీడి మరలన్ నిర్దేశ్యమం చెంచితిన్ 124

పంచవటి నున్న నా వంకఁ బంచజనులు
తేఱిచూడరు - మునులకు దిటవు కలుగు
నగ్నికార్యమ్ములకును, వేదాధ్యయనము
నకును, జపతపంబులకు విఘ్నములు రావు

## ఆశ్రమ సందర్శనము

మానసాకాశ మందలి మబ్బులెల్లఁ
జెదరి విడిపోయె రాముని చింతనమున
గుండె బరువునుఁదగ్గ వాకొనెను నిషధ
యోగ్యుఁడగు లక్ష్మణుంగాంచి యుత్సుకుఁడయి

సోదరా! వోయి యొక మంచిచోటుఁ జూచి
కట్టుమా పర్ణకుటి మనకై బిఱబిఱ
శాంత సుందరమైన పంచవటి నేత్ర
పర్వమై కానిపించు నాపగనుఁజేరి

నలినాక్షుని యాజ్ఞను విని
పలికెను లక్ష్మణుఁడు వినయభావముతోడన్
స్థలనిర్ణయమ్ము సేయగ
నలవియగునె సేవకునకు నధికారముతో

నీవే స్థలనిర్దేశముఁ
గావించిన నాశ్రమమ్ము కట్టెద నే నా
తావున నీ రుచి మేరకుఁ
గావున నాప్రార్థనమ్ము కాదనకన్నా!

నీ వాయుష్మంతుఁడవై
జీవింతువు గాత! పూర్ణ జీవిత - మిటులే
జీవించెద నే నెప్పుడు
సేవకమాత్రునిగ నదియె సేవధినాకున్

మున్నెప్పుడు స్థలముల నీ
వెన్నుచు నీవేళ మాత్రమెందులకో స
న్నెన్ను చుసుచు భాషించితి
వన్నా! యిదియేమి చిత్రమని యెంచెద నేన్

పరతంత్రుఁడనే యగుదును
సరసీరుహనేత్ర! నీదు సన్నిధినున్నన్
నిరతము - స్వతంత్రుఁడనుఁగా
దిరవును మేలైన దాని నెంచుము నీవై

మనమీప్రాంతముఁ జుట్టివచ్చెదమురమ్మా! సుందరంబైన తా
వును నిర్ధారణసేయు మీవె-యచటన్ బొల్పార నేఁబర్ణశా
లను నిర్మించెద నీయభీప్సితముమేరం దృప్తిఁబొందింతు నం
చును సౌమిత్రి వినమ్రుఁడై పలికె నస్తుంకారముం గోరుచున్

తమ్ముని భక్తితాత్పర్యమ్ములకు రాము
ప్రేమ పొంగులువోయెఁ బ్రీతితోడ .
ననుజుని చేతులు, హస్తంబులం బట్టి
నా ప్రదేశంబెల్ల నట్టెచుట్టి
నొక్కయందంబైన చక్కటిఁ గనుగొన్న
జానకీరమణుని సరసహృదయ
మానందతుందిలంబై విభావస వంశ
మండనుండాతావు మదికి నచ్చి

తన్మయుండగుచుఁ బల్కె సోదరునిగాంచి
"చూచినాడవె? యెంతయొ సుందరముగ
కానిపించుచునున్న దీ కొనయందు
సకల సదుపాయములు కల్గు స్థలముకాదె! 134

గమనించితే! నేల సమతలంబుగ నుండె
నాశ్రమ నిర్మితి కర్హమగును
జౌడకట్టుచుండె గుంపులు, గుంపులై పూల
తరువులు దోచు చిత్తములఁ బెలుచ
భానుబింబమ్ములవలె ప్రకాశించుచు
గంధముల్ విరజిమ్ము కమలములును
కుముదముల్గల్గు నా కొలఁకు మనోహరం
బై యుండె కన్నులపండు వగుచు
కలదు గోదావరీ నిమ్నగయును నిచట
చక్రవాక కారండవ సారసాది
జలపతంగము లెన్నియో కలవు ముద్దు
ముద్దుగా విహరించుచు ముదముఁ గొలుప 135

నాతి దూరమ్మున నాతి సమీపమ్ము
నందుండె సారంగ బృందము లిట
పర్వతమ్ములు పెక్కు పంచవటిం జుట్టి
చూపట్టు లక్ష్మణా! సుందరముగ

పురివిప్పుచు నెమళ్ళు ముగ్ధమోహనముఁగా
సలుపు నృత్యమ్ములు కులుకుఁజూపి
నడగొండలటుఁదోఁచు నాగముల్ గిరికంద
ర ముఖమ్ములందు దూరమున గలవు

చిత్రచిత్రవర్ణమ్ములఁ జెలఁగు గైరి
కాది ధాతువులెన్నియో నలరుఁ బంచ
వటినిఁజూడఁ బ్రత్యక్షమౌ స్వర్గసీమ
సరగునం గట్టు మిచట నాశ్రమము మనకు 136

నాథునితోనున్న నాతి శ్రీ జానకి
పరవశించెను పంచవటినిఁ గల్గు
సౌందర్యమునుఁ గాంచి చక్షుష్యముగ నుండ
నటనిల్వఁ గాంక్షింప, నామెఁ గనుచు
రఘురాముడెంతయో రంజిల్లె సతి తృప్తి
నందంగ-లక్ష్మణుం డచట నొక్క-
మంజులమ్మగు యాశ్రమమ్ము నిర్మాణముఁ
గావించె నప్పుడగ్రజుని వాంఛ

మేరకు విశాలమైనది - మిట్ట పల్ల
ములను సరిచేసి జమ్మిరెమ్మలు, వెదుళ్ళు
దిట్టమైన స్తంభమ్ములఁదీర్చి రెల్లు
గడ్డితో దట్టముగ నేసె గడియలోన 137

పర్ణశాలగఁ బైకిఁ గన్పట్టుఁగాని
లోనికిం బోయిచూచిన లోఁగొను మది
నగ్నికార్యమ్మునకుఁ బూజకై, నిదురకు
నునికికిం గల్గు గదులందు సుచితములుగ 138

ఆశ్రమమ్మునకు వెలుపల నరుఁగులుండె
రెండుప్రక్కల కూర్చుండ నెండతగ్గి
చల్లఁబడినట్టివేళ విశ్రాంతిఁ గొనగ
మందమలయానిలమ్ము లానందమొసఁగ 139

తదుపరి లక్ష్మణుం డెదురుగానున్న గో
        దావరీ వారిఁ గృతావగాహుఁ
డై సుమఫలముల నట సేకరించి పు
        ష్పబలుల నొసఁగించి, శాంతి పౌష్టి
క క్రియలొనరించి సక్రమంబుగ, రాము
        నకుఁ జూప నా రఘునాథుఁ డంత
మైథిలితో నాశ్రమప్రవేశముఁ జేసి
        పరిరంభమొనరించి భ్రాతఁ బలికె

"నీ యుపకృతి యభినందనీయమగును
మఱువరానిది సుమ్ము నిర్మాణ కౌశ
లమ్ము కడుమెచ్చుఁ గొల్పు ముదమ్ముగంది
నాడ! నీవంటి తమ్ముఁడులేడు భువిని 140

నీ వొక ధర్మజ్ఞుండవు
భావజ్ఞుఁడ వగుదువయ్య ! పరిపరినాకై
నీ వెన్ని కష్టములఁ బడి
నావోచెప్పంగఁ దరమె ? నసయించితిగా ! 141

అని రామమూర్తి తమ్ముని
గొనియాడగ నతఁడు వినయకుంచితముగ న
వ్వెను "నా చేసిన గొప్పలు
పెనుపార" వటన్న భావవిజ్ఞత తోనఁకన్ 142

పక్షీంద్రుండు జటాయువున్ సతత మాక్రాంతమ్మునన్ మిత్రుఁడై
వృక్షాగ్రమ్ముల నిల్చి యెచ్చటనో యావేగమ్ముతో వైరులన్
వీక్షింపంగను రామలక్ష్మణులుఁ బృథ్వీజాతయున్ హాయిమై
సాక్షాద్దేవతలట్లు కాలమునుఁ బుచ్చన్ సాగి రాత్మజ్ఞులై. 143

మంగళం మహత్



# సవరింతలు

| పుట<br>1 | పద్య సంఖ్య<br>2 | పంక్తి<br>3 | తప్పు<br>4 | ఒప్పు<br>5 |
|---|---|---|---|---|
| 1 | 1 | 4 | మనిముఖ్యుల | మునిముఖ్యుల |
| 14 | 53 | 1 | నుంది | నుండి |
| 19 | 81 | 4 | నాప్యాయముగా | నాతనితో |
| 24 | 103 | 1 | తండ్రీఁప్రాణ | తండ్రీఁబ్రాణ |
| 29 | 115 | 2 | లేకనెట్టులో | లేకయెట్టులో |
| 32 | 123 | 2 | ఘూపుని | ఘూపుగ |
| 34 | 128 | 1 | విచిత్రత | విచిత్రిత |
| 35 | 132 | 4 | వచింతుఁడై | వంచితుఁడై |
| 38 | 140 | 4 | సారూప్య | సామీప్య |
| 40 | 2 | 10 | లేనిహాన | లేలిహాన |
| 40 | 3 | 4 | వెఱవరి | వెఱపరి |
| 42 | 13 | 4 | మిక్కిలిన్ | మిక్కిలన్ |
| 43 | 15 | 2 | రా్రమా! | రామా! |
| 43 | 15 | 1 | పేమన్ | ప్రేమన్ |
| 46 | 30 | 3 | నటులే | నట్టులే |
| 48 | 34 | 3 | వృద్దుల | వృద్ధుల |
| 49 | 38 | 2 | పొల్చు | పొల్పు |
| 52 | 51 | 1 | అదాయము | ఆదాయము |
| 61 | 86 | 2 | మారఁ | మాఱఁ |
| 62 | 88 | 1 | గదల్చెకొని | గదల్చెఁగాని |
| 64 | 96 | 4 | రర్మినిన్ | రర్మిలిన్ |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 64 | 97 | 1 | ఫాలభాగపై | ఫాలభాగలై |
| 66 | 101 | 1 | రాజపత్నులు | తల్లులందఱు |
| 70 | 121 | 2 | నున్న। | మన్న। |
| 76 | 1 | 1 | ముద్వాసముఁజేసి | ముద్వాసముంజే! |
| 77 | 9 | 3 | స్వార్థమ్మ | స్వార్థము |
| 77 | 10 | 2 | ప్రాకాశ్యముగ | ప్రాకాశ్యమ్ముగ |
| 82 | 27 | 1 | పయినమ్మ | పయనమ్మ |
| 83 | 30 | 1 | ర_క్తశోణితములే | శు_క్లశోణితములే |
| 84 | 33 | 2 | నతఁడు | నరుఁడు |
| 88 | 51 | 2 | కర్మినితమ్మ కుజ్జకున్ | కర్మిలితమ్ముఁ గుజ్జకు! |
| 89 | 57 | 1 | యత్నింపగ | యత్నింపంగ |
| 90 | 65 | 2 | ర్యాదావేతము | ర్యాదాపేతము |
| 92 | 75 | 4 | కాపాడు | ఁగాపాడ |
| 95 | 88 | 2 | నట్టివారి | నట్టివాని |
| 97 | 94 | 2 | "ఓచిరంజీవి। | "నోచిరంజీవి। |
| 99 | 101 | 3 | నేహేరాళముగా | నేహితవరిగా |
| 103 | 119 | 1 | నిర్భీతమై | నిర్భీతిమై |
| 103 | 120 | 3 | రకనసుర_క్తి | రకయనుర_క్తి |
| 112 | 159 | 2 | నుపదేశికు | నుపదేశకు |
| 116 | 177 | 4 | భావమ | భావము |
| 118 | 187 | 2 | రాయఁ | రాముఁ |
| 120 | 197 | 2 | తథమునకందఱుకున్ | ధర్మమున కందఱున్ |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 120 | 107 | 3 | ధరిగి | తిరిగి |
| 126 | 25 | 2 | నెంతో | నెంతొ |
| 128 | 33 | 2 | పడచు | పడుచు |
| 131 | 42 | 9 | పరుప | పఱుప |
| 139 | 75 | 1 | రూవ ...లతో | రూపములతో |
| 141 | 81 | 12 | ....ప్పువలన | ముప్పువలన |
| 153 | 132 | 3 | నట్టె × పరాక్రమముఁ | × పరాక్రమము నట్టె |
| 156 | 145 | 4 | విసుమాన.గా | విసుమానముగా |
| 157 | 150 | 1 | రాజ్యనకు | రాజ్యమునకు |
| 168 | 3 | 2 | మిరిమిట్లు | మిఱుమిట్లు |
| 173 | 21 | 3 | నెన్నొ | నన్ని |
| 181 | 50 | 8 | పుటిముంచు | పుట్టిముంచు |
| 188 | 75 | 3 | శ్రేష్ఠ్యమ్మౌను | శ్రైష్ఠ్యమ్మౌను |
| 194 | 102 | 1 | ప్రతి | పతి |
| 208 | 160 | 4 | భావించు | భావించి |
| 220 | 207 | 3 | మాన్యంబయి | మాన్యంబగు |
| 232 | 40 | 6 | జంతువితతు | జంతువితతి |
| 234 | 46 | 2 | విచిత్రం | భరం |
| 242 | 81 | 10 | నిప్రదేశము | నీప్రదేశము |